

శ్రీ చక్రపాణిగారికి నమస్కారములు

పత్రికలలో "యువ"కు ప్రత్యేకస్థానం వుంది. పాఠకులను ఆకర్షించటంలో కూడా దానికి ప్రత్యేకత కలదు అదే విధంగా దీనిస్థాయినికూడా ప్రత్యేకంగా ఉంచేట్టు చూడండి.

ప్రస్తుతం రూపాయి ధరతో సుమారు 150 పేజీలు వేస్తున్నారు. మరో 80 లేదా 100 పేజీలు హెచ్చించి - రూపాయిన్నర చేసినా బాగా అమ్ముడు అవుతాయి.

పత్రిక గెటప్ గూర్చిగాని, రచనలు గూర్చిగాని మీకు వేరేగా తెలియపరచ వలసిన అవసరం వుండదు.

పాఠకులకు మనస్ఫూర్తిగా, చేతికి నిండుగా ఉండేట్లు 'యువ'ను తయారు చేయండి. అదే నా కోరిక.

రాఘా గోవింద పాధి
పార్వతీపురం


అందినస్వర్గాన్ని నరకం చేసుకుని నరకప్రాయమైన స్వర్గంకోసం ప్రాకులాడే ఎందరో వాళ్ళ
సమస్యకు పరిష్కారం ఏమిటి? రసవత్తరమైన కథకు రమణీయ రూపకల్పన చూడండి!
K.రాధాకృష్ణమూర్తి సమర్పించు
డి.బి.యస్ డగా ఫిలిమ్సు
అన్నదమ్ములు
నిర్మాతలు { డి.బి. నారాయణ
డి. రామగోపాలరెడ్డి
దర్శకత్వం వి. రామచంద్రరావు B.A.Hons
సంగీతం కె. వి. మహదేవన్
మాటలు భమిడిపాటి రాధాకృష్ణ
కెమెరా వి. యస్. ఆర్. స్వామి W.I.C.A
ఆర్ట్ కళాధర్
కూర్పు బి. గోపాలరావు

ఎడిటర్ గారికి,

అక్టోబరు సంచిక గాంధీ శతజయంతి సంచికగా ప్రచురిస్తారని ఈ సంచికలో చూచాము. ప్రత్యేక సంచికకోసం ఎదురు చూస్తున్నాము. గాంధీ శతజయంతి సందర్భంలో ప్రత్యేకసంచిక ప్రచురిస్తున్నందుకు మా ధన్యవాదాలు.

రామకోటి-రామరాజు. గుంటూరు.

సంపాదకులకు.

'యువ' పత్రిక క్రమాభివృద్ధి పొందుతూ అశేష పాఠకులను అలరిస్తున్నదనటంలో అతిశయోక్తి లేదేమో! తెలుగుభాషలో 'రీడర్స్ డైజెస్టు'లా 'యువ' ప్రచురించబడాలని కోరుతున్నాము. కొన్నిపేజీలు పెంచి, ధర ఇంకొంచెం పెంచినా 'యువ' పాఠకులకు అభ్యంతరం ఉండబోదని నా నమ్మకం. కథలు, కార్టూనులు బాగుంటున్నాయి.

వెంకటేశ్వర్లు
నెల్లూరు.

సంపాదకులకు,

సెప్టెంబరు యువ చదివాము. ఈ నెలలో కథలన్నీ బాగున్నాయి. 'మీనా' పోనుపోనూ చదువుటకు ఆశక్తి పెరుగుతున్నది. పేజీకథలు ఎక్కువ ప్రచురించండి వీలునుబట్టి.

గోపాలరావు
కర్నూలు.

**A Story of a Woman who has Dedicated her Life to the happines of others**




PRODUCED BY A. A. NADIADWALA DIRECTED BY KHALID AKHTAR MUSIC LAXMIKANT PYARELAL LYRICS MAJROOH

***COMING VERY SOON AT***

| ZAMRUD MAHAL | NATRAJ | ASHA |
|---|---|---|
| (Air Conditioned) | (Air Conditioned) | HYDERABAD |
| HYDERABAD | SECUNDERABAD | |

Released through -

M/S SHINDE SARPOTDAR & CO ,
5, Rashtrapathi Road,
SECUNDERABAD A P



మీ ముఖ
సౌందర్యానికి









రెమి ®
టాల్కం పౌడర్

SARATH

# మార్గదర్శి చిట్ ఫండ్ విజయవాడ వచ్చేసింది!

మార్గదర్శి చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్ నిర్వాహకులు తమ విజయవాడ శాఖను ప్రారంభించినట్లు సంతోషంతో ప్రకటిస్తున్నారు. మర్యాద మన్ననలకు, మోతుబరి తనానికి మచ్చుతునక మార్గదర్శి అని మంచి పేరు తెచ్చిన మా సమయజ్ఞతను, సమర్థవంతమైన సేవను ఈ పట్టణవాసులకు సమర్పిస్తామని ప్రమాణం చేస్తున్నారు.

మార్గదర్శి చిట్ ఫండ్ మీకు ఇవ్వగలిగినదేమిటి ? * చక్కని రాబడివున్న భద్రమైన పెట్టుబడి * అవసరమైనప్పుడు నగదు రొక్కం పుట్టించగల శక్తి నెలనెలా ఒక పద్ధతి ప్రకారం ఆదా చేయటం * సహాయానికి సర్వదాసిద్ధంగా వుండే అడకువగల సిబ్బంది * డబ్బు వ్యవహారాల్లో చక్కని సలహా * నిబ్బరమైన నమ్మకం * మీ సొమ్ముకు పూర్తి భద్రత

మార్గదర్శి చిట్ ఫండులో చేరండి

మీ సేవే మాకానందం, మా మహాభాగ్యం

| కొత్త చీటీలు | 20000 | 10000 | 5000 | 2500 |
|---|---|---|---|---|
| 1500 | 1250 | 1000 | 750 | 500 |






డబ్బుకోసమేనా మీ చింత ?
మార్గదర్శి ఉన్నది మీ చెంత !

## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్
బిసెంట్ రోడ్, విజయవాడ-2

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 20 అక్టోబరు, 1969 సంచిక 4


ఇది గాంధీ శతవర్ధంతి వత్సరము. 1969 అక్టోబరు 2 వ తేదీకి గాంధీజీ జన్మించి నూరు సంవత్సరాలు పూర్తి అవుతాయి. రివాల్వరు దెబ్బకు గురికాకుండావుంటే, బహుశా యీనాటికీ గాంధీజీ జీవించి వుండేవాడేనేమో. "నూటపాతిక సంవత్సరాలు జీవించాలని వుంది. అలా జీవించగలనుకూడా," అని గాంధీజీ పదేపదే చెప్పాడుకూడాను.

కాని, నిజంగా యీనాడు గాంధీజీ జీవించివుంటే, దేశం పరిస్థితులు, తన అనుయాయుల ప్రవర్తన ఆయనకు ఎంతో దుఃఖం కలిగించేవి. స్వాతంత్ర్యం వచ్చి ఇరవైరెండు సంవత్సరాలు అయింది. గాంధీజీ హతుడై ఇరవైరెండు సంవత్సరాలు నిండవస్తున్నవి. స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకొని మనం సాధించిన అభివృద్ధి నామమాత్రంకాగా, గాంధీజీ బోధించిన నైతిక ప్రవర్తన విషయంలో, ఆయన బోధలను పూర్తిగా వదలివెయ్యడమేకాక కేవలం పశుప్రాయదశలోకి వెళ్లామంటే అతిశయోక్తి కాదు.

గాంధీజీ బోధలలో ప్రధానమైనవి, అహింస, సత్యప్రవర్తన. యాభైసంవత్సరాలు అహింసామతాన్ని బోధించి, దానిని ఆచరణలోపెట్టిన మహాత్ముడు, తన ప్రాణాలను ఒకహింసాచర్యకు బలియివ్వడం జరిగిందంటే, మహాత్ముని బోధలకు మనం ఎంత అనర్హులమో స్పష్టమైంది. అంతటితో ఆగిందా! ప్రతిసంవత్సరమూ,

ఏదో ఒక ఉద్యమం పేరుతో విధ్వంసకాండను సాగిస్తూనే వున్నాము. రైలుపెట్టెలను, రైల్వే స్టేషనులను, బస్సులను, ప్రభుత్వకార్యాలయాలను తగలబెడుతున్నాము. మనం తగలబెడుతున్న ప్రతీదీ ప్రజల డబ్బేననీ, దానిని తగలబెట్టినందువల్ల మన సొమ్ము మనం తగల బెట్టుకోవడమేకాక, తగలబడిన వస్తువు లేనందువల్ల ఎంతో కాలం మనం ఇబ్బంది పడాలనీ, మళ్లీ ఆ వస్తువును సమకూర్చుకోవాలంటే మన డబ్బే బోలెడు ఖర్చు పెట్టాలనీ క్షణ మాత్రమైనా అలోచిస్తున్నామా? గాంధీజీ మరణించిన తరువాత, యీ ఇరవై ఏళ్ళలోనూ దేశం మొత్తంమీద మనం తగల పెట్టిన ఆస్తుల విలువ అధమం నూరుకోట్ల రూపాయలు వుంటుంది. ఈ డబ్బు అంతా ప్రజలిచ్చినదే. ప్రజలే తగలబెట్టారు. మళ్లీ యీ నష్టాన్ని పూడ్చడానికి డబ్బును పన్నుల రూపంలో ప్రజలే యిస్తున్నారు. ఈ విధంగా నష్టమైన డబ్బు ప్రజల చేతుల్లోనే వున్నా, ప్రభుత్వం వద్దవున్నా, ప్రజలకు ఎన్నో సదుపాయాలను కలిగించడానికి ఉపయోగపడేదికదా? ఏమాత్రం సంకోచంలేకుండా తమ ఆస్తిని తామే తగలబెట్టుకొనే ప్రజలు ప్రపంచంలో మరే దేశంలోనైనా వున్నారా? ఇలా చెయ్యడం, ప్రజలలో ఒక వర్గం మరొక వర్గాన్ని హింసించడంకాదా! ఈ హింసా పద్ధతులను, తాను జీవించి ఉంటే గాంధీజీ సహించేవాడేనా?

మద్యనిషేధాన్ని అమలు జరిపితేనేగాని, సామాన్య కుటుంబాల పరిస్థితి బాగు పడదనీ, ప్రజల నైతిక ప్రవర్తన ఉన్నత స్థాయికి రాదనీ గాంధీజీ బోధించాడు. ఆయన జీవించి ఉండగా చాలా రాష్ట్రాలు మద్యనిషేధాన్ని అమలుజరిపాయి. కాని, దొంగసారా కాయడమూ, విదేశీ మద్యాలను దొంగతనంగా తెచ్చి అమ్మడం జరుగుతూనే వున్నాయి. మద్యనిషేధంవల్ల ప్రభుత్వాల ఆదాయంపోగా, దొంగ వ్యాపారం చేసిన వ్యక్తులు ఎంతోమంది ధనికులు అయారు. దొంగ డబ్బు బలంతో రాజకీయాలలో పలుకుబడి సంపాదించి, ప్రభుత్వ విధానాలనే అవినీతి మార్గాలలో నడిపిస్తున్నారు. కొన్ని ప్రాంతాలలో మద్యనిషేధం వుండటమూ, తక్కిన ప్రాంతాలలో లేకపోవడమూవల్ల మద్యనిషేధంవున్న ప్రాంతాలవారు లేని ప్రాంతాలకు వెళ్ళి తాగుతున్నారు. మద్యనిషేధంవున్న ప్రాంతాల డబ్బు, లేని ప్రాంతాలకు పోతున్నది. మద్యాలమీద వేసిన పన్నును ఒకపెద్ద ఆదాయంగా పరిగణిస్తున్న కొన్ని రాష్ట్రాలను చూసి, మద్య నిషేధం అమలులోవున్న రాష్ట్రాలు కూడా మద్యనిషేధాన్ని రద్దుచెయ్యడానికి నిశ్చయించాయి. ఫలితం ఏమిటంటే, గాంధీజీకి అత్యంత ప్రియమైన మద్యనిషేధం, గాంధీజీ శతవార్షికోత్సవ సందర్భం లోనే రద్దుకాబోతున్నది.

నైతికంగా ప్రజలప్రవర్తన యీనాడు అతిహీనస్థితికివచ్చింది. రాజకీయాలలోనూ, వ్యాపారంలోనూ, ఉద్యోగాలలోనూ, అవినీతి విస్తారంగావ్యాపించింది. విద్యార్థుల నుండి డబ్బుతీసుకొని మార్కులువేసే ఉపాధ్యాయులూ, కంట్రాక్టరుల డబ్బుతిని వాళ్ళవేసినరోడ్లూ వంతెనలూ సరిగాలేకపోయినా సరిగావున్నాయని రిపోర్టువ్రాసే ఇంజనీర్లూ, డబ్బుయిస్తేనేగాని పొలాలకు నీళ్ళువదలని ఇంజనీర్లూ, డబ్బుయిచ్చిన తరువాతనే కాగితాలను కదిలించే గుమాస్తాలూ, పలుకుబడితో పర్మిట్లు సంపాదించి పెద్ద మొత్తాలకు వాటిని అమ్ముకునే పెద్దమనుష్యులు, కల్తీకలపనిదే సరకులను అమ్మని వ్యాపారస్తులూ, మామూళ్ళు చేతిలోపడితేగాని వీధులను శుభ్రంచెయ్యని మునిసిపల్‌నౌకర్లూ, స్వార్థంకోసమూ తమపదవిని నిలబెట్టుకోవడముకోసమూ ప్రజలను రెచ్చగొట్టి విధ్వంసకచర్యలను ప్రోత్సహించే రాజకీయనాయకులూ – ఇలాగే ఎంతోమంది ప్రతివర్గంలోనూ, ప్రతిశాఖలోనూవున్నారు. ఇంత ఘోరమైన నైతికపతనం ఇది వరకు ఎప్పుడూ, ఏ పరిపాలనలోనూ, ఏయుగంలోనూ మన దేశం ఎరుగదు. నీతి, నిజాయితీ, సత్ప్రవర్తనగల వ్యక్తులు వున్నారు, లేకపోలేదు. ప్రతిశాఖలోనూ, ప్రతివర్గంలోనూ వున్నారు. కాని, వారి మాటచెల్లడంలేదు నిజాయితీ, నీతి, సత్ప్రవర్తనలు అసమర్థతగా పరిగణింపబడుతున్నాయి. స్వతంత్ర భారతదేశంలో గాంధీజీ కోరినపరిస్థితి ఇదికాదు. ప్రజలందరూ సహకారభావంతో, సౌమనస్యతతో, ఒకరిమేలు మరొకరు గమనిస్తూ, సమష్టిగా దేశం బాగుపడాలనే కాంక్షతో కృషిచెయ్యాలని గాంధీజీ కోరాడు. ఆ బోధలను దృష్టిలో వుంచుకున్నవారు యీనాడు ఎంత మంది ఉన్నారు ?

ప్రధానంగా వ్యవసాయిక దేశంగాప్రఖ్యాతిపొందిన మనదేశంలో మనకు కావలసిన ఆహారధాన్యాలను పండించుకోలేక పోతున్నాము. వ్యవసాయానికి పనికి వచ్చేభూమి ఎంతో బీడుగావుంది; పండినచేనిలోనే మరోపంట చొప్పున ఏడాదికి మూడుపంటలు, ఫెర్టిలైజర్ల సహాయంతో పండించడం జరుగుతోంది. ఈనాడు మనంతినే ఆహారంలో ప్రతి పదిబౌన్సులలోనూ ఎనిమిదిఔన్సులు ఫెర్టిలైజర్లూ, ఒక ఔన్సు పెస్టిసైడ్సూ, ఒక ఔన్సు పీచు. ఇలాటి ఆహారాన్నితిని ప్రజలు నిర్వీర్యులవుతున్నారు ప్రతికుటుంబంలోనూ వారు తినే ఆహారపు ఖర్చుకు రెండింతలు మందులఖర్చు అవుతోంది. నీళ్ళు కలవని పాలుగాని, ఏదో ఒక ఆయిలు కలవని నెయ్యిగాని తినగల కుటుంబాలు ఎన్నివున్నాయి ? పాలకూ, పెరుగుకూ, నెయ్యికీ ప్రఖ్యాతిపొందిన మనగ్రామాలలో యీనాడు పశువులే సరిగా కినపడవే!

గ్రామాలు బాగు పడాలి; గ్రామాలు బాగుపడితేనే దేశం బాగుంటుంది. గ్రామాలలో

కుటీర పరిశ్రమలు విరివిగా ఏర్పడాలి అని గాంధీజీ నిరంతరమూ బోధిస్తూ వచ్చాడు. కాని, గ్రామాలు బాగుపడటంలేదు. గ్రామస్తులలో కొంతమంది బాగుపడి పట్టణాలకు చేరుకుంటున్నారు. బాగుపడలేనివారూ పట్టణాలకు చేరుకుంటున్నారు. పనిలేనివారితో, దుర్గంధభూయిష్ఠమైన కాలువల ప్రక్కన నరకకూపాలలాంటి గుడిసెలలో యాతనా జీవితాన్ని గడుపుతున్న కుటుంబాలు పట్టణాలలో ఎక్కువైపోతున్నాయి. గ్రామీణాభివృద్ధికోసం అనే పేరుతో రాష్ట్ర ప్రభుత్వాలు ప్రతి ఏటా ఖర్చు పెడుతున్న కోటానుకోట్ల రూపాయలు ఏమైపోతున్నాయోగాని, స్వయం పోషకంగా, ఆకర్షవంతంగా, ఆనందమయంగా వున్న గ్రామం ఒక్కటీ కనపడదు.

గాంధీమహాత్ముడు సాధించిన మహత్తర కృషి ఏమిటంటే, హరిజనులకు దేవాలయ ప్రవేశం. హిందువులకు సంబంధించినంత వరకు, ఏ కులంవారైనా దేవాలయాలలోకి వెళ్లటానికి యీనాడు ఆటంకం ఏమీ లేదు. అయితే, యీ విషయంలో కూడా మనం ఒక అడుగు ఇంకా వెనకబడి వున్నాము. ఏ మతంవారైనా సరే మన ఆలయాలలోకి రావడానికి ఆటంకం వుండకూడదు. దేవాలయంలోకి రాదలచిన వ్యక్తి ఏ మతం వాడైతే నేమి ? దేవుని దర్శనంకోసం గదా వస్తాడు ? దేవుని దర్శనం కోరని క్రైస్తవుడు కాని, ముస్లిం కాని హిందూ దేవాలయంలోకి వెళ్లడానికి ప్రయత్నమే చెయ్యడు. అంచేత దేవాలయంలోకి ఏ జాతివారు, ఏ మతంవారు వెళ్లినా, ఆటంకం వుండకూడదు. దేవునికి మతం లేదు. హిందూ దేవుడనీ, ముస్లిం దేవుడనీ, క్రిష్టియను దేవుడనీ, దేవుళ్లు మతాలవారీగా లేరు. ఏ దేవాలయం, ఎక్కడ వున్నా, ఆ ఆలయంలోని దేవుని దర్శించడానికి ఎవరు వెళ్లినా ఆటంకం లేనప్పుడే సర్వమత సమానత్వం నిజమౌతుంది. గాంధీజీ వాంఛకూడా ఇదే.

మహాత్ముని నూరవ జన్మదిన సందర్భంలో, ఒక్కరోజైనా మనం ఆత్మపరిశోధన చేసుకొని, మన ప్రవర్తనలోని లోపాలను గ్రహించి, వాటిని సరిదిద్దుకోవడానికి నిశ్చయించుకుని, ఆ క్షణం నుంచీ దేశంకోసం, సోదర ప్రజలకోసం నీతిమార్గాన నడవడం ప్రారంభిస్తే, మనకోసం సర్వత్యాగంచేసి, మనకోసం ప్రాణాలనే అర్పించిన మహాత్ముని బోధలను ఆచరణలో పెట్టిన వాళ్లమే కాకుండా, మనలనూ మన దేశాన్నీ ఉద్ధరించుకున్న వాళ్లమవుతాము.






ప్రార్థన నా ప్రాణము నిలిపినది. ప్రార్థన లేనిచో చిరకాలము క్రిందటనే నేను ఉన్మాదిని కావలసినది. పరమ దుఃఖభాజనమైన స్వీయానుభవములందును, లోకముతోడి అనుభవములందును నాభాగ మనుభవించి తాత్కాలికముగా నిస్పృహ చెందితిని. ప్రార్థన వలననే నిస్పృహను వీడగలిగితిని. సత్యమంతగా ప్రార్థన నా జీవితాంశము కాలేదు. ప్రార్థన కేవల మవసర హేతువుచే కలిగినది. ప్రార్థన వినా సుఖముండ లేననిపించిన స్థితిలో పడితిని. దైవభక్తి హెచ్చైన కొలది ప్రార్థనపై నా ఆసక్తియు ఓపరానిదయ్యెను. ప్రార్థన వినా బతుకు స్తబ్ధుగా శూన్యమనిపించెను.

దక్షిణాఫ్రికాలో క్రైస్తవ మత ప్రార్థనలకు పోతిని కాని అవి నన్ను ముప్పిరిగొనలేదు. నా క్రైస్తవ స్నేహితులు భగవంతుని ప్రార్థించిరి కాని నేనట్లు చేయలేక పోతిని. భగవంతుడన్నను ప్రార్థనయన్నను అవిశ్వాసముతో ఉపక్రమించితిని. జీవితములో చిరకాలము వరకును నా కేమియు లోటనిపించలేదు. కాని అట్లనిపించినసమయములో శరీరమునకు అన్నమెట్లు పరమావశ్యకమో, ఆత్మకు ప్రార్థన అటే పరమావశ్యకమని గ్రహించితిని. నిజమునకు ఆత్మకు ప్రార్థన అవసరమైనంతగా శరీరమునకు అన్న మవసరము కాదు. శరీరారోగ్యమునకై తరచుగా అభోజన మవసరమగును. కాని ప్రార్థన పస్తు అన్నది లేదు. ప్రార్థనకు వెక్కసమనునది ఉండదు.

ప్రార్థనవల్ల బోధమైనది, అది వినా జీవించియుండమని. మహోత్కృష్టులగు జగద్గురువులు ముగ్గురు శంకించరాని సాక్ష్యము చూపినారు. లక్షలాది క్రైస్త

వులు, హిందువులు, ముస్లింలకు జీవిత మందలి ఒకిటే వూరట ప్రార్థన మూల మున కలుగుచున్నది. వారు అబద్ధీకులని లేదా ఆత్మవంచితులని అనవచ్చును కాని సత్యాన్వేషకుడనైన నాకు క్షణమైనను ఏ ఆలంబము లేక జీవింప సాహసింప, అ జీవనాధారము అబద్ధీకమైనను ఆ అబ ద్ధీకము నాకు పుచ్చటనిపించును. రాజ కీయ క్షేత్రాంచలనమున నిస్పృహ నా కెదుపై తేరిచూచినను నేనెప్పుడు శాంతిని కోల్పోలేదు. వాస్తవమునకు నా శాంతిని చూసి అసూయపడువారు నా కంటపడిరి. అశాంతి ప్రార్థనపలనకుదుడుకొనుచున్నది.

నేను పండితుడునుకాను గాని ప్రార్థన చేయువాడనని వినయముగా తెలుపుకొను చున్నాను. దాని స్వరూపము గురించి నాకు ఉపేక్ష. ఆ విషయమున ఎవరికి వారే నిర్ణేతలు అయినను కొన్ని నలిగిన బాటలున్నవి. ప్రాచీన బోధకులు నడిచిన బాటలో అడుగిడిపోవుట భద్రము.

## ఆగని నవ్వు

మనజాతి బానిసత్వపు సంకెళ్ళను తెగగొట్టడానికి కాలపురుషుడు ఎన్నో గొప్ప బాణాలను ఉపయోగించాడు. ఇలా ఉపయోగింపబడిన మహానుభావులలో కీ. శే. చిత్తరంజన్ దాస్ ఒకరు. ఆయన మరణవార్త యావద్భారత దేశాన్ని ప్రత్యేకంగా వంగరాష్ట్రాన్ని కడలేని దుఃఖసాగరంలో ముంచింది. ఇక ఆయన కుటుంబం సంగతి చెప్పటమెందుకు ?

శ్రీమతి దాస్‌ను పరామర్శ చేయడానికి గాంధీజీ కలకత్తా వెళ్లారు. ఆమె కూర్చున్న మంచంమీదనే ఆయనకూడా కూర్చుని మాట్లాడుతున్నారు. ఆమెను ఆవరించివున్న దుఃఖాంధకారాన్ని ఆయన చిరునవ్వు కిరణాలు బాణాలవలె తాకుతున్నాయి.

మాటల మధ్య బాపూజీ తాపీగా ఒకమాట అడిగారు. "నన్ను పెం చేసుకుంటావా ?" అని.

శ్రీమతి దాస్‌కు నవ్వాగలేదు. అంతదుఃఖమూ ఎటుమాయమైపోయిందోగాని ఆమె పొట్టచెక్కలయేటట్లు నవ్వింది. ఆమె దుఃఖాన్ని తుడిచివేయనెంచి వచ్చిన ధ్వాంధ్వాతీతుడు తానుకూడా తృప్తిగా నవ్వుతూ లేచాడు.

[ఊట్ల కొండయ్యగారి 'గాంధీపథము' నుంచి]



# పెళ్లి పౌరోహిత్యం

మన భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందు డాక్టర్ ఏ జి టెండూల్కర్ అనే వరుడికీ, సౌ॥ ఇందుమతి గుణజీ అనే వధువుకీ కొత్తపద్ధతిలో వివాహం జరిగింది సేవాగ్రాంలోని 'కస్తూరిబా కుటీరం' కల్యాణమండపం. పెళ్లి చేయించిన ఆచార్యుడు మన బాపూజీ. ముందుగా సదస్యుల వేపు తిరిగి, "నేను జరుపుతున్న ఈ వివాహ కార్యం చూడ వచ్చిన మీరు – వధూవరులు తీసుకొంటున్న ప్రమాణాలు నిష్కళంకమై, నెరవేరటానికి తోడ్పడ కోరుతున్నాను" అంటూ, గాంధీమహాత్ముడు కార్యకలాపానికి ప్రారంభం చేశాడు. వధూవరులకు ఆయన వేసిన ఈ పదకొండు ప్రశ్నలే ఆ ప్రారంభం :

1 స్థిరమనస్సుతో బాగా ఆలోచించిన మీదటనే మీరు దంపతులు కావటానికి నిశ్చయించారా ?

2. సప్తయజ్ఞాలూ నిర్వహించారా మీరు ? (వీటిలో గోపూజ, జలపూజ చేరివున్నాయి.)

3 వివాహం అనేది కామతృప్తికోసం మాత్రమే కాదు అని మనస్ఫూర్తిగా నమ్ముతున్నారా ?

4. సేవ, త్యాగం, ధర్మం అనే సుగుణాలను అమలు చేదామనే మనసుతోనే గృహస్థ జీవితంలో ప్రవేశిస్తున్నారా ?

5. జీవిత లక్ష్యాలను సాధించటంలో ఒకరికొకరు అడ్డురాక, పరస్పరం సహాయం చేసుకోవటానికే మీరు పూనుకుంటారా ?

6. మనసా, వాచా, కర్మణా మీ రొకరికొకరు తోడునీడగా వుంటారా?

7. మన భారతదేశం స్వాతంత్ర్యం పొందేటంతవరకూ పూర్తి బ్రహ్మచర్యం అవలంబించటానికి మీరు హృదయపూర్వకంగా ప్రయత్నిస్తారా ?

8. అస్పృశ్యులనబడేవారితో సహపంక్తి భోజనం, అంతర్వివాహం ఉండాలని మీరు నమ్ముతారా ?

9. స్త్రీ పురుషులు సమానులని భావి స్తున్నారా ?

10. యజమానీ, సేవకురాలూ అనే భేదభావం లేకుండా, కేవలం మిత్రులుగా జీవయాత్ర సాగించటానికి మీరు ఇష్టపడుతున్నారా ?

11. 'సప్తపది'కి బదులుగా సప్తయజ్ఞాలు అమల్లోకి రావడాన్ని మీరు సమ్మతిస్తారా ?

ఈ ప్రశ్నలకు వధూవరులు సమాధానం చెప్పాక, "నేను స్వయంగా వడికిన యీ నూలుతో మీ ఇద్దరినీ దాంపత్యబద్ధులుగా చేస్తున్నాను. ధర్మవివాహితమైన ఈ బంధాన్ని మీ ఉభయులూ అతి జాగ్రత్తతో కాపాడుకోండి. ఇది ఎన్నడూ విచ్ఛిన్నం కాగూడదు సుమండీ! ఈ మాట మరవకండి. ఇప్పుడు చేసిన ప్రమాణాలకు అనుగుణంగా నడుచుకోవటానికీ, పవిత్రమైన ఈ వివాహ విధులు అనుసరించి ఎప్పుడూ మెలగటానికీ తగినశక్తి నిమ్మని భగవంతుణ్ణి ప్రార్థించండి," అన్నాడు.

గాంధీజీ ఉద్దేశంలో ఆదర్శవివాహం అంటే ఎలా ఉండాలో దీన్నిబట్టి తెలుస్తుంది.

---

సత్యానికి కట్టుబడినవాడు, సాంప్రదాయ విరుద్ధంగా ఏదీ చేయకపోవచ్చు. అయితే తనను తాను సరిదిద్దుకోడానికి సంసిద్ధుడై ఉండాలి. తనది తప్పయినప్పుడు, ఒప్పుకొని అందుకు పరిహారం చేసుకోవాలి.

# వివిధ దశలలో మహాత్ముని ఆదర్శాలు
# న్యాయవాదిగా



మోహన్‌దాస్ కరంచంద్ గాంధీనుండి మహాత్మా గాంధీగా పరిణతి నొంద టానికి గాంధీజీ ఎంత దూరం పయనించ వలసివచ్చినదో ఆయన జీవిత చరిత్ర తెలిసినవా రందరూ ఎరుగుదురు. మామూలు మానవుడు మహామనీషిగా రూపొందటానికి ఎన్ని మజిలీలు దాటాలో, ఎన్నెన్ని సోపానాలు అధిరోహించాలో, ఎటువంటి ఆదర్శాలను గమ్యంగా వుంచు కోవాలో, ఎంత దృఢసంకల్ప మవస రమో, మరింకెంత సాధన ఆచరణలో అమలు జరుపాలో గాంధీజీలోని క్రమ పరిణామము సుస్పష్టముగా రుజువు చేస్తుంది. సామాన్యమానవుడు తన ప్రయ త్నంతో స్వయంకృషితో ఆత్మశక్తితో పెరిగి యింతై మరింతై చివరకు విశ్వ మానవతకు ప్రతినిధియై ప్రతిబింబమై మానవజాతి పురోగమనానికి రహదారు లను దీప్తిమంతము చేసిన అమరగాథ గాంధీ కథ. మహత్తరమైన యీ గాంధీ పరిణామాలలో ప్రధాన కారణములలో ఒకటిగా, ప్రయోజనాత్మకమైన ప్రభావా లలో మొదటివిగా కనిపించేవి గాంధీజీకి కలిగిన న్యాయశాస్త్ర సంబంధము, న్యాయ వాది జీవితమును.

గాంధీజీ వ్యక్తిత్వంలోనూ, గాంధీజీ ప్రసరించిన సంస్కృతిలోనూ ప్రధాన లక్షణాలుగా వుండేవాటి కన్నిటికీ పునా దులు, బీజాలు వీటిలో ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. గాంధీజీలోని ప్రతి అణు వునూ కదిలించిందీ, ఆయన భావాలనూ ఆదర్శాలనూ వెలిగించిదీ, ఆయన సంస్కృ తిని ప్రజ్వలింపచేసిందీ, ఆయనలోని అంతులేని, ఎనలేని మానవత. మాన వుడు ఆయనకు సత్యం, ఆదర్శము, కార్యక్షేత్రము, సర్వస్వమున్నూ. భావాల మధ్య సుడిగుండాలలో యిరుక్కొని మనిషిని, అతని జీవితాన్ని విస్మరించని వాడు గాంధీజీ. మానవుని వున్నతుని చేయ టమే పరమావధిగా పెట్టుకున్న మహా మనీషి ఆయన. అందువల్లనే ఆయన తలపెట్టిన ప్రతి భావనలోను, చేపట్టిన ప్రతి కార్యక్రమంలోను యీ మానవత ప్రాథమిక లక్షణంగా వెలుగొందేది.

---

ఆవుల సాంబశివరావు

---

గాంధీజీ భారతీయ సంస్కారాన్ని బాగా పంటపట్టించుకున్నవాడు. ఈ సంస్కారానికితోడు యింగ్లాండులో ఆయన చదివిన న్యాయశాస్త్రము, బ్రిటిష్ వారితో ఆయన జరిపిన సహచర్యం, అటుపిమ్మట భారత దేశంలోనూ దక్షిణాఫ్రికాలోను చేసిన న్యాయవాదవృత్తి మరికొన్ని ప్రభావాలను తెచ్చిపెట్టినాయి. మానవ వ్యక్తిత్వానికి వుండవలసిన విలువ, వ్యక్తిస్వాతంత్ర్యానికి చూపించవలసిన భద్రత, పౌరహక్కులయెడ పట్టింపు, న్యాయదృష్టిలో అందరూ సమానులేనన్న ప్రజాస్వామ్య ఆశయం, ఇవన్నీ ఆనాటి సంపర్కాలలోనుండే గాంధీజీ మనస్సును ఆకట్టుకున్నాయి. పాలకుల జాతి యొకటి, పాలితుల జాతి మరొకటి కాదన్న విశ్వాసము. అందరు మానవులూ సమానావకాశాలకు అర్హులే అన్న సత్యము, న్యాయశాస్త్రము గాంధీజీకి ఎత్తి చూపెట్టింది. న్యాయవాదిగా, ముఖ్యంగా దక్షిణాఫ్రికాలో జాతులమధ్య చూపబడుతున్న తరతమ భావాలను గాంధీజీ పరిశీలించే అవకాశాలు, కొన్ని తావులలో వాటినుండి బాధపడే సమయాలు ఉత్పన్నమయినవే. ఆ అనుభవాలనుండి దక్షిణాఫ్రికాలో గాంధీ ఉద్యమం పుట్టుక వచ్చింది. తెల్లవారి ఆధిక్యతను కాదంటూ, నల్లవారు సైతము మానవులేనని హెచ్చరిస్తూ, యిద్దరిమధ్య హెచ్చుతగ్గులు లేవని ప్రకటిస్తూ నడిచిన ఉద్యమ మది. దాని తరువాతఘట్టమే భారత స్వాతంత్ర్యోద్యమం. మానవులందరకు తమ వ్యవహారాలను తామే చక్కదిద్దుకోగల అవకాశము వుండవలెనని యీ ఉద్యమపు ఆశయము. యీ ఆశయాలను, ప్రజాస్వామిక సూత్రాలను, తన న్యాయశాస్త్ర సంబంధంనుండి గాంధీజీ ఆకళింపు చేసుకున్నారు.

గాంధీజీలో వ్యక్తి స్వాతంత్ర్య దీక్ష పరాకాష్ఠ నందుకొన్నది. "That Government is the best which governs the least" అని ప్రవచిస్తూ వుండేవారు. ఏది తక్కువగా పాలిస్తూ వుండేదో అది ఉత్తమ ప్రభుత్వం అని దీని భావము. మానవుని దైనందిన జీవితంలో ప్రభుత్వం జోక్యము కలిగించుకోకూడదని, మామూలు సమస్యలను పౌరులే పరిష్కరించుకోగలరని, అందుకు వారికి పూర్తిగా అవకాశము యివ్వబడాలని గాంధీజీ విశ్వాసము. ఆ భావనకూడా న్యాయశాస్త్ర పరిజ్ఞానపు ప్రభావమే.

గాంధీజీ అన్యాయాన్ని ఎంతమాత్రము సహించగలిగేవారు కాదు. జాతులమధ్య, తెగలమధ్య, కులాలమధ్య, స్త్రీ పురుషుల మధ్య, ఉత్పన్నమైన అన్యాయాలన్నిటిని ఆయన ప్రతిఘటించారు. స్వాతంత్ర్యోద్యమం, మతసామరస్యానికై వారు జరిపిన అవిరళమైన కృషి, హరిజనోద్యమము, మహిళోద్ధరణ – యివన్నీ దానికి తార్కాణాలు. అన్యాయము, న్యాయదృష్టిలో దూష్యం, గర్హణీయం, శిక్షార్హం. ఆ ప్రాతిపదికను అవగాహన చేసుకొనే

గాంధీజీ అన్యాయాన్ని ఎదిరించే మహా వీరుడైనాడు.

గాంధీజీ ప్రభుత్వానికి ఎదురుతిరిగాడు. శాసనోల్లంఘనం చేశాడు. అయితే ఆ ఉల్లంఘనలో దౌర్జన్యం వుండదు. అన్యాయాన్ని ప్రతిఘటించడంలో హింస ఉండరాదు. ప్రతిఘటన అహింసాత్మకంగా, క్రమశిక్షణతో జరగాలి. అందుకు ప్రభుత్వం శిక్ష విధిస్తే సంతోషంగా దానిని స్వీకరించాలి, అనుభవించాలి. అహింసయెడల యీ దీక్ష, క్రమశిక్షణ యెడల యీ పట్టుదల, న్యాయస్థానాల యెడల గౌరవము, వాటి తీర్పును శిరసా వహించాలనే సంకల్పం గాంధీజీలో ప్రభావితంచేసింది వారి న్యాయశాస్త్ర పరిచయమే అనుకుంటాను.

అహింసతోపాటు గాంధీజీకి రెండవ ముఖ్యసూత్రము సత్యం. యీ సూత్రము యెడల గాంధీజీకి ఎనలేని విశ్వాసము, పట్టుదల వుండేవి. అది జగద్విఖ్యాతమైన విషయం. న్యాయశాస్త్రానికి, న్యాయవాదికి పరమావధి సత్యం. సత్యాన్ని తెలుసుకోవటం, సత్యాన్ని ధర్మబద్ధం చేయడం, మానవజీవితములో దాని ప్రతిష్ఠాపన చేయడం న్యాయశాస్త్రము లక్ష్యం, న్యాయవాది ధర్మము. గాంధీజీలోని సత్యనిష్ఠకు ఆయన న్యాయవాద జీవితం ఒక ప్రబలకారణం అనడానికి ఎట్టి సందేహం లేదు.

పల్లెపట్టులమీద, గ్రామీణ జీవితంమీద గాంధీజీకి శ్రద్ధ ఎక్కువ. వాటిని స్వయం పోషకాలుగా రూపొందించాలని, పల్లె జీవితము స్వయం పరిపాలకంగా ఉండాలని ఆయన ఆకాంక్ష. అందులోనుండే నేటి పంచాయతీరాజ్యం ఉద్భవిన్నమైంది. గాంధీజీ యీ ఆలోచనకు మూలకందం, వ్యక్తి స్వాతంత్ర్యములోని ఆయన విశ్వాసము. మానవుడు సర్వసాధారణముగా స్వయంపోషకుడేనని ఆయన నమ్మకం. యీ నమ్మకాలు, విశ్వాసాలు వారు ప్రధానముగా న్యాయశాస్త్రంనుండి అలవరచుకొన్నవే.

రచయితగా, ఉపన్యాసకుడుగా గాంధీజీలో న్యాయవాది స్ఫూర్తులు స్పష్టంగా కనిపించేవి. ఆ తొణకనితనము ఒకభావంలోనుండి మరొక భావంలోనికి క్రమానుగతి, చెప్పదలచుకొన్న దానిలో స్పష్టత, సహేతుక వాదనాపటిమ-ఇవన్నీ న్యాయవాదుల సాధారణ లక్షణాలు. ఇవి గాంధీజీలో కూలంకషంగా వెల్లివిరిసినవి.

అపూర్వమైన గాంధీజీ వ్యక్తిత్వ పరిణామాలలో ఇంతటి ప్రధాన భూమికను ధరించింది గాంధీజీ న్యాయశాస్త్ర సంబంధం. ఆయనొకప్పుడు న్యాయవాదే కావడం, న్యాయవాద వర్గానికే ఒక మహా గౌరవం అయితే అట్టి మహనీయ జీవితాన్ని ప్రభావితం చేయగలిగాననేది దానికి సర్వదా గర్వకారణం.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)

# పుణ్యదినం

అక్టోబరు రెండు—నిజంగా పుణ్యదినమే.

ఆ రోజున ముగ్గురు మహావ్యక్తులు జన్మించారు. మహాత్ముడు పుట్టినరోజు అక్టోబర్ రెండు.

మరొక సంవత్సరంలో అయినా, అక్టోబరు రెండవతారీఖునే అనిబిసెంటు జన్మించింది.

అలానే—లాల్ బహదూర్ శాస్త్రి కూడా సరిగా అదే తేదీన పుట్టాడు.

ముగ్గురిలోనూ అమోఘమైన శక్తులున్నాయి, ఆదర్శప్రాయమైన గొప్ప గుణాలున్నాయి, స్థిరమైన సంకల్పాలున్నాయి. ముగ్గురికీ డబ్బు తృణప్రాయమే. ఎన్ని అవకాశాలున్నా డబ్బు ఇతరులకోసమే సేకరించాలి కాని మాకెందుకన్న పద్ధతిలో సంచరించినవారే.

భారతదేశాన్ని బిసెంటు తన దేశంగా చేసుకుంది. మనదేశమే తన దేశ మనుకుంది. మహత్తర సంస్థలను స్థాపించింది. ఉద్యమాలను లేవదీసింది, సాగించింది. లక్షలు ఆర్జించింది.

అయినా, ఆమె జన్మదినోత్సవం చాలా విచిత్రం. మనం పుట్టినరోజున డబ్బులేదు. అందుచేత పుట్టినరోజు రేపనగా ముందురోజునే బ్యాంకులో నిల్వ ధనం తీసేసి, ఆయా సంస్థలకు పంచిపెట్టేది. కనుక జన్మదినంనాడు ఆమెకు డబ్బే ఉండేదికాదు. అంత ఆత్మవిశ్వాసం గల వ్యక్తి.

మరొక మెట్టు పైకెక్కాడు మహాత్ముడు. ఆయన దరిద్రనారాయణుడనని బిరుదే తగిలించుకున్నాడు. తనది అనేదే లేదు. ఆశ్రమం ప్రజలది. లక్షోపలక్షలు రాబట్టగల ఆయన రచనలు స్వంతానికి ఉంచుకోలేదు. మానవసేవ చేసేవారికి స్వంత ఆస్తి ఏమిటి? అని మహాత్ముని ప్రశ్న. ఆయనకు అందుకనే బ్యాంకు అకౌంటు లేదు.

శాస్త్రి ఒక చిత్రమైన వ్యక్తి. అతి మెత్తని మనస్సు. ట్రెయిన్ యాక్సిడెంటు జరిగేటప్పటికి హృదయం చలించిపోయింది. రైల్వేమంత్రి పదవికి తను అర్హుణ్ని కాదనుకుని, వెంటనే తొలగాడు. విచారం ఎలా భరించలేదో సంతోషానికీ తట్టుకోలేదు. తాష్కెంట్ ఒప్పందం మహామహులు సాధించలేని మహత్కార్యం. ఈ దిగ్విజయం చేసిన గౌరవం తనకే దక్కిందనుకుని పొంగిపొయ్యాడు. సంతోషం పట్టలేక గుండె ఆగిపోయి అవతారం చాలించాడు. డబ్బు కూడబెట్టడం చేతగాని త్యాగధనుడు శాస్త్రి.

ఇటువంటి మహావ్యక్తులు పుట్టినరోజు పుణ్యదినం కాదా?



# దివ్యస్మృతి

మహాత్మాగాంధీగారు వస్తున్నారంటే పట్నం పట్నమే కాదు విశాఖపట్నం జిల్లా జిల్లాఅంతా గుబగుబలాడిపోయింది. ఆ దినాల్లో నేను విశాఖ ఖాదీభండారం మేనేజరుగా వున్నాను. గాంధీగారు ఖద్దరు ప్రచారంమీద వస్తున్నారు. అందుకని నా బాధ్యతకూడా గురుతరమైంది. జిల్లాలో వారు సంచారం చేసినప్పుడు వారు వెళ్ళే ప్రతీచోటికీ ముందువెళ్ళి తగిన ఏర్పాట్లు చేసే భారం కూడా నామీద పడింది. ఆనాటి అనుభవాలు అపూర్వమైనవి.

విశాఖలో వారికి విడిది ఎక్కడ ఏర్పాటుచేయాలి అన్న ప్రశ్న పెద్దలకి ముందు పెద్ద సమస్య అయింది. కీ. శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారూ, శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు జిల్లా నాయకుల్లో ప్రముఖులు. శ్రీ భానోజీరావుగారి భవనం విడిదిగా ఏర్పాటయింది. సోఫాలకీ, కొన్ని చిత్రపటాలకీ షణాలమీద ఖద్దరు తానులు కప్పించారు.

ప్రతిదినమూ గాంధీగారు గెడ్డం గీయించుకోడం అలవాటు. అవాళ మంగలిని పిలవమన్నారు. ఖద్దరుకట్టే మంగలే కావాలి.

ఆ దినాల్లో బర్మానుంచి ఏదో ఆపదలోపడి తప్పించుకువచ్చిన ఒక మంగలి విశాఖపట్నంలో వుండేవాడు. పేరు గుర్తులేదు. గాంధీగారు దేవుడే అని అతని నమ్మకం. రోజూ ఖాదీ భండారానికి వచ్చి కొంతసేపుగడిపి వెళ్ళేవాడు. అతడు దొరికాడు కాని అతడికి ఖద్దరు దుస్తులులేవు. వాలంటీర్ల కెప్టెను శ్రీ సబ్నివీడు సత్యకేశవరావుగారు. వారి ఖద్దరు చొక్కా, పంచా ఆ మంగలికి కట్టించి గాంధీగారి దగ్గిరికి తీసుకువెళ్లాం. సాక్షాత్తూ దేవుడే అని నమ్ముతున్నా గాంధీగారి దగ్గిరికి వెళ్ళడంతోటే మంగలికి ఒణుకు పట్టుకుంది. చేతిలో కత్తి కుదుటపడలేదు. ఎంత ప్రయత్నంచేసినా అతడు గాంధీగారి గెడ్డంమీద కత్తి నిలపలేకపోయాడు.

---

పురిపండా అప్పలస్వామి

---

చివరికి అతడి చేతిలోని క త్తితీసుకుని గాంధీగారే స్వయంగా గెడ్డం గీసుకున్నారు. ఆ వారం ఎంగిండియాలో ఒక వ్యాసం రాస్తూ ప్రతి పట్నంలోనూ ఒక ఖద్దరు దుస్తుల మంగలి వుండడం అవసరమని ఆయన రాశారు.

గాంధీగారి కారు బయలుదేరడానికి ముందుగా నా కారు బయలుదేరి ఆయన బసచేయవలసినచోటికి వెళ్లడం, అవసరమైన ఏర్పాట్లు చేయించడం నా విధిగా వుండేది. మా కారు ముందుగా వెళుతూ వుంటే దారి కడాకూ గాంధీగారికోసం నిరీక్షించే పల్లెప్రజలు వేలాదిమంది మా కారు ఆపి ఎన్నో విషయా లడిగేవారు. చిత్రమేమిటంటే ఆ జనంలో వందలాది మంది గాంధీగారికోసం ముడుపులు పట్టుకువచ్చి కానుకుర్పించునే వారు. ఆయన సాక్షాత్తూ భగవంతుడే అని వారి నమ్మకం. సంతానం కావాలనో, జబ్బులు నయంకావాలనో, కోరికలు తీరాలనో, ఆపదలు గట్టెక్కాలనో తిరపతిదేవుణ్ణి మొక్కుకున్నట్టే గాంధీగారిని మొక్కుకునేవారు. ఆ ముడుపులు ఎక్కడ ఎలా చెల్లించడమని అడిగేవారు.

విశాఖపట్నంనుంచి అనకాపల్లివచ్చారు గాంధీగారు. అవాళ సభలోంచి బసకి వచ్చేసరికి ఆయన మోకాళ్లనించి పాదాలదాకా గీరుకుపోయి రక్తాలు చిమ్ముతున్నాయి. జాగ్రత్తేరి వాలంటీర్లు ఎంత అడినా ఆయన పాదాలు అంటాలని జనం చేతులు చాచడంతో గోళ్లు తగిలి గీసుకుపోయిన గీరులవి. శ్రీ దిగుమర్తి రామస్వామిగారు అవాళ వారి కాళ్ళకి నూనెరాసి సేవచేశారు.

అనకాపల్లిలోనే రామచంద్రకవిగారిని గాంధీగారికి పరిచయంచేస్తూ విశ్వనాథంగారు "ఈయన మా చీఫ్ వర్కరు" అన్నారు. "చీఫ్ ఆర్ చీప్ ?" అన్నారు ఛలోక్తిగా గాంధీగారు. అయితే కవిగారు మాత్రం సామాన్యులా ? 'బోత్' అన్నారు గట్టిగా. అంతవరకూ తల వొంచుకు రాట్నం వడుకుతున్న గాంధీగారు తలెత్తి కవిగారివేపు తేరిచూశారు.

అక్కడినుంచి ఏటికొప్పాక బయలుదేరాం. సి. వి. ఎస్. నరసింహరాజుగారింట బస ఏర్పాటయింది. వారింటినిండా సోఫాలూ పరుపులూ కోకొల్లలు. అన్నీ విదేశీగుడ్డలవే. అవన్నీ ఖద్దరు కప్పించాలన్నాను. క్షణాలమీద అంతపనీ జరిగింది. ఊరువూరంతా బంగమే.

గాంధీగారి ప్రార్థన ఆరుబయట జరగాలి. పోలీసులు కూడా మామూలు దుస్తులతో ఆ ప్రార్థనలో కూచునేవారు.

ఏటికొప్పాకనించి తుని. తునిలో ఒక మేడమీద బస. వసూలైన సొమ్మంతా మా చరఖాసంఘం కార్యదర్శి వేమూరి నారాయణమూర్తిగారూ, నేనూ లెక్కపెట్టేవాళ్ళం. ఉండివుండీ మా లెక్క

దగ్గిరికి గాంధీగారు వచ్చేవారు. అప్పటికి ఎప్పుడైనా దర్శనానికి వచ్చి అర్పించిన ధనం స్వయంగా వచ్చి మా దగ్గిర ఇచ్చే వారు. మేం లేవబోతే వద్దని వారించే వారు

తుని మేడమెట్లు ఏటవాలుగా ఉండేవి. అక్కడికి రాగానే విశ్వనాథంగారు భద్రత కోసం త్వరపడ్డారు. "భయపడకు, నే నెప్పుడూ జారిపోను" అంటూ ఛలోక్తిగా అన్నారు గాంధి.

దేశం కుతకుతలాడిపోతూ వుండేది. ఆంగ్లప్రభుత్వం గడగడలాడిపోతూ వుండేది. ఎప్పు డేమవుతుందో అని అంద రికీ భయంగావుండేది. అయినా మహా త్ముడు ఎప్పటికప్పుడు ఛలోక్తులతో నవ్విస్తూ, కొత్త ఉత్సాహం సృష్టిస్తూ వుండేవాడు.

గాంధీగారితో గడిపినది కొద్దిరోజులే అయినా కొద్దిక్షణాలేఅయినా ఆ స్మృతులు మాత్రం అజరామరమైనవి.

## మహాత్ముని దృష్టిలో అహింస

"అహింసను, సత్యంనుంచి విడదీయటం సాధ్యంకాని పని. ఆ రెండూ, ఒక నాణానికి చెరొకవైపువంటివి. అహింస సాధనమైతే, సత్యం ధ్యేయం.

ఈ లోకంలో చరిత్ర ఆరంభమైననాటినుంచీ, మానవుడు క్రమేపీ, హింసా ప్రవృత్తిని తగ్గించుకొని, అహింసవైపు మొగ్గుతూ వచ్చాడు. ఆదిలో తోటిమానవుణ్ణి చంపి, కడుపు నింపుకుంటూ ఉండిన మానవుడు, కాలక్రమేణా నాగరికత అలవరచుకొని, సంఘజీవిగా తయారై, గ్రామాలనూ, బస్తీలనూ ఏర్పాటు చేసుకున్నాడు. దీన్నిబట్టి అహింసదే క్రమంగా పైచేయి అవుతూ వచ్చింది. అట్లా కానిపక్షంలో మానవ జాతి ఏనాడో నిర్మూలమయి ఉండేది.

అహింసా విధానమో, సర్వనాశనమో తప్ప. మానవజాతికి మార్గాంతరం లేదు."



# అపసవ్యపు మహాత్ముడు

మహాత్ముడికి సందర్భశుద్ధి బొత్తిగా లేదని ఒక అపవాదు! ఆ సంగతి ఆయనకూ తెలుసు. ఈ అపవాదుకి బాపూజీ సంజాయిషీ చూడండి :

'నిజమే – ఆ మాట నేనే ఒప్పుకుంటున్నా. అయితే, అందులోకూడా కాస్తంత పొందిక లేకపోలేదు. ప్రకృతి వైవిధ్యంలో ఐక్యత ఉన్నట్టుగానే, చూడటానికి అసందర్భంగా కనిపించేవాటిలోనూ అంతర్గతంగా 'సందర్భం' ఉంచుకుంటా.

కొత్త ప్రయోగాలు, లేదా పాత ప్రయోగాలే కొత్తపక్కీలో ఆచరణ జరిగినప్పుడు అడపాతడపా అపార్థాలు తప్పవు.

కార్యసాధనకోసం నేను ఒకేఒక్క నమ్మకంతో వున్నాను–మంచి నీతే మంచి సాధన. అంతేగాని నేను చాదస్తంగా సందర్భశుద్ధినే చూస్తూ కూచోలేను, కూచోను. సత్యాన్నే నేను ఆరాధిస్తాను. నిజమే. అయితే, ఏవిషయమయినా తీరా ఆరా వచ్చినప్పుడు—ఫలానా అప్పుడు ఏంచెప్పానా? అని నెమరువేసుకునే అలవాటు నాకు లేదు. ఆ క్షణంలో నాకేం తోస్తే అది చెబుతాను. అంతే. నా దృష్టి క్రమేణా స్వచ్ఛమైనట్టుగానే నా అభిప్రాయాలూ అర్థమవుతాయి. నేనెప్పుడేనా కావాలని అభిప్రాయం మార్చుకుంటే ఆ మార్పు స్పష్టంగా తెలుస్తూనేవుంటుందే!–

ఏది కానీండి–సందర్భశుద్ధిగా కనిపించి తీరాలనే యావమాత్రం నాకు లేదు. లేనే లేదు. సత్యాన్ని వెదకడంలో ఎన్నెన్నో భావాల్ని మధ్యలో వదిలేశా. కొత్త భావాలెన్నింటినో అందిపుచ్చుకున్నా. నాకు ఇన్నేళ్ళొచ్చి ముసలాడినయ్యానేగాని, మనోవికాసంమాత్రం ఆగిపోయిం దనుకోవటంలేదు. శరీరం చిక్కినంతమాత్రాన మనోవికాసం నిలిచిపోతుం దనుకోను. నేను వినేదల్లా ఆ సత్యస్వరూపుడి పలుకు. నాకు కావలసిందల్లా ఆ భగవంతుడి ఆజ్ఞ ప్రకారం నడుచుకోవటం. నడుచుకోగలడం.'

# కస్తూరిబాయి



నేను 1906 లో బ్రహ్మచర్యవ్రతము పట్టితిని. సర్వాత్మనా లోకసేవ చేయ గోరువానికి ఆ వ్రతము లేక పని నడవ దని స్పష్టముగా గ్రహించితిని. సంసార సుఖమందును, సంతాన ప్రసవ పోషణ లందును నేను తగుల్కొన్నచో నా కర్తవ్యనిర్వహణకు చాలియుండనని నాకు హృద్గతమైనది. అనగా ఇంద్రియములకోసము, ఆత్మకోసముకూడ ఏక సమయమున జీవించుట అసంభవము.

అంతవరకును నే నీ విషయమై కస్తూరిబాయికి నా మనసు తెలుపలేదు. కాని వ్రతస్వీకారసమయమున ఆమెను సంప్రదించితిని. ఆమె కభ్యంతరము లేకపోయెను. అయినను చివరకు మనో నిశ్చయము చేసికొనుట నాకు కష్టమైనది. అందుకు తగ్గశక్తి నాకులేదు. కాని భగవంతుని సంజీవక శక్తియందు భక్తినుంచి నేను వ్రతసంకల్పము చెప్పుకొంటిని.

బ్రహ్మచర్య మారంభించిన ఆనాటి నుండియు మనస్వేచ్ఛ మొదలాయెను. ఆమెకు భర్తనై, స్వామినై నే చేయు అధికారమునుండి నా భార్యకు స్వేచ్ఛ లభించెను. ఆమె తృప్తిపరచవలసిన నా క్షుధాదాస్యమునుండి నేను విముక్తుడ నైతిని. ఆమె నన్నాకర్షించిన లీలగా మరే స్త్రీ యన్నను నా కాకర్షణలేదు. భర్తనై నే నామెకే జతపడితిని. నా తల్లి ముందు చేసిన ప్రమాణమునే తలదాల్చితిని. నేను మరే స్త్రీకిని దాసుడనుకాను. కాని బ్రహ్మచర్య వ్రతసంకల్పము నాకు తోచిన తీరునుబట్టి స్త్రీ యనగా తల్లియని నాకు గాఢముగా హత్తుకున్నది. కామముతో తలచరాని పవిత్రమూర్తి స్త్రీ. యీ విధమున ప్రతి స్త్రీయును నాకు తోబుట్టువో, కూతురో యైనది.

చెప్పదగినంతగా ఆమెలో వొక గుణము విలసిల్లినది. ఆ గుణము ఏ మాత్రముగనో హిందూ సతులందరి లోను గలదు. ఇష్టపడియో, ఇష్టపడకనో, తెలిసియో తెలియకనో ఆమె నా అడుగు

జాడల ననుసరించి ధన్యత జెందినట్లు తెలుసుకొనేది.

ఆమెకు చాలా గట్టిదైన నిశ్చయము ఎల్లప్పుడునువుండేది. మాయావనాంకురపు రోజులలో నే నది మొండితనమని పొరపాటు పడితిని. కాని ఆమె తన దృఢ సంకల్పముచేతనే అహింసకమైన నిస్సాకారపు కళాభ్యాసములో అనుకో కుండానే నాకు ఉపదేశకురాలు కావలసి యుండెను. ఆమె ఎన్నో జైలు శిక్షలను తరించినప్పటికిని, సౌకర్యములన్నియు ఈ తూరి ఉన్నప్పటికిని ఇప్పటి 1942–44 కారావాసమును నామె దయ గొనలేదు. పలువురితోబాటు నా నిర్బంధము, ఆ వెంటనే తన నిర్బంధము ఆమెకు పెద్ద అగాధమై దుఃఖహేతువైనవి. నా అరెస్టు జరుగునని ఆమె లీలగా నైన తలంచలేదు. సర్కారుకు నా అహింస విషయమై విశ్వాసము కలిగిన దనియు, నాకు నేనై ఆక్షేపించిననే గాని నన్ను అరెస్టు చేయరనియు ఆమెకు నమ్మబలికితిని. కాని వాస్తవమునకు ఆమెకు కలిగిన ఘాత తీవ్రమై ఆమె అరెస్టు కాగానే విరేచనవ్యాధి ప్రబల మైనది. ఆమెతోబాటే అరెస్టయిన డాక్టరు సుశీలానాయరు కనిపెట్టనిచో కారావాసంలో నన్ను చేరకమునుపే ఆమె దేహం చాలించవలసినది. చెరసాలలో నా సన్నిధి నామె ఊరడిల్లినది. మరి వైద్యావసరము లేకనే విరేచనములు కట్టినవి. కాని దుఃఖము కట్టలేదు. మనో వ్యాధిగా మారి దుఃఖజనకమైన మెల మెల్లని శరీరనాశముగా అంతమొందినది. సజీవవేదనమునుండి ముక్తి కలుగునని నే నామెకోసమై ఆమె మృత్యువు కియ్యకొన్నను అనుకున్న దానికన్న ఆమె వియోగ బాధ అధికమైనది. మా దాంపత్యము అసాధారణమైనది. మా జీవితము సుఖమనిపించి, సంతుష్టమై, కల్యాణమయినది.

— గాంధి.

దగ్గరవారూ, దూరపువారూ, దేశీయులూ, విదేశీయులూ, తెల్ల జాతివారూ, రంగుజాతులవారూ, హిందువులూ, ముసల్మానులూ, పార్సీలూ, క్రైస్తవులూ, యూదులూ, ఇటువంటి వ్యత్యాస భావాలు నా యింటా వొంటా లేవు.



# కాంగ్రెసు భావి కర్తవ్యం మహాత్ముని అంతిమ బోధ

స్వాతంత్ర్య సాధనకై అహింసాత్మకంగా అనేక సమరాలు జరిపిన పురాతన జాతీయ రాజకీయ సంస్థఅయిన భారత జాతీయ కాంగ్రెసును అంత మొందనీయరాదు. ఆ సంస్థ జాతితో కలసిమాత్రమే అంతరించగలదు. చైతన్యవస్తువుగా నది వృద్ధి అగుచుండవలెనే కాని లేకున్నచో అంతరించక తప్పదు.

కాంగ్రెసు రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించిందిగాని ఆర్థిక, సాంఘిక, నైతిక స్వాతంత్ర్యాలు మాత్రం ఇంకా సిద్ధించలేదు. యీ స్వాతంత్ర్యాలు రాజకీయ స్వాతంత్ర్యం కంటె కష్టసాధ్యమైనవి. ఏమంటే వీనిలో వాస్తవంగా లభించునది అధికం. అంత ఉద్విగ్నతకు తావు వుండదు. ఆడంబరం ముండదు. సర్వతోముఖమైన కృషిచేయడానికి ప్రజాకోటిలోని ప్రతి పక్షం శ్రమించవలసి వుంటుంది.

స్వాతంత్ర్యంలో ప్రధానమైన భాగాన్ని కాంగ్రెసు పొందింది. కాని కష్టతరమైన అంశం యింకా సాధించవలసియున్నది. ప్రజాపాలన అనే గమ్యస్థానాన్ని అవరోహించటంలో శుష్కశాఖలు మొలవక తప్పలేదు. అవినీతి ప్రబలింది. పేరుకు మాత్రమే ప్రజాసంస్థలైనవి ఎన్నో వుద్భవించాయి. ఈ అలవికాని శుష్కపాదపాలనుంచి గడిచి, బయటపడడం ఎలాగా?

ఇంతవర కెన్నడు కోటి సభ్యులకు మించని ప్రత్యేక సభ్యత్వ జాబితాను కాంగ్రెసు యింక తొలిగించాలి. పైకోటి మందిని గుర్తు పట్టడంకూడా కష్టం. అక్కడకు రాని లక్షలాది సభ్యులజాబితా వున్నది. ఇకనుంచి దేశములోని నియోజక వర్గాలలోని స్త్రీ పురుషుల పేర్లుగల ఓటర్ల జాబితాలే కాంగ్రెసు సభ్యత్వ జాబితాలు కావలెను. బూటకపు పేర్లేవి చేరకుండాను, న్యాయమైన పేరేది విడవకుండాను చూడవలసిన బాధ్యత కాంగ్రెసుపై వున్నది. ఇంకా కాంగ్రెసు స్వతంత్ర జాబితాలో ఎప్పటికప్పుడు విధింపబడు బాధ్యతలను నిర్వహించు

జాతీయ సేవకుల పేర్లుమాత్రమే వుండాలి. దేశ దౌర్భాగ్యంవల్ల ప్రస్తుతానికి నగరవాసులనే ముఖ్యంగా ఈ జాబితాలోకి తీసుకోవలసిన అవసరం కలుగుతున్నది. వీరిలో చాలా మంది గ్రామాలలోనే పని చేయవలసియుంటారు. గ్రామస్తులతో క్రమంగా యీ జాబితాలను నింపవలసియుంటుంది.

యీ సేవకులు తమ పరిసరాల్లో శాసనరీత్యా నియోజకవర్గ జాబితాల్లో చేర్చబడినవారికి సేవచేస్తూ కృషి చేయవలసియున్నారు. అనేకమంది వ్యక్తులు, పక్షాలు వారి ప్రాపును కోరగలరు. అందులో ఉత్తములకే అభీష్టసిద్ధి కలుగుతుంది. ఇప్పుడు క్రమంగా క్షీణిస్తున్న తన అపార పరపతిని, కాంగ్రెసు యీ మార్గంవల్లనే పునః స్థాపించుకోగలుగుతుంది.

కాని నిన్నటివరకూ కాంగ్రెసు తనకు తెలియకుండానే జాతిసేవకు పరికరమైంది. ఖుదై ఖిద్మత్గార్ – అనగా దైవ సేవా నిరతులైనారు కాంగ్రెసువాదులు. దైవసేవాభిరతికిఅంకితమైనట్లు కాంగ్రెసు ప్రపంచానికి చాటుకోవాలి. యీ సేవలో ఇంతకు మిన్నగాని కొరవగాని ఉండరాదు.

కాంగ్రెసు అధికార సంపాదనకై ప్రాకులాడిందంటే త్వరలోనే ఒకనాడు అంతరిస్తుంది. ఈశ్వరుని కృపవలన ఇప్పటికి రంగమంతటిలోనూ ఈ సంస్థ ఒకటేకాదు.

బహు దూరదృశ్యాన్ని వీక్షించడానికి నేను ఇప్పటికి ఉపక్రమించానంటే, నాకు వ్యవధి దేహదార్ఢ్యాలుంటే, జాతీయ సేవకులు వయోజనులలో తమ ప్రతిష్ఠను వ్యాపింప చేయడానికి వారేమి చేయవలెనో యీ వ్యాసాలలో చర్చించవలెనని ఆశిస్తున్నాను.

---

'పాపకార్యాన్ని ద్వేషించాలిగాని పాపం చేసేవారినికాదు' అనేది గొప్ప నీతే. అందరికీ సులభంగానే అర్థమయ్యే నీతి. కాని ఎవరికీ ఆచరణసాధ్యంకానిది. అందుకే ద్వేషభావం ప్రపంచమంతా వ్యాపిస్తున్నది.



# స్త్రీజనాభ్యుదయం

మహాత్మాగాంధీ భారత ప్రజలకు పిత కాగా భారత మహిళా లోకానికి శక్తి ప్రదాత. భారత దేశానికి మహాత్ముడు చేసిన మహత్తర సేవలలో గణనీయమైంది నిద్రాణమైయున్న మహిళా లోకాన్ని మేల్కొల్పడం. అంతకు పూర్వం భారతభూమిలోమహిళలకై కృషి చేసిన మహాపురుషులెందరో వున్నారు. అందు రాజా రామమోహనరాయ్, కందూకూరి వీరేశలింగంపంతులు అగ్రగణ్యులు. అయితే భారత మహిళా లోకానికంతటికీ కొత్త వెలుగును, కొత్త ఉత్సాహాన్ని, కొత్త శక్తిని ప్రసాదించినవాడు మహాత్మాగాంధీ.

గాంధీజీని జాతిపిత అని ఎందుకు పిలుస్తున్నాం? భారత మహిళా లోకపు శక్తి ప్రదాతయని ఎందుకు అంటున్నాం? భారతదేశం బానిసత్వములో అలమటిస్తున్న సమయములో మహాత్ముడు స్వాతంత్ర్యసముపార్జనకునడుముకట్టాడు. అయితే గాంధీజీ కార్యరంగములోనికొచ్చేవరకు దేశములో స్వాతంత్ర్య పిపాసలేదు అనడానికి వీలులేదు. అప్పటికే స్వాతంత్ర్య పిపాసమొలకెత్తివుంది. అయితే విద్యావంతులైన ఏకొద్ది మంది లోనో పరిమితమై వుండేది. గాంధీజీ నాయకత్వములో ప్రతి ఒక్కరిలోను అది ప్రజ్వరిల్లింది. అప్పటివరకు విద్యావంతులు అయిన ఏకొద్దిమందిలోనో వున్న స్వాతంత్ర్య పిపాస, మహాత్ముని ఉద్యమంలో ఒక మహావెల్లువగా విస్తరించింది. ప్రచండమైన ప్రజా ఉద్యమంగా ప్రజ్వరిల్లింది. ఎందువల్లనంటే మహాత్ముని నాయకత్వం, మహాత్ముని బోధ, ప్రజానీకములో కొత్త కాంతిని, కొత్త శక్తిని, కొత్త ఉత్సాహాన్ని కలిగించి వుండటంచేత, భారత ప్రజానీకం ఒక్కుమ్మడిగాఏకమనస్కులై, ఒక జాతిగా ఒక మహోజ్వలమైన శక్తిగా ఉప్పొంగిపోయారు. భారత జాతిలో అంతర్భాగమైన మహిళాలోకం కూడా దానితోపాటు కదిలింది. పురుషులతోపాటు పొంగింది. దేశ భవితవ్యానికై జాతి పునరుజ్జీవనానికై నడుముకట్టింది. అంత

ఆవుల జయప్రదాదేవి

పరికూ జీవచ్ఛవంగా ఉన్న మహిళా లోకం స్వాతంత్ర్య సమరములో తేజో మూర్తి అయింది అంటే గాంధీజీ ప్రసాదించిన శక్తిగాక మరేమిటి? ఒక్క స్వాతంత్ర్య సంపాదనలోనేకాకుండా నవ జీవన నిర్మాణములోకూడా, స్త్రీలు అగ్రగ్రామినులైవుండి తమకర్తవ్యాన్ని సంతృప్తిగా నెరవేర్చాలని గాంధీజీ ప్రబోధం.

భారత స్త్రీలు పురోగాములు కావాలలన్నా, దృఢసంకల్పులుకావాలన్నా కొన్ని అర్హతలను సంపాదించుకోవాలని గాంధీగారు బోధించారు. వాటిలో మొట్టమొదటిది శీల సంపద. శీలం అంటే కేవలం స్త్రీ పురుషులకు సంబంధమైనదే కాదు. దొంగతనం చేయకపోవడమే కాదు. గాంధీజీ వూహించినది మానవ తత్త్వానికంతటికీ సంబంధించిన సమగ్రమైన శీల సంపద. దానికి సత్యాహింసలతో కూడుకున్నటువంటి మానసిక స్థయిర్యము మూలకందం తనకు అన్యాయమని తోచిన వానిని ఎదుర్కొనగలిగిన న్యాయదక్షత, ధైర్యం కావాలి. అధికారవంతులచేత, బలవంతులచేత చేయబడుతున్న అన్యాయానికి భయపడకూడదు. మనుష్యులు భయములేనితనాన్ని అనగా పిరికితనాన్ని వదలి, ధైర్యాన్ని అలవర్చుకోవాలి అయితే అన్యాయాన్ని ప్రతిఘటించడంలో న్యాయాన్ని పోషించడంలో, దూషణతో, ఘోషణతో, కత్తులతో, కటారులతో అవసరంలేదు. అన్యాయం ఎక్కడ కన్పించినా, ప్రతిఘటించవలసినదే, సరిదిద్దవలసినదే. అయితే అది పోరాటంతో కాదు-సత్యాగ్రహంతో, మానవతా భావంతో, సమాన సాదృశ్యంతో.

సత్యాగ్రహం అంటే మనం పవిత్రమైన మనస్సుతో, కల్మషరహితమైన హృదయంతో, సమగ్రంగా సమీక్షించి, నిర్ణయించిన పిదప, ఆ సత్యాన్ని ఆచరించడానికి పూనుకోవడం. గాంధీజీ భావనలో మానవలి ప్రేమపూరితం కావాలి. ద్వేషకలుషితంకాకూడదు. సమాజంలో సత్యాన్ని గుర్తించలేక కానీ, స్వార్థపరత్వంతో కానీ అన్యాయంజరుగుతుండే వారికి వివరించి, విపులంగా వాస్తవాన్ని గుర్తింపచెయ్యాలి. ఒక వేళ మనమే పొరపాటుపడుతూవుంటే మనమే పరిష్కరించుకోవాలి. ఇందుకు స్వాభిమానాలు అడ్డురాకూడదు. స్వార్థపరత్వభావాలు విస్మరించాలి. మానవుడు తనతోటి మానవుని ప్రాముఖ్యతను గుర్తించి గౌరవించాలి. ప్రతిప్రాణి తోటిప్రాణిని ప్రేమించగలగాలి. అట్టి ప్రేమతో కూడుకున్న ప్రతిఘటనే, సత్యాగ్రహం అనబడుతుంది. గాంధీజీ అలాంటి సత్యాగ్రహాన్నే రూపకల్పన చేశాడు, ఆచరించాడు.

అందుకు స్త్రీ పాత్ర ఎంతైనా ప్రాముఖ్యం స్త్రీమున్ముందు తన కుటుంబ జీవితంలో ఈ పద్ధతిని అమలుజరపాలి.




ఐక్యతనూ, సామరస్యాన్ని నెలకొల్పాలి. సహజసిద్ధంగా స్త్రీ ప్రేమమయి. తన భర్తనూ సోదరులనూ సన్మార్గులుగా తీర్చి దిద్దగలగాలి. కని, పెంచే బిడ్డలకు మార్గ దర్శిని కావాలి. అలాంటి ఉన్నత ఆశ యాలతో స్త్రీని తీర్చిదిద్దటానికి ప్రయత్నిం చాడు మహాత్ముడు. అందుకనే కస్తూర్బా మహిళా లోకానికి ఆదర్శమూర్తి కాగలి గింది. సరోజినీ నాయుడూ, విజయలక్ష్మి పండిట్ మొదలైన దేశభక్తులు రూపొం దారు.

అంతేకాదు, దేశంలో యీనాడు ప్రచారం చేయబడుతున్న కుటుంబనియం త్రణ అనాడు మహాత్ముడు బోధించాడు. అయితే అది యీ కృత్రిమసాధనాలతో కాదు. యీ ఔషధ సేవతోకాదు. ఆత్మ నిగ్రహంతో విజ్ఞాన పూరితమైన ప్రాకృ తిక ధ్యేయంతో చేయాలని ఆయన ఆశయం. ఆ విధమైన జ్ఞానసముపార్జనకు స్త్రీ అక్షరాస్యతను సంపాదించాలి. విద్యా విభే దాలను అర్థంచేసుకోవాలి. అందుకు విద్యా వతి కావాలి. విద్య అంటే కేవలం డిగ్రీలు సంపాదించడమేకాదు, సాంఘిక పరిస్థి తులను అర్థం చేసుకోవాలి. దేశాన్ని అలుముకున్న దారిద్ర్యాన్ని పారద్రోల డానికి కృషిసల్పాలి. అందుకు వృత్తి విద్యలు ఎంతో సహకరిస్తాయి. మన దేశంలో రోజుకు ఒలకొక 25 పైసలు సరిపోడనలేని స్థితిలో స్త్రీకూడా ఆర్థిక విధానములో కుటుంబ నిర్వహణకు చేయూత నివ్వగలగాలి. నూలువడకడం, పాడిపంటల నభివృద్ధి పరచడంలో స్త్రీ ఎంతైనాతోడ్పడగలదు. కుటీరపరిశ్రమలు దీనికి ఆటపట్టులు కాగలవు. మహా త్ముని విద్యానిర్వచనములో యిట్టిభావన ఇమిడివుంది.

ఎంతోమంది విద్యావంతులను చూస్తు- న్నాము. మహాత్ముని భావాన్ని సమ గ్రంగా అర్థం చేసుకోవడంలో పొర పడ్డారా అనిపిస్తుంది. మనదేశానికేదిఅవ

సరమన్న విషయమే మరిచిపోయే స్థితికి వస్తున్నారు. ఉద్యోగమే ప్రధాన మని భావిస్తున్నట్టు కనిపిస్తున్నది. స్త్రీ జనాభ్యుదయశాఖలు పలువిధాలుగా వ్యాపించిన యీ రోజులలో ప్రతి స్త్రీకి చదువుకోడానికి అవకాశం కలిగింది చదువుకున్న స్త్రీలు చాలమంది యింతో అంతో చదువుకున్నానని, ఉద్యోగము కావాలని ఆరాటపడుతున్నారు. యింతే కాదు. చదువులో ప్రవేశించడం మూలంగా సామాన్యపనులు చేయడం, అంటే గృహిణికి అవసరమయ్యే పనులు, వంట వార్పు, పశుపోషణ, యింటిని శుభ్ర పర్చుకోవడం అలవాటులేదనే అభిప్రాయ పడుతున్నారు. చదువుకున్నంత మాత్రాన జీవితవిధానానికి, సమాజజీవితానికి కావ లసిన పనులు చేసుకోవడంలో సందేహిం చడం చూస్తుంటే మన విద్యలో మహా త్ముడు కలలు కన్న విజ్ఞాన మెంతవరకు లభిస్తోందీ అన్న అనుమానం వస్తుంది. కాబట్టి ప్రతిస్త్రీ విదుషీమణి కావడం ఉదర పోషణార్థమే కాకుండా సామాజిక జీవితాన్ని సఫలీకృతం చేయడానికికూడా అవసరమేనన్న విషయాన్ని గుర్తించాలి.

ఈనాడు జరుగుతున్న సంఘర్షణలు సామాజిక కల్లోలాలు చూస్తుంటే మహా త్ముని భావాలను సమాజం ఎంతవరకు అర్థం చేసుకొని ఆచరిస్తున్నదా అన్న సందేహము కలుగకమానదు. భారత దేశాభ్యున్నతికి, మానవతా భావాన్ని ప్రాతిపదికగా తీసుకొని సమాజాన్ని ప్రతిష్టపరుచుకోవాలన్న ఆశయాన్ని ప్రజలు మరచిపోతున్నారా అని ఆశ్చర్యం వేస్తుంది. మహాత్ముని భావనలో కులమత వ్యత్యాసం వుండకూడదు. వర్గవిభేదాలు ప్రాంతీయ విభేదాలు మచ్చుకైనా మొల కెత్తకూడదు. కాని యీనాడు ఎక్కడ చూచినా అసహనమే. ఎటుచూచినా తార తమ్యాలే. స్వార్థపూరితమైన ఆకాంక్షలే. మానవుడు తోటి మానవుణ్ని ప్రేమించ టానికి బదులు ద్వేషిస్తున్నట్లు స్పష్టమవు తున్నది అన్నివైపులా అంతఃకలహాలే. మహాత్ముని శతజయంతిఉత్సవాలను ఒక వైపున జరుపుకుంటున్నాం. ఆ మానసీ యుని లక్ష్యాలనుమరొకవైపున నిర్లక్ష్యం చేస్తున్నాం. పదవీ వ్యామోహాలతో, అధి కార వాంఛలతో, విద్యావంతులు సామాన్య ప్రజలను తీర్చి దిద్దలేకపో తున్నారు. ఇంకనూ మహాత్ముని మధుర వాణి నినాదాలు మననుండి వేరుకాలేదు ఆ త్యాగమూర్తి ఉపదేశ కిరణాలు ప్రకా శిస్తూనే ఉన్నాయి అయినప్పటికీ ఆలో చించి అర్థం చేసుకోగల విజ్ఞానం ప్రజ లలో సన్నగిల్లుతూంది.

ఇట్టి స్థితిలో భారత నారీమణి జాతిపిత అడుగుజాడ లనుసరించి, ఆయన భావనా మూర్తిగా రూపొందాలి. సమాజాన్ని వైతా ళికురాలిగా మేల్కొలపాలి. తాను సహన శీలగా సార్థకత నొందాలి. మహాత్ముడు చూపిన స్త్రీ జనాభ్యుదయమార్గాన పయ నిస్తూ జాతికే చూపుదారి కావాలి.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)



# గాంధీ మహాత్ముడు మనదేశపు స్వాతంత్ర్య నిర్మాత

నైతిక విలువలు సన్నగిల్లుతున్న యీ రోజులలో, గాంధీజీ తన జీవితచర్యల ద్వారా నిరూపించిన అద్భుత గుణాలు, నైతిక మహాత్యము, సాటిలేనివి అని చెప్పవచ్చును.

సమాజంలో అట్టడుగున ఉన్న హరి జనుల అభ్యున్నతికి, మహిళల అభ్యుద యానికి నిరంతరంగా పరిశ్రమించారు. భర్త అడుగుజాడలనే అనుసరిస్తూ విధే యురాలుగా, హైందవ అర్ధాంగిగా కస్తూర్బా గాంధీజీ అభీష్టాన్ని మన్నించ వలసి వచ్చింది. అంతులేని సహనం ప్రదర్శించటం, దేనికీ కలవరపడకపోవ టం, అంతరాత్మకు విరుద్ధం కాని పనిని ఆచరించటం–ఇది కస్తూర్బా స్వభావాలు.

గాంధీజీకి సత్యాగ్రహపు ప్రాథమిక పాఠాలు బోధించటానికి కస్తూర్బా స్వభా వాలు కొంత కారణమని ఆయన చెప్పు కున్నారట.

అరవై సంవత్సరాలకు పైగా సహ జీవనం నెరపిన యీ అపూర్వ దంపతుల జీవితంలో ఎప్పుడూ ఏ ఒక్క రో మాత్రమే ఆధిక్యము వహించలేదు. ఇచ్చి పుచ్చుకునే వైఖరిని వారు ప్రద ర్శించారు. కొన్నిపర్యాయాలు కస్తూర్బాకు కష్టం కలిగించకుండా ఉండేందుకు తానే బాధలుఅనుభవించారు. ఓసారికస్తూర్బాకు సుస్తీ చేసినప్పుడు పూర్తిగా చప్పిడి ఆహా రం తీసుకోమని గాంధీ ఆమెను కోరారు. అలా చేయడం ఆమెకు యిష్టంలేదు. గాంధీజీ పట్టుబట్టారు. అప్పుడు ఆమె ఆవేశంతో మీరు ఎప్పుడైనా అలా చేస్తారా అన్నది. దానికి సమాధానంగా ఆయన యీ రోజునుండి, యీ క్షణం నుండే నేను అలాంటి ఆహారమే తీసు కుంటాను అన్నారు.

ప్రతిఫలం కోరని సేవయే సేవయని నమ్మినవ్యక్తి గాంధీజీ. నగలపై మోహము వద్దని బోధచేసేవారు. స్త్రీల సౌందర్యం అంటే ఆత్మ సౌందర్యం గాని, నగల అలంకరణవల్ల అందం రాదని అంటూండేవారు. తాను నమ్మిన విషయాన్ని ఆచరించడం ఆయనపంతు.

ఒకసారి దక్షిణాఫ్రికాలో గాంధీజీకి

రాజ్యాం సిన్హా

వీడ్కోలు సభలు జరిపిన సందర్భములో వెండి, బంగారము నగలు యిచ్చారు. ఈ నగలన్నిటిని ధర్మనిధిగా నేర్ప రచి దాని ఉపయోగానికి కొందరు ధర్మ కర్తలను నియమించారు. యీ నగలలో 40 గిన్నీల బంగారు గొలుసొకటి కస్తూర్బా కొరకిచ్చారు. ఇది నా కిచ్చిన గొలుసు. నా కోడండ్రకోసం వుంచుకుంటాను అన్నారు. కాని గాంధీజీ ససేమిరా ఒప్పుకోలేదు. ఆ గొలుసును నా సేవకు ప్రతిఫలముగా యిచ్చారుగాని నీకోసంకాదు. సేవకు ప్రతిఫలం అంగీక రించకూడదు అని ఆ నగను కూడా యిచ్చేశారు.

నైతిక పద్ధతులద్వారా గాంధీజీ సాధిం చిన విజయాలు కొన్ని అపూర్వమైనవి. అహమ్మదాబాదులోనూలుబట్టలమిల్లులు చాల వున్నాయి. అవి ప్రపంచ యుద్ధపు రోజులు. విదేశాలనుంచి బట్టల దిగుమతి లేదు. మన మిల్లు బట్టలకు ధరలు విపరీ తంగా హెచ్చి యజమానుల లాభాలు ఎంతో పెరిగినవి. తిండిగింజల ధరలు హెచ్చినందున జీవనవ్యయం పెరిగి కూలీలు జీతాలు పెంచమని కోరారు. మిల్లు యజమానులు ఒప్పుకోలేదు.

తగవు హెచ్చినది. మధ్యవర్తిద్వారా పరిష్కరించుకొమ్మని ఉభయులకు సూచించారు. కార్మికులు ఒప్పుకున్నారు. మిల్లు యజమానులు పంచాయతీని నిరాక రించారు. అంతట విధిలేక పనివాండ్రు సమ్మె చేశారు. గాంధీగారే అందుకు నాయకులయ్యారు.

కూలీలు రెండువారాలు పట్టుదలతో సమ్మె సాగించారు. కార్మికులకు సత్యా గ్రహ పద్ధతి నేర్పారు. రాజీకుదిరేవరకు మిల్లులో చేరవద్దు. అంతవరకు ఏ చేతి పనులో చేసుకుంటూ జీవితావసరాలు గడుపుకొండని ఉద్బోధ చేశారు.

మిల్లు యజమానులు క్రొత్త కార్మికు లను హెచ్చు జీతాలకుతెచ్చి మిల్లు పనులు సాగించుకున్నారు. పాత కార్మికులు రెండువారాలు గడిచిన తరువాత కడుపు మంటతో క్రొత్త పనివాండ్రను అడ్డుకో బోయారు. గాంధీగారు వారిని అది సత్యాగ్రహ విరుద్ధమని వారించి కొట్లాట లేకుండా తప్పించారు.

పాత కార్మికులు కొందరు పరిస్థితు లకు తాళలేక గత్యంతరం లేక జీవనా ధారముకై మిల్లులోచేరడానికి వెళ్ళారు. మిల్లు యజమానులు మాత్రము తమ పట్టుదల వీడలేదు. కూలీలతో పంచాయతీ ఏమిటి? సమ్మెచేసినవారు లొంగక తప్పదు అనే అహంభావంతో పట్టు దలగా ఉన్నారు. ఆ స్థితిలో గాంధీగారి కేమియు తోచలేదు. కూలీలకు నిగ్రహము కలిగించుటకు, మిల్లు యజమానులకు ఆత్మశోధన కలుగచేయడానికి ఉపవాసం ప్రారంభించారు.

కూలీలలో అలజడి ప్రారంభమైంది. తమకోసం మహాత్ముడు ఉపవాస దీక్ష చేస్తున్నారని తెలిసి మిల్లు పనికిపోకుండా కట్టుగా నిలబడ్డారు. మిల్లు యజమానులకు కూడా ఆత్మశోధన కలిగింది. మధ్యవర్తి తీర్పుకు ఒప్పుకొని సమ్మెచేస్తున్నవారి జీతములను న్యాయంగా హెచ్చించారు. మిల్లు పనివారు తమ బానిసలుకారని, గాంధీగారు బీదలపక్షం వహించి కూలీ హెచ్చింపు కావాలనికోరుట న్యాయమే నని గ్రహించారు.

మరొకసారి ఇంకొక పెద్ద సమస్య వచ్చింది. 1916-17 సంవత్సరంలో గుజరాతులోని ఖేరా జిల్లాలో పంటలు బొత్తిగా పాడయ్యాయి. ప్రభుత్వోద్యోగులు పన్నులకై బీదరైతులను అనేక విధాల బాధించారు. బొంబాయి శాసన సభలో శ్రీ విఠల్‌భాయిపటేలు మున్నగు నాయకులు ఆ సంవత్సరము పన్నులు మాఫుచేయమని ప్రభుత్వాన్ని కోరారు.

భూమిలో పాతిక పంటయే తేలిన ట్టయితే సర్కారు రూల్సుప్రకారం ఆ భూమిపైన పన్ను అంతయు కొట్టివేయ వలయును. ఆ మాత్రం పంటకూడా అప్పుడా జిల్లాలో కాలేదు. కాని హెచ్చు పండినదని ఉద్యోగస్థులన్నారు. బహి రంగ విచారణ కావాలని నాయకులన్నారు. ప్రభుత్వం ఒప్పుకోలేదు. వసూలుకు ఉద్యోగస్థులనుండి జప్తుపత్తిడి హెచ్చింది. రైతు నాయకులు గాంధీగారి నాశ్రయిం చారు. ఆయన జిల్లాలో తిరిగి పరిశీలించి రైతులవాదము నిజమని గ్రహించి కలెక్టరును కలుసుకొని రైతుల తరఫున మాట్లాడారు. ఏమీ ప్రయోజనము లేక పోయింది. సత్యాగ్రహము తప్ప మరో మార్గం లేదని నిర్ణయించుకున్నారు. ఆస్తులు జప్తుచేసి వేలమువేసినా, జైళ్ళకు పంపినా పన్నులు ఇవ్వము అని ప్రమా ణాలు చేశారు.

ప్రభుత్వోద్యోగులు పన్నులు రాబట్టు టకు రైతుల చరాస్తులకు జప్తులు, వేల ములు తెచ్చారు. రైతుల అరెస్టులు, దౌర్జన్యములు సాగించారు. ఏమి చేసినా పన్నులు వసూలు కాలేదు. ఆస్తులు వేలంలో కొనేవారే లేకపోయారు. తమ తమ ప్రయత్నములన్నియు వ్యర్థంకాగా ప్రభుత్వంవారు రాజీకి వచ్చి బీదల పన్నులు మాఫుచేయుటకు భాగ్యవంతుల నుండి మాత్రం వసూలుచేయుటకు ఒప్పు కున్నారు.

తాను నమ్మినదానినిపట్టుదలతో, నైతిక మహత్యంతో సాధించటంలో గాంధీజీకి మించినవారులేరు. ఏవిషయంలో నయినా నిర్భయంగా, నిష్కర్షగా ఆత్మపరిశోధన చేసుకోగలిగిన వ్యక్తికూడ గాంధీజీయే.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)

# సిగరెట్లు నాకంటే గొప్పవి

పొగ త్రాగటాన్ని గాంధీజీ విషప్రాయంగా చూస్తారనే సంగతి అందరికీ తెలిసిందే. ఆత్మకథలో ఆయన వ్రాశారు. పొగత్రాగే అభ్యాసం అనాగరికమనీ, అపాయకరమనీ నా అభిప్రాయం. పొగ త్రాగటానికి ప్రపంచమంతా ఎందు కిలా ఎగబడుతున్నారో నాకు బోధపడదు. అందరూ పొగ త్రాగుతూవుండే రైలుపెట్టెలో ప్రయాణం చేయటం నేను భరించలేను. నాకు వూపిరాడదు.

మౌలానా అబుల్‌కలాం అజాద్ తప్ప మరెవరూ గాంధీజీ సమక్షంలో పొగ త్రాగటం ఎరగము. అజాద్‌కు యీ అలవాటు బాగావుంది. తనను చూడడానికి అజాద్ వస్తున్నారని తెలియగానే గాంధీజీ ఒక ఏర్పాటు ముందుగాచేసి ఉంచుతారు. తాము ఉమ్మివేసుకునే థూవ్‌దాన్‌ను కడిగించి ఉంచుతారు. అజాద్ రాగానే, సిగరెట్ నుసి రాల్చటానికి ఆయన ప్రక్కన దాన్ని పెట్టిస్తారు. ఈ విషయమై ప్రత్యేకంగా బాపూజీ ఆశ్రమవాసులను ఆదేశిస్తారు. మౌలానాజీ వచ్చి కూర్చొని, యీ యేర్పాటు చూచి, తన్నుతాను చీదరించుకొంటూ, "మీరీ ఏర్పాటు చేయించడం చూడగానే మాకు సిగ్గనిపిస్తుంది. కాని, ఏం చెయ్యము? మేము యీ దురలవాటుకు బానిసలం. మా తలలో మట్టివుంది," అంటూ చేతితో తల చూపిస్తారు.

గాంధీజీ చిరునవ్వుతో, "ఫరవాలేదు, ఉపయోగించండి," అంటారప్పుడు.

ఐతే బీడీ, సిగరెట్లను గురించి ఒకనాడు కొందరు బాపూజీని నిక్కచ్చిగా అడగటం జరిగింది.

షికారు వెళ్లినప్పుడు, షికారునుండి తిరిగివచ్చి కూర్చున్నప్పుడు, ప్రార్థనా నంతరం, పడుకోబోయేముందు ఉండే విరామసమయంలో బాపూజీతో ఎవరైనా మాట్లాడే అవకాశం ఉంటుంది. అలాటి ఒక విరామసమయంలో ఆశ్రమాన్ని చూడ వచ్చిన కొందరు బాపూజీని ప్రశ్నించారు. "బీడీ సిగరెట్ల వ్యాప్తి దేశంలో నానాటికి పెరిగిపోతున్నదికదా? దానిని నిరసిస్తూ మీ రెందు కొక ప్రకటన చెయ్యరు, బాపూజీ? అలా చేస్తే యీ దురాచారం సమసిపోయే అవకాశం కలుగుతుంది కదా?" అన్నారు.

బాపూజీ నవ్వుతూ, "నేనలాచేస్తే నా మహాత్మతనాన్ని కోల్పోవలసివస్తుంది. బీడీ, సిగరెట్లు నాకంటే గొప్పవి" అన్నారు.

బీడీ, సిగరెట్లు ప్రజలలో ఎంత లోతుగా వేళ్లు తన్ని ఉన్నాయో ఆ మాటలతో అకళింపు చేసికొని, అక్కడివారంతా నివ్వెరపోయారు.

[ఊట్ల కొండయ్య గారి 'గాంధీపథం' నుంచి]

# గాంధీ జీవిత విశేషాలు

రాజకోటలో ఒక హైస్కూలు ఉండేది. దాని పేరు ఆల్‌ఫ్రెడ్ హైస్కూలు. ఆ స్కూలు హెడ్మాస్టరుపేరు దోరాబ్జీ ఎడుల్జీ గిమి. పెద్దక్లాసు పిల్లలు డ్రిల్లుకు హాజరుకాకపోతే ఆయనకు చాలా కోపం.

"శనివారంనాడు డ్రిల్లుకు ఎందుకు హాజరు కాలేదు?" అని ఆయన 1883లో ఒక పధ్నాలుగేళ్ళ కుర్రవాణ్ణి పట్టుకుని దబాయించాడు.

"మా నాన్నకు సేవచేస్తూ ఉండిపోయాను. మబ్బుగా ఉండి టైము తెలియలేదు. నేను వచ్చేసరికి డ్రిల్లు క్లాసు అయిపోయింది," అన్నాడా కుర్రాడు.

"అబద్ధం!'' అన్నాడు హెడ్మాస్టరు.

జీవితమంతా సత్యాన్ని ఎదుర్కొనున్న ఆ కుర్రాడు తనను ఎవరో చావగొట్టినట్టు ఏడ్చాడు. పాపం, అతను ఎన్నడూ ఎవరితోనూ అబద్ధం చెప్పిఎరుగడు. అది వాళ్ళ వంశంలోనే లేదు. ఈ కుర్రవాడి తండ్రి కరమ్‌చందూ, తాత ఉత్తమచందూకూడా పేరుమోసిన నిజాయితీపరులు; నిజంచెప్పే ధైర్యం కలవాళ్ళు.

గాంధీలు వైశ్యులు. వర్తకం వారి వృత్తి. వారి పూర్వీకుడు జూనాగఢ్ సంస్థానం నుంచి వచ్చి పోర్బందరులో స్థిరపడ్డాడు. పోర్బందరు పరిపాలకుడు ఉత్తమచందును తన దివానుగా నియమించటంతో గాంధీ కుటుంబం ప్రతిష్ఠ సంపాదించింది. దివానుగా ఉత్తమచందు సమర్థు డనిపించుకున్నాడు. అయితే పాలకుడు చనిపోయాక ఆయన తల్లికీ, ఉత్తమచందుకూ సరిపడలేదు. ఆమె ప్రేరణతో సిపాయిలు ఉత్తమ చంద్రు ఇంటిని చుట్టుముట్టి ఇంటిపై కాల్పులు జరిపారు. అక్కడి బ్రిటిషు ఏజంటు అడ్డుపడ్డాడు. తరవాత ఉత్తమచందు జూనాగఢ్‌కు తిరిగిపోయి అక్కడి సంస్థానాధీశునివద్ద దివానుగా కుదిరాడు.

పోర్బందరుకు రాజమాత పరిపాలన అంతమై కొత్తపాలకుడు వచ్చాక ఉత్తమ చందుకు తిరిగి దివాన్గిరీ ఇస్తామన్నారుగాని, ఆయన సమ్మతించలేదు. అందుచేత ఆ

పదవి ఆయన కుమారుడైన కరమ్‌చందుకు 1847 లో ఇచ్చారు. ఆయన ఇరవై ఎనిమిదేళ్ళపాటు ఆ పదవిలో ఉన్నాడు.

కరమ్‌చంద్ భార్యలు ముగ్గురు వరసగా చనిపోయారు పుత్లీబాయి ఆయన నాలుగో భార్య. భర్తకన్న 20 ఏళ్లు చిన్నది. ఈమెకు ముగ్గురు కొడుకులూ, ఒక కూతురూ కలిగారు. మూడో కొడుకు మోహన్‌దాస్. ఇతను నూరేళ్ళ క్రితం—1869 అక్టోబరు 2వ తేదీన జన్మించాడు.

మోహన్‌దాస్ ఏడోఏట అతని తల్లిదండ్రులు రాజకోటకు వచ్చారు. పోర్బంద రులో లేని హైస్కూలు రాజకోటలో ఉన్నది. హైస్కూలులో చదివే రోజుల్లో మోహన్‌దాస్ గాంధీ చదువులోగాని, ఆటల్లోగాని ఏమాత్రమూ రాణించలేదు. అతను నలుగురిలో నోరు తెరవటానికే బిడియపడేవాడు.

అతనిపై అతని తల్లి ప్రభావం జాస్తిగా ఉండేది. ఆమె చాలా దైవభక్తిగలది. ఆచారాలను శ్రద్ధగా పాటించేది. స్త్రీ సహజమైన అలంకరణ వ్యామోహం ఆమెకు లేదు. అస్తమానమూ ఇంటిపనిలో మునిగితేలేది. ఆమెకు మూఢవిశ్వాసాలు చాలా ఉండేవి. గాంధీకి చిన్నతనంలో అన్నీ అనుమానాలే పనిచేసేదాన్ని తాకితే ఎలా మైలపడతాం? గ్రహణం పట్టినప్పుడు మనకేం అవుతుంది? తల్లి ఏదో సమా ధానం చెప్పేది, కాని కొడుకు తృప్తిపడేవాడు కాడు. అయినా అతను తల్లినుంచి కొన్ని నేర్చుకున్నాడు. మానవులంపట్ల మాతృప్రేమా, రోగులకు సేవ చెయ్యటమూ అతనికి తల్లినుంచి సంక్రమించిన గుణాలే. ఆయన జీవితాంతమూ అవలంబించిన దృఢ దీక్షకూడా ఆమెదే.

* * *

ఖర్చులు కలిసివస్తాయని మోహన్‌కు అతని అన్నతోనూ, మరొక దాయాది తోనూ కలిపి పెళ్లి చేసేశారు. పెళ్లినాటికి మోహన్ పదమూడేళ్ళవాడు వధువు కస్తూర్బాయి. గోకుల్‌దాస్ మకాన్జీ అనే పోర్బందరు వర్తకుడి కూతురు.

భార్యాభర్తలు అతిచనువించరాదని మోహన్ ఎక్కడో చదివాడు అతను మరొక స్త్రీకేసి కన్నెత్తి చూడకపోవటమేగాక, తన భార్యకూడా పాతివ్రత్యం నెరపాలని, ఆమెను వెయ్యికళ్ళతో కనిపెడుతూ వచ్చాడు. ఆమె తన అనుమతిలేకుండా ఆల యానికిగాని, ఎరిగున్నవాళ్ళ ఇళ్ళకుగాని పోరాదు. అతని అనుమానాలను రెచ్చగొట్టే మిత్రుడొకడు మోహనుకు దాపరించాడు. కస్తూర్బాయి భర్త తన నిలా దిగ్బంధం చెయ్యటం సహించలేక తిరగబడింది. ఆమె "సత్యాగ్రహం" అవలంబించి, భర్త

పెట్టే కష్టాలన్నీ భరిస్తూ ఎదురుతిరిగింది. ఆమెవద్ద అహింసా విధానాన్ని నేర్చుకున్నానని గాంధీ ఒప్పుకున్నాడు.

మోహన్ పెద్దవాళ్ళ ఆజ్ఞలను కిక్కురుమనకుండా శిరసావహిస్తూ వచ్చేవాడు. కాని ఇందువల్ల తన స్వాతంత్ర్యం సంకుచితమైపోతున్నదన్న బాధ కలగసాగింది. ఈ బాధవల్ల అతను తన వ్యక్తిత్వాన్ని నిలుపుకునేటందుకు నిషేధాలను ఉల్లంఘించాడు. అతను ఉల్లంఘించిన నిషేధా లేవంటే మాంసం తినకూడదన్నదీ, పొగ తాగరాదన్నదీనూ.

మోహన్ సహాధ్యాయి మెహతాబ్ అనేవాడు ఉండేవాడు. మాంసం తినితీరాలనీ, చాలామంది రహస్యంగా మాంసం తింటూ తిననట్టు నటిస్తారనీ, బ్రిటిషువాళ్లు మాంసంతిని, దార్ఢ్యంకలిగి ఉండటంచేతనే, శాకాహారులైన భారతీయులు వారిని జయించలేకుండా ఉన్నారనీ మెహతాబ్ మోహన్‌కు నూరిపోశాడు. మోహన్‌కు దయ్యాలు కలలో కనిపించేవి; మాంసం తింటే అలాంటి కలలు రావన్నాడు మెహతాబ్.

ఈ కబుర్లతో మోహన్ లొంగిపోయి, పెద్దవాళ్ళకు తెలియకుండా మాంసం తినటానికి సిద్ధమయాడు. మాంసాహారవిందు నదీతీరాన ఏకాంతస్థలంలో ఏర్పాటయింది. మొదటివిందు తరవాత మోహన్‌కు తన పొట్టలో మేక అరుస్తున్నట్టనిపించింది. కాని క్రమంగా మాంసాహార విముఖత తొలగిపోయింది. ఈ విందులు అప్పుడప్పుడూ జరుగుతూ వచ్చాయి. అయితే ఒక పెద్ద చిక్కు వచ్చిపడింది; విందు కుడిచిననాడు ఇంటివద్ద ఆకలి లేకపోవటాని కేదో ఒక సాకుచెప్పాలి. అబద్ధాలు చెప్పటం అతని తత్వానికి పడదు. అందుచేత, తాను పెద్దవాడై, తనను అడిగే వాళ్లుండని దశ వచ్చేదాకా ఈ విందులు నిలపాలని మోహన్ నిర్ణయించుకున్నాడు.

పొగ తాగేప్రయత్నం కూడా సఫలం కాలేదు. మోహనూ, మరో కుర్రవాడూ కలిసి, సిగరెట్ల "పిక్కలు'' ఏరి కాల్చారు. ఇది అంత తృప్తికరంగా సాగలేదు. సిగరెట్లు కొనాలంటే డబ్బులు కావాలి. వాళ్ళదగ్గర డబ్బులులేవు. పనివాళ్ళ డబ్బుల్లోంచి కానులు కాజేశారు. కాని అందువల్ల ఫలితం లేకపోయింది. ఏవో పిచ్చి మొక్కల కాడలు కాల్చిచూశారు. తమ ప్రయత్నాలన్నీ విఘ్నమయేసరికి, ఇద్దరూ దేవాలయానికి పోయి ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకున్నారు. కాని తీరా చావబోయేసమయంలో భయంవేసి, ఆ ప్రయత్నం విరమించుకున్నారు. పొగ తాగటం మానెయ్యవలసివచ్చింది.

తన అన్న చేసిన బాకీ తీర్చటానికి మోహన్ కొంచెం బంగారం దొంగిలించాడు. కాని అంతరాత్మ తిరగబడి అతన్ని చాలా వేధించింది. దాని బాధ భరించలేక అతను తాను చేసిన తప్పును కాగితంమీదరాసి, తీసుకుపోయి తండ్రికి చూపాడు. కొడుకుతో బాటు తండ్రికూడా అశ్రువులు రాల్చి కొడుకును క్షమించాడు.

* * *

మోహన్ 1887 లో మెట్రిక్యులేషన్ పాసయాడు. ఆ క్రితం సంవత్సరమే అతని తండ్రి చనిపోవటమూ, కుటుంబం ఆర్థికంగా చిక్కులలో పడటమూ జరిగింది. ఆ కుటుంబంలో అత నొక్కడే కాస్త చదువు అబ్బినవాడు. అతని పైనే అందరూ ఆశలుపెట్టుకుని ఉండటంచేత అతన్ని భావనగర్‌కాలేజీకి పంపారు. అక్కడ బోధనాభాష ఇంగ్లీషు కావటంచేత అతనికి పాఠాలు తలకెక్కలేదు.

గాంధీ కుటుంబానికి మావ్జీదవే అనే మిత్రుడొక డుండేవాడు. మోహన్‌ను ఇంగ్లండుపంపి బారిష్టరీ చదివించమని ఆయన సూచించాడు. ఈ ఆలోచన మోహన్‌కు కూడా నచ్చింది. కాని డబ్బేదీ? దేశాంతరాలకుపోయి తన కొడుకు అన్ని దురల వాట్లూ నేర్చుకుంటాడని పుత్లీబాయికి భయం. మోహన్ పోర్బందర్‌కు వెళ్ళి, అక్కడి బ్రిటిషు అధికారిని స్కాలర్‌షిప్ యాచించాడు. కాని ఆ అధికారి నిరాకరించాడు. చివరకు మోహన్ ప్రయాణానికి కావలసిన డబ్బు అతని అన్నే సర్దాడు. దేశాంతరాలలో ఉండగా మద్యాన్నీ, మగువనూ, మాంసాన్నీ ముట్టనని మోహన్ ప్రమాణంచేశాక పుత్లీబాయి మనసు స్థిమితపడింది.

1888 సెప్టెంబరు 4 న మోహన్ బొంబాయినుంచి స్టీమరులో ఇంగ్లండుకు బయలుదేరాడు. అతని కులంవాళ్ళు అతని కుటుంబాన్ని వెలివేశారు.

ఇంగ్లండులో అంతా కొత్త. అసలే పిరికివాడు. శాకాహారం మాత్రమే తినాలంటే సాగటం కష్టం. మోహన్ రాత్రిళ్ళు తన తల్లినీ, భార్యనూ, చిన్న కొడుకునూ తలుచుకుని ఏడిచేవాడు. రోజు ఒక యుగంగా ఉన్నది. మూడేళ్ళు ఎలా గడపటం? ఫారింగ్టన్ వీధిలో ఒక శాకాహార భోజనశాల కనబడింది. అతనికి ప్రాణం లేచివచ్చింది. శాకాహార ప్రశస్తిగురించి సాల్ట్ అనేవాడు రాసిన పుస్తకం ఒకటి దొరికింది. అది చదివి మోహన్ యావజ్జీవ శాకాహారిగా మారిపోయాడు.

కొంతకాల మయాక అతను ఇంగ్లీషువాళ్ళ దుస్తులు వేసుకుని తిరిగాడు. డబ్బు తగలేశాడు. కాని మూడు మాసాలయాక అతని అసలు స్వభావం ఇలాటి జీవితాన్ని తోసిపుచ్చింది. అతను చౌక గదికి మారి, నెలకు రెండు పౌనుల ఖర్చుతో జీవించటం నేర్చుకున్నాడు.



బాపూజీ

ఇంగ్లండులోని భారతీయ ముస్లిములు "అంజుమన్ ఇస్లామియా" అనే సంస్థను ఏర్పాటు చేశారు. అక్కడికి అనేకమంది భారతీయ విద్యార్థులు వచ్చి, రాజకీయ, సాంఘిక సమస్యలు చర్చించేవారు. వారిలో కొందరు భారతీయ రాజకీయ రంగంలో ప్రముఖ పాత్రలు వహించారు. మోహన్ అక్కడికి వెళ్ళేవాడు గాని, ధాటిగా మాట్లాడం అతనికి సాధ్యమయేదికాదు. నలుగురిమధ్య చొరవగా మాట్లాడలేనివాడు కోర్టులో ప్రత్యర్థి ఎదట ధాటిగా ఏం మాట్లాడగలడు? ఈ భయం మోహనుకు ఉండనే ఉండేది.

ఇంగ్లండులో చదువు పూర్తిచేసి తిరిగి వచ్చి బొంబాయిలో అడుగుపెడుతూనే అతను దుర్వార్త విన్నాడు – అతను ఇంగ్లండులో ఉండగానే అతని తల్లి పోయింది; ఆ సంగతి బుద్ధిపూర్వకంగానే అతనికి తెలియకుండా ఉంచారు.

ఇంగ్లండు వెళ్ళినందుకు అతన్ని కులంవాళ్ళు వెలివేశారు. అందుకని అతను నాసిక్ వెళ్ళి, గోదావరిలో స్నానంచేసి వచ్చాడు. అప్పటికీ కొందరు అతన్ని వెలి వెయ్యాలనే పట్టుబట్టారు. మోహన్ అందుకు అభ్యంతరం చెప్పక, వాళ్ళు తనను వెలివెయ్యటంలో తానుకూడా సహకరించాడు. దీనితో వాళ్ళకు ఉత్సాహభంగమైంది. కులాలనూ, వర్ణాశ్రమ ధర్మాలనూ అతను ఆమోదించాడు; వాటి ఆధారంగా అమలు లోకి వచ్చిన మూఢాచారాలను మాత్రమే ఆమోదించలేదు.

మోహన్ ఇంగ్లండులో బారిస్టరై వచ్చాడేగాని, ఈ దేశపు చట్టాలనుగురించి ఏమీ తెలియని కారణంచేత కోర్టులో ప్రాక్టీసు చెయ్యటం అసాధ్యమయింది. అదీ గాక తనకు వచ్చిన మొదటి కేసులోనే ఒక సాక్షిని క్రాసు పరీక్ష చేయటానికి ప్రయత్నించి అతను మూర్ఛపోయినంత పనిచేశాడు. అతని క్లయంటు మామిబాయి అనే పేదరాలు, మోహనుకు 30 రూపాయలు ఫీజు ఇచ్చుకున్నది. అతను ఆమె కా డబ్బు వాపస్ చేసేశాడు.

అతని స్థితి ఎంత హీనమయిందంటే, బొంబాయిలో ఒక హైస్కూలులో 70 రూపాయల జీతంమీద ఒక మేష్టరుపని ఖాళీ అయితే దానికి దరఖాస్తు పెట్టాడు. కాని అది రాలేదు; ఇండియాలో పట్టభద్రుడు కానివారికి ఆ పని ఇవ్వరట.

చివరకు మోహన్ రాజకోటలోనే పిటిషనులు రాసిపెట్టి నెలకు 300 రూపాయల దాకా సంపాదించసాగాడు. కాని యీ దశలో అతన్ని రాజకోటలోని పొలిటికల్ ఏజంటు ఒక సందర్భంలో అవమానించాడు. ఆ బ్రిటిషు అధికారి పైన వ్యాజ్యం వెయ్యాలనికూడా అతను అనుకున్నాడు గాని అందువల్ల ప్రయోజనం ఉండదని ఫిరోజ్ షా మెహతావంటి గొప్ప ప్లీడరే సలహా ఇచ్చాడు. మోహన్‌కు రాజకోటలో



1913 లో దక్షిణాఫ్రికాలో గాంధీజీ (ఫోటోలో మధ్య నున్నారు) తమ కార్యాలయం బయట కూర్చున్న దృశ్యం. ఆయనకు ఎడమ ప్రక్కన కుమారి స్లెసిన్.

పని చెయ్యటం దుస్సహ మనిపించింది. తాను చేసేపనిలో అతను చీటికిమాటికీ ఆ బ్రిటిషు అధికారిని చూడాలి.

ఈ క్లిష్ట పరిస్థితిలో అతనికి దక్షిణాఫ్రికాలో ఉద్యోగం లభించింది.

* * *

నేటాల్‌లోని ధనిక భారతీయ వర్తకులలో ఒకరు అబ్దుల్లా. ట్రాన్స్‌వాల్‌లోని మరొక భారతీయ వర్తకునికీ అబ్దుల్లాకూ ప్రిటోరియాలో వ్యాజ్యం నడుస్తున్నది. వ్యాజ్యం చాలా పెద్దమొత్తం గురించి—40,000 పౌనులు! ఇద్దరూ ఒకరిఅంతు ఒకరు తేల్చుకోవాలనే కోరికలో ఉన్నవాళ్ళే. అబ్దుల్లా తాలూకు చిఠాలు చూసి,

వాళ్ళ లాయరుకు సహాయంగా ఉండటానికి మోహన్ పిలిపించబడ్డాడు. సంవత్సరం పాటు నౌకరీ గ్యారంటీ చేస్తూ, రానుపోను ఫస్ట్‌క్లాస్ ఛార్జీలూ, ఖర్చులూ పెట్టుకుని, 105 పౌనులు జీతం ఇచ్చే షరతుమీద అతన్ని పిలిచారు.

ఈ ఏడాది అనుభవం అతనికి లాభించింది. లాయరు విజయం కేవలం వాచాలత పైన ఆధారపడదనీ, కేసులు గెలవాలంటే పరిస్థితులు సక్రమంగా ఉండి, లాయరు చిత్తశుద్ధితో పనిచెయ్యాలనీ అతను గ్రహించాడు. అబ్దుల్లా పక్షాన నిజానికి బలం ఉన్నది, చట్టం అనుకూలంగా ఉన్నది. కాని వ్యాజ్యం పొడిగించటంవల్ల ధనం మంచినీళ్ళప్రాయంగా ఖర్చయిపోతున్నది. రాజీపడటం ఉభయులకూ లాభం.

అతి కష్టంమీద రెండు పార్టీలూ మధ్యవర్తి పరిష్కారానికి ఒప్పుకున్నాయి. మధ్యవర్తి అబ్దుల్లాకు అనుకూలంగా తీర్పు ఇచ్చాడు. ఆ తీర్పు అమలు జరిపితే రెండో పక్షం వాడైన త్యేబ్‌శేత్ దివాలా ఎత్తేస్తాడు. అబ్దుల్లా తనకు రావలసిన మొత్తాన్ని దఫాలావారీగా తీసుకునేటందుకు మోహన్ ఒప్పించాడు. ఇందువల్ల అతనికి ఆర్థికంగా నష్టం రాకపోగా ఒక నైతిక విజయం సాధించిన సంతృప్తి దక్కింది.

మోహన్ ఉద్యోగం ముగిసింది. డర్బాన్‌లో అబ్దుల్లా అతనికి వీడ్కోలు విందు చేశాడు. ఆ సమయంలో మోహన్ ''నేటాల్‌మెర్క్యురీ'' అనే పత్రికలో ఒకవార్త చూశాడు—నేటాల్ ప్రభుత్వం భారతీయులకు పౌరహక్కులు లేకుండా శాసనం చెయ్యబోతున్నది; ఆరెంజ్‌ఫ్రీ స్టేట్‌లో ఆరంభమైన భారతీయులవేట నేటాలులో కూడా ప్రారంభం కానున్నదన్నమాట.

అక్కడి వర్తకులు మోహన్‌ని ఉండి పొమ్మనీ, తమ తరఫున పని చెయ్యమనీ కోరారు. అతను సరేనన్నాడు.

* * *

అప్పటికి గాంధీ పాతికేళ్ళవాడు. రాజకీయాలలో జొరబడటం అదే మొదలు. అయినా ఒక ఏడాదిపాటు అక్కడి భారతీయుల జీవితాన్ని బాగా చూసి ఉన్నాడు గనక తాను వెయ్యవలసిన రాజకీయపు ఎత్తులను సరిగా నిర్ణయించాడు.

అక్కడి భారతీయులలో అనేకరకాలవాళ్ళున్నారు—ముస్లిములూ, హిందువులూ, పార్సీలూ ఉన్నారు; సగం బానిసలుగా దిగుమతి అయిన పాటకపు జనం ఉన్నారు; నేటాలులోనే పుట్టి పెరిగిన భారతీయ క్రైస్తవులున్నారు. వీరందరి మధ్యా సంఘీభావం ముందు ఏర్పడాలి. అందరూ భారతీయులేనన్న భావమూ, సమైక్యతా ఏర్పడాలి. అమలులోకి రానున్న శాసనం ఎలాంటిదో అన్ని పక్షాలకూ అర్థమయేటట్టు చేయాలి. దాన్నిగురించి ఇండియా, బ్రిటనులలో వ్యతిరేక భావం ప్రచారంకావాలి.

ప్రచారం చెయ్యటంలో గాంధీ చాలా గట్టివా డనిపించుకున్నాడు. ఆ ప్రచారం ఫలితంగా భారత జాతీయ కాంగ్రెసు 1894 డిసెంబరు సమావేశంలో పౌరహక్కుల అపహరణ బిల్లుకు వ్యతిరేకంగా తీర్మానం చేసింది. లండనులోని ''టైమ్స్'' పత్రిక దక్షిణాఫ్రికాలోని భారతీయుల పరిస్థితి గురించి మూడేళ్ళకాలంలో ఎనిమిది సంపాద కీయాలు రాసింది. గాంధీ స్వయంగా తయారుచేసిన అర్జీపై 400 మంది భారతీయులు సంతకాలుచేసి నేటాలు శాసన సభకూ, ప్రభుత్వానికీ సమర్పించారు. అయినా నేటాలు ప్రభుత్వం భారతీయ వ్యతిరేకచట్టాన్ని తయారు చెయ్యనే చేసింది.

అయినా భారతీయులు నిస్పృహ చెందలేదు. వారిలో రాజకీయ చైతన్యం ఒకటి ప్రవేశించింది. గాంధీకి ఆత్మవిశ్వాసం కూడా కుదిరింది. గాంధీని నేటాలులోనే ఉండిపొమ్మని అక్కడి భారతీయులు ఒత్తిడిచేశారు. డర్బానులో ఆయనకు ఏడాదికి 300 పౌనులు ముట్టేటట్టు వాళ్ళే చూస్తామన్నారు. ఆయన సుప్రీంకోర్టులో ప్రాక్టీసు చేసుకోవటానికి అనుమతి లభించింది.

దక్షిణాఫ్రికా భారతీయులకు ఒక సంస్థ అవసరం. అందుచేత నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ అనే సంస్థను గాంధీ ఏర్పాటుచేశాడు. అక్కడి పరిస్థితులకు అనుగుణంగా ఆ సంస్థ వ్యవస్థాపితమయింది. దానికి గాంధీయే సెక్రెటరీ. అందులో భారతీయులను సభ్యులుగా చేర్చటానికాయన చాలా శ్రమపడ్డాడు. ఆయన జీతం కింద దమ్మిడీకూడా తీసుకోలేదు.

రాజకీయవాదిగా ఆ తొలిరోజులలోనే గాంధీ కొన్ని నియమాలు ఏర్పరచుకున్నాడు. తన పక్షంగదా అని అన్యాయాన్ని సమర్థించరాదు; సత్యాన్ని ఎల్లప్పుడూ పాటించాలి; అతిశయోక్తులు పనికిరావు. నేటాల్ ఇండియన్ కాంగ్రెసు కేవలమూ భారతీయుల హక్కులకోసం పోరాడేటందుకే ఏర్పడలేదు. భారతీయుల సమష్టి జీవితాన్ని సంస్కరించటానికీ, సమైక్యం చెయ్యటానికీకూడా ఏర్పడింది. నేటాల్ భారతీయులను గాంధీ సమర్థించటంతోబాటు తీవ్రంగా విమర్శించేవాడుకూడా.

దక్షిణాఫ్రికాలో తెల్లవాళ్ళు విజృంభించి ఆసియావాసులకు ఎలాటి హక్కులూ లేకుండా చూడటమేగాక, నిత్యజీవితంలో వారిని పశువులకన్న హీనంగా చూసి, అంతులేని ఆంక్షలను వారిపై రుద్దారు. ఈ జులుమును ఎదుర్కోవలసి ఉన్నది.

* * *

తాను నేటాలులో ఉండటం ఖాయమే గనక గాంధీ తన కుటుంబాన్ని తీసుకుపోవటానికి 1896 మధ్యలో ఇండియాకు వచ్చాడు. ఆయన ఇండియాలో విశ్రాంతి తీసుకోలేదు. దక్షిణాఫ్రికాలోని భారతీయుల పరిస్థితి గురించి ఒక కరపత్రం

అచ్చువేయించి, దేశంలోగల ప్రముఖుల కందరికీ పంపాడు. పత్రిక లన్నిటికీ పంపాడు. అంతటితో వదలక దేశమంతా తిరిగాడు.

బొంబాయిలో ఫిరోజ్‌షామెహతా (బొంబాయికి మకుటంలేని రాజు) అధ్యక్షతన మీటింగు జరిగింది ఆ మీటింగులో చదవటానికి తయారు చేసుకువచ్చిన ప్రసంగాన్ని గాంధీ చదవలేకపోతే మరెవరో చదవవలసి వచ్చింది.

పూనాలో గాంధీ తిలక్‌నూ, గోఖలేనూ కూడా కలుసుకున్నాడు. ఆ ఇద్దరిదీ మామూలుగా చెరొకదారి. అయితే గాంధీవిషయంలో ఇద్దరూ ఒకే అభిప్రాయానికి వచ్చి, ఇద్దరూ కలిసే సభ ఏర్పాటు చేశారు. రాజకీయ చతురుడైనందున తిలక్, గాంధీకి భారతదేశపు పరిస్థితులు తెలియవని పసికట్టాడు. గాంధీకి ఫిరోజ్‌షా మెహతా, గోఖలే, తిలక్‌లు హిమాలయ శృంగాలలాగా కనిపించారు. గాంధీ రాజకీయ జీవితం నేటాలులో ఆరంభం కావటం మేలయింది; భారతదేశంలో ఆరంభమై ఉంటే ఆయనకు నామరూపాలుండేవి కావనుకోవచ్చు. మద్రాసులో గాంధీకి మంచి ఆదరం లభించింది; నేటాలులో కూలీలుగా వెళ్ళినవారిలో హెచ్చుభాగం మద్రాసు రాష్ట్రంవారే. కలకత్తాలో గాంధీకి అంత ప్రోత్సాహం లభించలేదు. కలకత్తాలో మీటింగు ఏర్పాటయేలోపలనే ఆయనను అర్జంటుగారమ్మని నేటాలునుంచి కేబిల్ వచ్చింది.

*  *  *

ఇండియాలో ఉండగా గాంధీ విడుదలచేసిన కరపత్రంగురించి నేటాలులో తెల్లవాళ్ళమధ్య చాలా దుష్ప్రచారం జరిగింది. వాళ్ళు గాంధీని నాశనం చెయ్యటానికి నిశ్చయించుకున్నారు. 1896 డిసెంబరు 19న డర్బానురేవులోకి రెండు ప్రయాణీకుల నౌకలువచ్చాయి. ఒకదానిలో గాంధీ, అతని కుటుంబమూ ఉన్నది. రెంటిలోనూ కలిపి నేటాలుకువస్తున్న భారతీయులు 400 మంది ఉన్నారు.

డర్బాను టౌనుహాలులో రెండువేలమంది తెల్లవాళ్లు సమావేశమై, ప్రభుత్వం తయారుచేసిన జాతివిద్వేష శాసనాన్ని అమలు జరుపుతామని ప్రమాణాలు చేశారు. ఇంకో మీటింగులో "నౌకలను ముంచండి" అని కేకలుపెట్టారు. నౌకలు రేవులోకి రాగానే తెల్లవాళ్ళు వెళ్ళి భారతీయులను వెనక్కు తిరిగిపొమ్మని నయానా, భయానా కోరారు. ఒప్పుకోనివాళ్ళను సముద్రంలోకి తోస్తామన్నారు. రెండు నౌకలనూ క్వారంటైనులో ఉంచారు. అయిదు రోజులన్నది మూడువారాలకు దేకింది. నిరక్షరులైన భారతీయులు బెదిరిపోతే, గాంధీ వారికి ధైర్యంచెప్పాడు. తనమూలానే నౌకలలోవారికి ఈ ఇక్కట్టు వచ్చిపడిందని చాలా బాధపడ్డాడు.



సంతోషంగా ఉన్న సమయంలో గాంధీ — అపూర్వమైన చిత్రం.

23 రోజుల అనంతరం నౌకలను క్వారంటైను నుంచి విడుదలచేసి, ప్రయాణీకు లను దిగనిచ్చారు. ఒక్క గాంధీనిమాత్రం సాయంకాలందాకా నౌకలోనే ఉండ మన్నాడు హారీ ఎస్కోంబ్ అనే ఆయన. ఆయన నేటాలుకు ఎటార్నీ జనరలు. తెల్ల వాళ్ళను రెచ్చగొట్టినవాడు ఆయనే.

కాని గాంధీ మిత్రుడైన తెల్లలాయరొకడు అపరాహ్ణంవేళ నౌకకువచ్చి, ప్రమాద మేమీ లేదనీ, దొంగలాగా ఆయన రాత్రివేళ డర్బాను ప్రవేశించటమేమిటనీ అన్నాడు. గాంధీభార్యా, పిల్లలూ రుస్తొమ్‌జీ అనే ఆయన ఇంటికి వెళ్ళేటట్టూ, గాంధీ తెల్ల లాయరువెంటవచ్చి చేరుకునేటట్టూ ఏర్పాటయింది.

కాని వారిద్దరూ కొద్దిదూరం నడిచారో లేదో తెలవాళ్ళపిల్లలు గాంధీని గుర్తిం చారు. వారిచుట్టూ పెద్దగుంపు పోగై పరిస్థితి ప్రమాదకరంగా పరిణమించింది. వాళ్ళు వెస్ట్ స్ట్రీట్ చేరేసరికి గుంపు తెల్లలాయరును లాగేసి, గాంధీమీద గుడ్లూ, రాళ్ళూ విసరసాగారు. "పత్రికలకు రాస్తావా ?" అని ఒక తెల్లవాడు గాంధీని క్రూరంగా తన్నాడు. గాంధీకి స్పృహతప్పినంతపని అయింది. ఆయన ప్రాణాలతో ఇల్లు చేరుకుంటాననుకోలేదు.

ఆసమయంలో ఒక వింతజరిగింది. అలెగ్జాండరు అనే పోలీసు సూపర్నెంటు భార్య అక్కడ ప్రత్యక్షమయింది. ఆమె గాంధీని గుర్తించి, తనగొడుగు తెరిచి పట్టి, ఆయన వెంటనే నడవసాగింది. తెల్లవాళ్ళు ఎంత ఉన్మాదంలో ఉన్నా తెల్లజాతి స్త్రీని హింసించ సాహసించలేక పోయారు. ఇంతలో కొందరు పోలీసులు వచ్చి, గాంధీని భద్రంగా ఆయనబసకు చేర్చారు.

గాంధీ గాయాలకు కట్టుకట్టే వ్యవధి అయినా లేకుండా ఆయన బసముందు పెద్ద గుంపు పోగయింది. వాళ్ళు గాంధీని బయటికిరమ్మనీ, రాకపోతే ఇంటికి నిప్పు పెడతామనీ బెదిరించసాగారు. పోలీసుసూపర్నెంటు అలెగ్జాండరు వచ్చి ఆ జనాన్ని కులాసాకబుర్లలో పెట్టాడు. ఈలోపల గాంధీని ఇల్లుదాటించే ప్రయత్నాలు జరిగాయి. ఆయనకు ఇండియను పోలీసువేషం వేశారు. ఒక డిటెక్టివు భారతీయ వర్తకుడివేషం వేసుకున్నాడు. ఇద్దరూ జనంమధ్యగా బయటికి వెళ్ళి, పోలీసుస్టేషను చేరుకున్నారు.

ఆయన పోలీసురక్షణలో ఎక్కువసేపు ఉండనవసరం లేకపోయింది. గాంధీ నేటాలు ప్రభుత్వంమీద లేనిపోని అభాండాలు వెయ్యలేదనీ, కరపత్రంలో ఆయన చేసిన ఆక్షేపణలు భారతీయుడి దృక్పథంనుంచి సబబైనవేనని స్థానిక పత్రిక ప్రక టించింది.

* * *

దక్షిణాఫ్రికాలో బ్రిటిషువారికీ, బోయెర్లకూ ఘర్షణ ఉంటూనేఉండేది. ఇది అధికారంకోసం పెనగులాట. ఈ ఘర్షణ 1899 లో యుద్ధంగా పరిణమించింది. భారతీయులు ఈ యుద్ధంలో బ్రిటిషువారికే సహాయపడాలని గాంధీ నిర్ణయించాడు. 1100 మంది భారతీయులతో ఒక ఆంబులెన్స్ కోర్ తయారయింది. అందులో 800 మంది మామూలు కూలీలు, మిగిలినవాళ్ళు ఉద్యోగాలు చేసుకునేవారు. యుద్ధం ముగిసినాక ఈ దళానికి చెందిన 37 మందికి పతకాలుకూడా బహూకరించారు.

ఈ యుద్ధంలో బ్రిటిషువారే గెలిచారు. కాని అందువల్ల భారతీయులకు ఏమీ లాభించలేదు. యుద్ధానికి ముందు, బోయెర్లు భారతీయులపట్ల అమానుషంగా ప్రవర్తించారని ఆక్షేపించిన బ్రిటిషువాళ్ళు, యుద్ధంకాగానే బోయెర్లతో ఏకమై, భారతీయులపట్ల మరింత అమానుషవైఖరి అవలంబించారు.

ఈ పరిణామాలు జరిగేలోపల గాంధీ—1901 ఆఖరులో—భారత దేశానికి తిరిగి వచ్చి, ఇక్కడే స్థిరపడే ఆలోచనలో ఉన్నాడు.

ఇంతలోనే మళ్లా దక్షిణాఫ్రికానుంచి పిలుపు వచ్చింది. దక్షిణాఫ్రికా భారతీయులది చావుబతుకు సమస్య అయింది. వాళ్ళకు తెల్లవాళ్ళతో సమానహక్కులు లేకపోవటం అటుంచి, అతిసామాన్య పౌరహక్కులుకూడా లేకుండాపోతున్నాయి. వారిచేత ఒక ఉద్యమం ప్రారంభింపజేసి దాన్ని నడిపేభారం గాంధీపైన పడింది. రాజకీయోద్యమాలు నడిపేటందుకు గాంధీ ఒక కొత్తచిట్కా కనిపెట్టాడు. అదే అహింసాయుతమైన సత్యాగ్రహం. ఆయన భారతీయులను సమావేశపరచి, "ప్రాణం పోయినాసరే, అవమానకరమైన చట్టానికి లొంగము; ప్రతిఘటిస్తాము," అని ప్రమాణం చేయించాడు. భారతీయులు ప్రతిఘటించనున్న చట్టం ఆసియావాసులు రిజిస్టరు కావాలన్నది. ఈ చట్టం 1907 జులై 1న అమలులోకి వచ్చింది.

గాంధీ సత్యాగ్రహోద్యమానికి నడుముకట్టాడు. అప్పటిదాకా నష్టంతెస్తూ ఉండిన "ఇండియన్ ఒపినియన్" ఇప్పుడు ప్రచారానికి మంచి సాధనమయింది. దాన్ని భారతీయులేగాక, ప్రత్యర్థులుకూడా కొన్నారు. అది 3,500 కాపీలదాకా అమ్మింది.

తెల్లవాళ్ళలో సానుభూతిపరులైనవారు గాంధీ హితంకోరి, ఉద్యమం ప్రారంభించవద్దనీ, ప్రయోజనం ఉండదనీ చెప్పారు. ఈ సంగతి గాంధీ ఒక మీటింగులో చెబితే, మహమ్మద్ కచ్చాలియా అనే వర్తకుడు ఠకీమని సమాధానం చెప్పాడు: "ప్రభుత్వం బలమైనదని మాకు తెలుసు. కాని అది మమ్మల్ని ఏం చెయ్యగలదు? జైళ్ళలో పెట్టగలదు, మా ఆస్తులు కాజెయ్యగలదు, మమ్మల్ని చంపగలదు. అందుకైనా ఒప్పుకుంటాంగాని ఈ దుష్టశాసనాన్ని సహించం."

జులై ఆఖరులోగా భారతీయులందరూ పర్మిట్లు తీసుకోవాలి. లేకపోతే చట్ట ప్రకారం శిక్షార్హులవుతారు. పర్మిట్లు ఇవ్వటానికి ఆఫీసులు తెరిచారు. ఈ ఆఫీసుల దగ్గర పికెటింగుకు గాంధీ అన్నిసన్నాహాలూ చేశాడు. వాలంటీర్లను తయారుచేశాడు. కుర్రవాళ్ళుకూడా చేరారు.

పికెటింగు ఫలించింది. బహుకొద్దిమంది రాత్రివేళ చాటుగా పర్మిట్లు తీసుకున్నారు. పర్మిట్లు పొందేగడువు నవంబరు 30 దాకా పెంచారు. అయినా 511 మంది భారతీయులు మాత్రమే గడువునాటికి పర్మిట్లు తీసుకున్నారు.

డిసెంబరు 27న గాంధీ జొహాన్స్‌బర్గులో ఒక మీటింగు ఏర్పాటుచేశాడు. (ఆ క్రితంరోజే ఇంగ్లండులోని ప్రభుత్వం ట్రాన్స్‌వాల్ ప్రభుత్వంచేసిన ఇమిగ్రేషన్ చట్టాన్ని ఆమోదించింది.) ఆ మీటింగులో మాట్లాడుతూ గాంధీ, "ఇంగ్లండుకు ఇండియాకావాలో, వలసలుకావాలో తేల్చుకోవలసిరావచ్చు." అన్నాడు.

"ఈ అల్లరంతా చేస్తున్నది గాంధీ, అతని అనుచరులూనూ," అన్నాడు జనరల్ స్మట్స్.

రిజిస్టరు చేసుకోనందుకు గాంధీకి రెండునెలలు విడిఖైదు ఇచ్చారు. గాంధీని జైలులో పెడితే మిగిలినవాళ్లు బెదిరిపోతారనుకున్నారు. కాని భారతీయులకు జైలు భయంపోయింది. 50 మంది పట్టే జొహాన్స్‌బర్గ్ జైలులోకి 155 మంది సత్యాగ్రహులు జొరబడ్డారు. ఆ జైలుకు "ఎడ్వర్డురాజుగారి హోటలు" అన్న మారుపేరు ప్రచారమయింది.

అకస్మాత్తుగా జనరల్ స్మట్స్ గాంధీని జొహాన్స్‌బర్గ్ జైలునుంచి తన ప్రిటోరియా ఆఫీసుకు పిలిపించి, భారతీయులందరూ రిజిస్ట్రేషన్ చేయించుకుంటే ఆసియావాసుల చట్టాన్ని రద్దుచేస్తానన్నాడు. గాంధీ చేసిన కొన్ని సూచనలను ఆమోదించాడు మర్నాడు ఉదయం మిగిలిన ఖైదీలను కూడా విడుదల చేస్తున్నానన్నాడు.

స్మట్స్ సెక్రెటరీవద్ద రైలుచార్జీలు అరువుతీసుకుని గాంధీ ప్రిటోరియానుంచి జొహాన్స్‌బర్గ్ వచ్చి, కొద్ది గంటలలో మీటింగు ఏర్పాటుచేశాడు. మీటింగులో చాలా విమర్శలు వెలువడ్డాయి. అధికారులు అన్నమాట నిలబెట్టుకుంటారని ఏమిటి? "ప్రత్యర్థి మాట నమ్మటం సత్యాగ్రహి విధి," అన్నాడు గాంధీ. ఒక పఠానువాడు గాంధీమీద లేచాడు. స్మట్స్ గాంధీకి 15,000 పౌనులు లంచం ఇచ్చాడన్నాడు, మొట్టమొదట రిజిస్ట్రేషను చేయించుకున్నవాణ్ణి చంపుతానన్నాడు "సోదర భారతీయుడి చేత చావటానికి విచారించనవసరం ఉండదు," అన్నాడు గాంధీ.



1945 లో గాంధీజీ సిమ్లా రాక – మనోర్ విల్లా వద్ద కారునుండి దిగుతున్నారు.

1908 ఫిబ్రవరి 10 న గాంధీ మొట్టమొదట రిజిస్ట్రేషను చేయించుకునేవాడుగా వెళ్లాడు. దారిలో కొందరు పఠానులు తారసిల్లి ఆయనను కొట్టారు. "హే రామ్" అంటూ గాంధీ పడిపోయాడు. దారేపోయే తెల్లవాళ్లూ, ఆయన వెంటవున్న అనుచరులూ అడ్డుపడకపోతే పఠానులాయనని చంపేసేవారే.

రక్తంకారుతున్న గాంధీని దగ్గరలోవున్న షాపులోకి చేర్చారు. స్పృహతెలుస్తూనే గాంధీ తననుకొట్టిన పఠాను లేమయ్యారని అడిగాడు. వారిని పోలీసులు అరెస్టు చేసి పట్టుకుపోయారని తెలిసి, "వాళ్ళని విడిపించాలి," అన్నాడు. కాని అలా జరగలేదు.

అటుతరవాత కూడా గాంధీని చంపటానికి యత్నాలు జరిగాయి. డర్బానులో ఒక మీటింగులో గాంధీని బుర్ర పగలగొట్టటానికి మరో పఠానువాడు కర్రపట్టి వచ్చాడు. ఆకస్మికంగా లైట్లు ఆరిపోయాయి. ఒకప్పుడు గాంధీని యూరోపియనుల బారినుండి కాపాడిన పోలీసు అధికారి అలెగ్జాండరే ఈసారి ఆయనను భారతీయుల బారినుండి కాపాడవలసి వచ్చింది.

స్మట్స్‌తో చేసుకున్న ఒప్పందంకోసం గాంధీ తన ప్రాణాన్ని ఒడ్డాడు. కాని స్మట్స్ తన మాటను నిలబెట్టుకోలేదు.

*　　　*　　　*

భారతీయులు చేజేతులా "పక్కా పట్టీలు" తగిలించుకొన్నారు గాని వారి ఉద్యమం విఫలమయింది. ఒక పెద్దమంటచేసి, అందులో వారు తమ రిజిస్ట్రేషను కాగితాలు తగలబెట్టేశారు. వాళ్ళు మళ్ళీ జైళ్ళు నింపటానికి సిద్ధపడ్డారు. "ఎడ్వర్డు రాజు హోటలు"లోకి ప్రవేశం సంపాదించాలంటే అతి తేలికైన మార్గం ఉన్నది- లైసెన్సు లేకుండా వీధిలో అమ్మకాలు చేస్తూ తిరగటం. పెద్ద పెద్ద ధనికులు సైతం వంకాయలూ, బీరకాయలూ పట్టుకుని అమ్ముతూ అరెస్టయి, జైళ్ళలోకి ప్రవేశించారు.

అయితే ఈసారి జైలుశిక్షలు కఠినశిక్షలు. ఖైదీలు రాళ్ళు పగలగొట్టటమూ, చెరువులు తవ్వటమూ, వీధులూడవటమూ చెయ్యాలి. గాంధీకికూడా కఠినశిక్షేవేసి, మట్టి తవ్వించారు. ఆయన చేతులు బొబ్బలెక్కాయి. అయినా ఆయన విచారించలేదు, పైపెచ్చు మిగిలినవాళ్ళను ప్రోత్సాహపరిచేవాడు.

జైలు శిక్షలు పని చెయ్యలేదు. ఖైదీలను మేపటం ఖర్చుతో కూడినపని. అందుకని నేటాలు ప్రభుత్వం వారిని ఇండియాకు తోలెయ్యసాగింది. ఇంతకన్న ఘోరమైన శిక్ష ఉండదు. వారంతా కూలీలు; ఏనాడో దక్షిణాఫ్రికాకు వచ్చి, తమ చెమటా, కండలూ ధారపోసి తెల్లవాళ్ళ సంపదను పెంచారు. వారి పిల్లలు ఇండియా నెరుగరు. ఇండియాలో వారికి ఏమీలేదు. వాళ్ళ వేళ్ళు దక్షిణాఫ్రికాలో దిగబడ్డాయి.

గాంధీ యీ పరిస్థితిలో దేశభ్రష్టులకు చేయగల కొద్ది సహాయం చేశాడు. ఈలోపల సుప్రీం కోర్టు దేశబహిష్కరణ శిక్ష చట్టవిరుద్ధమని తీర్పు ఇచ్చింది. ఆ తరువాత అధికారులు భారతీయులను బాధించటానికి రకరకాల మార్గాలను అన్వేషించారు. తెల్లవర్తకులు ఒక్కసారిగా తమ బాకీలు వసూలు చేసి ధనిక భారతీయ వర్తకులను దివాలా ఎత్తించేశారు.

భారతీయులకూ ప్రభుత్వానికీమధ్య జరిగే సంఘర్షణ అనంతంగా సాగింది. అనేకమంది వర్తకులు ఆర్థికంగా దెబ్బతిని, రాజకీయాలనుంచి విరమించుకున్నారు. జైళ్ళకు వెళ్ళినవారి కుటుంబాల పరిరక్షణ ఒక సమస్య అయింది. గాంధీ తాను సంపాదించినదంతా ఉద్యమానికి ధారపోశాడు.

ఈ సమయంలో "టాల్‌స్టాయ్ సెటిల్మెంట్" అన్న 1100 ఎకరాల క్షేత్రం ఉద్భవించింది. కలెన్‌బాఖ్ అనే జర్మనువాడు గాంధీ ఉద్యమంలో చేరాడు. జొహాన్స్‌బర్గ్‌కు 21 మైళ్ళ దూరాన అతనికి యీ క్షేత్రం ఉన్నది. అందులో

సుమారు వెయ్యి ఫలవృక్షాలూ, ఒక ఇల్లూ ఉన్నది. కలెన్‌బాఖ్ అద్దె కోరకుండా యీ క్షేత్రాన్ని సత్యాగ్రహులకు ఇచ్చేశాడు. అందులో సుమారు 75 మందికి గాంధీ రేకుల ఇళ్లు ఏర్పాటు చేశాడు. ఇక్కడ చేరినవారిలో అన్ని మతాలవారూ ఉన్నారు. పిల్లలూ, పెద్దలూ అంతా పని చేసేవారు. కలెన్‌బాఖ్‌కు చెప్పులు కుట్టటం తెలుసును. ఆ విద్యను గాంధీదగ్గరనుంచీ పిల్లలదాకా అనేకమంది నేర్చుకున్నారు. వడ్రంగం నేర్చుకున్నారు. పిల్లలు ఉత్సాహంగా గోతులు తవ్వేవారు, చెట్లు పడగొట్టారు. గాంధీ వాళ్ళకు మేస్టరు.

"టాల్‌స్టాయ్ సెటిల్మెంట్" భారతీయులకు పేదగా బతకడమూ, క్రమశిక్షణా మప్పింది. ఇది సత్యాగ్రహోద్యమానికి చాలా మేలు చేసింది.

ఈ సత్యాగ్రహం నాలుగేళ్లు సాగింది. అయిదవ జార్జి పట్టాభిషేకం దగ్గర పడుతూండగా, 1911 ఫిబ్రవరిలో దక్షిణాఫ్రికా ప్రభుత్వం భారతీయులను రానివ్వటానికి "రంగు" అన్న అడ్డంకిస్థానే విద్యాప్రమాణం అడ్డు పెట్టింది. ప్రభుత్వం ఏర్పాటుచేసే కఠినపరీక్షలో నెగ్గితే ఆసియా వాసులుసైతం వలసరావచ్చు. భారతీయులూ, చీనావారూ తమ పూర్వవృత్తులు కొనసాగించటానికి మేనెల ఆఖరులో ప్రభుత్వం ఆమోదించింది. జూను 1 న సత్యాగ్రహులు విడుదల అయారు. ఈ రాజీ 1912 ఆఖరుదాకా అమలుజరిగింది.

1912 లో గోఖలే దక్షిణాఫ్రికాకువచ్చి పర్యటించటం ఒక ప్రముఖ సంఘటన. ఆయన ప్రభుత్వ అతిథిగావచ్చి మహారాజు పొందదగిన ఆతిథ్యం పొందాడు. ఆయన ప్రిటోరియాలో యూనియన్ మంత్రులతో మాట్లాడిన అనంతరం గాంధీతో, "మీరు ఒకసంవత్సరంలో ఇండియాకు వచ్చెయ్యాలి. ఇక్కడ అంతా సర్దుబాటయింది. నల్లవాళ్ళ చట్టం రద్దయిపోయింది. మూడుపౌనుల పన్ను ఎత్తివేస్తారు," అన్నాడు.

"నాకీ మంత్రుల సంగతి మీకన్న బాగాతెలుసు. నేను వాళ్ళమాట నమ్మను," అన్నాడు గాంధీ. గాంధీమాటే నిజమయింది. స్మట్స్ మాజీకూలీల కుటుంబాల మూడుపౌనుల పన్ను రద్దుచేయడంలేదని దక్షిణాఫ్రికా పార్లమెంటులో చెప్పేశాడు. ఇది చాలనట్టు క్రైస్తవమత వివాహాలూ, పెళ్ళిళ్ళ రిజిస్ట్రారు చేసినవీతప్ప మిగతా వివాహాలన్నీ చట్టవిరుద్ధమైనవేననీ సుప్రీంకోర్టు తీర్పుఇచ్చింది. ఆ తీర్పుప్రకారం హిందూ, ముస్లిం, పార్సీమత వివాహాలన్నీ చట్టవిరుద్ధమే!

గాంధీ మరొక బ్రహ్మాండమైన ఉద్యమం సాగించటానికి ప్రాతిపదిక ఏర్పడింది. ఈసారి ఉద్యమంలోకి స్త్రీలుకూడా ప్రవేశించారు. ఇదికూడా అహింసా సమరమే.

"మీ శాంతిసేనలో ఎందరున్నారు?" అని గోఖలే ఇండియానుంచి రాస్తే, "కనీసం పదహారుమంది ఉంటారు. ఏ పరిస్థితిలోనూ 66 కు మించరు," అని గాంధీ జవాబిచ్చాడు. ఇలాటి పథకం ఎలాపారుతుందో గోఖలేకు అర్థంకాలేదు. ఆ పథకం ఇలా ఆరంభమయింది. మొదటి విడత 16 మంది సత్యాగ్రహులు– కస్తూర్‌బాయ్‌తో సహా నేటాలు సరిహద్దుదాటి ట్రాన్స్‌వాల్‌లో పర్మిటులేకుండా ప్రవేశించి అరెస్టయారు. మరికొద్దిరోజుల అవతల ట్రాన్స్‌వాల్‌లోని "టాల్‌స్టాయ్ క్షేత్రం"లో ఉండే 11 మంది స్త్రీలు, పర్మిటులేకుండా నేటాలులో ప్రవేశించి, న్యూకాసిల్ గనులలో పని చేసే భారతీయులను సమ్మెకు ప్రేరేపించి, అరెస్టయారు.

ఈ సమ్మె ప్రమాదభరితమైనది. సమ్మెదార్లు దౌర్జన్యానికి దిగకుండా చూడటానికి గాంధీ న్యూకాసిల్‌కు వెళ్ళాడు. గనుల యజమానులు గాంధీని దర్బానుకు పిలిపించి, "సమ్మెవల్ల కార్మికులకు జరిగే నష్టానికి బాధ్యత నీదే," అని బెదిరించారు. ఆత్మ గౌరవాన్ని కోల్పోయిన కార్మికులకు అంతకన్న పెద్ద నష్టం ఏమి రాబోతుందన్నాడు గాంధీ వారితో. ఆయన న్యూకాసిల్‌కు తిరిగివచ్చి, కార్మికులు గట్టిగా నిలబడే ధోరణిలో ఉన్నట్టు తెలుసుకున్నాడు

కాని యజమానులు చూస్తూ ఊరుకోలేదు; కార్మికులకు నీరూ, కరెంటూ బంద చేశారు కార్మికులు తమ నివాసాలు వదిలిపెట్టవలసి వచ్చింది. వారిని ఏం చెయ్యాలో గాంధీకి పాలుబోలేదు. న్యూకాసిల్‌లోని భారతీయవర్తకులు కార్మికులకు సహాయపడ టానికి జంకారు. ఈ వందలాది కార్మికులను ట్రాన్స్‌వాల్‌లోకి తీసుకుపోతే ప్రభు త్వం వారిని అరెస్టుచేసి సమస్యను పరిష్కరిస్తుందని ఆయన అనుకున్నాడు. కాని ప్రభుత్వం కార్మికులను ఏమీ చెయ్యలేదు. 2037 మంది మగవాళ్ళు, 127 మంది స్త్రీలూ, 57 గురు పిల్లలూ, 1913 నవంబరు 6 న సరిహద్దుదాటి, జొహాన్స్‌బర్గును చేరవచ్చే సమయంలో గాంధీని అరెస్టుచేసి, విచారణజరిపి, 60 పౌనులు జరిమానా, లేక 9 మాసాల కఠిన శిక్ష విధించారు. గాంధీ జైలే కోరాడు.

గాంధీ అరెస్టయినా కార్మికులలో అరాజకం ఏర్పడకపోవటం చూసి అధికా రులు వారినికూడా అరెస్టుచేసి, నేటాల్ పంపటానికి మూడు రైళ్ళు సిద్ధం చేశారు. "గాంధీభాయి" ఉత్తరువులేనిదే రైళ్లు ఎక్కమన్నారు కార్మికులు. వారిని ఎలాగో ఎక్కించి, నేటాలుకు తీసుకుపోయి, జైలు శిక్షలు విధించి, వారు సమ్మె చేసిన గనులలోనే వారిచేత పనిచేయించారు.

ఈ దారుణాన్ని సహించలేక నేటాలులోని గని కార్మికులూ, తోటల కార్మికులూ



ప్రముఖమైన దండియాత్ర దృశ్యం. గాంధీజీ, శ్రీమతి సరోజినీనాయుడు మొ.

సమ్మెలుచేసి బయటికి వచ్చేశారు. తెల్లసుబేదారీ పోలీసులు వారిపట్ల చాలా అమానుషంగా ప్రవర్తించి, వారిని గనులలోకి తరిమారు.

అధికారులు గాంధీపట్లకూడా అమానుషంగానే ప్రవర్తించారు. ఆయనను ఒంటరిగా చీకటికొట్టులో బంధించారు; కోర్టులో ఆయనచేత సాక్ష్యం చెప్పించవలసి వస్తే చేతులకూ, కాళ్ళకూ బేడీలు తగిలించి తీసుకుపోయారు.

దక్షిణాఫ్రికా సంఘటనలు ఇండియాలో సంచలనం కలిగించాయి. గోఖలే దక్షిణాఫ్రికా భారతీయులకు సానుభూతి, సహాయమూ అర్థిస్తూ ఇండియా అంతటా పర్యటించాడు. ఇండియాలో వైస్రాయిగా ఉన్న లార్డ్ హార్డింజ్‌కూడా షాక్ అయిపోయి, దక్షిణాఫ్రికా ప్రభుత్వ చర్యలను గురించి నిష్పాక్షిక విచారణ జరగాలని రాశాడు. బ్రిటిషు కాబినెట్‌లో చర్చలు జరిగాయి. జనరల్ స్మట్స్ ఇండియాలోని వైస్రాయిని బర్తరఫ్ చేయమని బ్రిటిషు ప్రభుత్వానికి రాసి చూశాడు. అది సాధ్యం కాకపోయేసరికి ముగ్గురు మనుషులతో విచారణసంఘాన్ని ఏర్పాటు చేశాడు. అందులో ఇద్దరు భారతీయులకు పరమశత్రువులు; ఒక్కడైనా భారతీయుడు విచా

రణ సంఘంలో లేడు. ఈ కమిషనును గాంధీ బహిష్కరిస్తానన్నాడు. కాని వైస్రాయి తొందరపడవద్దన్నాడు.

చివరకు ఎలాగైతే నేం, గాంధీకీ, స్మట్స్‌కూ సంధి ఒనగూడింది. కూలీ కుటుంబాలపై విధించిన 3 పౌనుల పన్నూ, వివాహచట్ట నియమాలూ రద్దయాయి.

"మా నాన్నను గాంధీ బాగా బుట్టలోవేశాడు," అని స్మట్స్ కొడుకు అన్నాడు.

"అంతా గాంధీ ఇష్టానుసారమే జరిగింది. ఒక దుష్టశాసనాన్ని సమర్థించే దుష్కర్మ నన్ను వేధించింది." అన్నాడు స్మట్స్.

అంతా అయాక గాంధీ స్మట్స్‌కు ఒక జత చెప్పులు బహూకరించాడు; వాటిని ఆయన జైలులో ఉన్నప్పుడు తయారు చేశాడు.

గాంధీ నడిపిన సత్యాగ్రహంతో దక్షిణాఫ్రికాలోని భారతీయుల కష్టాలు గట్టెక్క లేదు. తెల్లవాళ్ళకూ, భారతీయులకూ మధ్య ఘర్షణ సాగుతూనే వచ్చింది. అయితే సత్యాగ్రహోద్యమాలు నడపటానికి గాంధీ అక్కడ ఉండిపోలేదు.

* * *

1914 లో గాంధీ దక్షిణాఫ్రికానుంచి వచ్చేశాడు. దక్షిణాఫ్రికా ఆయనకు చాలా మేలు చేసింది. రాజకీయాలలో సత్యాహింసలకు చోటున్నదని ఆయన రుజువు చేశాడు; రాజకీయోద్యమాలలో మతవివక్షతలు సమసిపోయి హిందూముస్లిములు ఏకం కావటం స్వయంగా చూశాడు; అన్నిటికన్న, రాజకీయవేత్తగా రాటుదేలాడు. ఈ అనుభవం ఆయనకు భారతీయ రాజకీయరంగంలో ఎంతగానో ఉపకరించింది.

జనవరి 9న గాంధీ బొంబాయి రేవులో దిగగానే ఆయనకు ఘనమైన స్వాగతం లభించింది. మూడు రోజుల అనంతరం జహంగీర్‌పటేల్ భవనంలో ఆయనకు ఏర్పాటైన సన్మానానికి బొంబాయిలోని ప్రముఖులందరూ వచ్చారు. వారందరిమధ్య గాంధీకి ఊపిరాడలేదు; దక్షిణాఫ్రికా కూలిజనం మధ్యనే తనకు ఇంతకన్న హాయి అనిపించిందని కుండపగలేసి అనేశాడు.

గోఖలేకు గాంధీమీద చాలా ఆశలున్నాయి. బొంబాయి గవర్నరును ఒకసారి కలవమని ఆయన గాంధీని కోరాడు. "ప్రభుత్వ వ్యవహారాలను గురించి ఏదన్నా చెయ్యదలచినప్పుడు ముందుగా నన్ను ఒకసారి చూడండి," అని గవర్నరు గాంధీని కోరాడు. గాంధీ సరే నన్నాడు. రాజీ పద్ధతులన్నీ విఫలమైనాకనే సత్యాగ్రహం కద!

ఒక్క సంవత్సరం పాటు భారత రాజకీయాలకు దూరంగా ఉండి పరిస్థితి గమ

నించమని గోఖలే గాంధీకి సలహా ఇచ్చాడు — ఈ లోపల గాంధీకి దేశపరిస్థితి అవగాహన అవుతుందని.

ఈ సంవత్సరం గడువు కాలంలోనే గాంధీ టాగూరుగారి శాంతినికేతన్‌కు వెళ్ళి అక్కడ ఒక వారం రోజులున్నాడు. అక్కడ ఆయనకు ఆండ్రూస్, పియర్సన్, కృపలానీ, కలేల్కార్ తగిలారు. ఈ వారం రోజులలోనే ఆయన అక్కడి అధ్యాపకులనూ, విద్యార్థులనూ ప్రేరేపించి, వెట్టిచాకిరీ అంతా వారే చేసే టట్టు చూశాడు. ఉపాధ్యాయులూ, విద్యార్థులూ కలిసి నేల తుడవటమూ, అంట్లు తోమటమూ చూసి టాగూరు నవ్వుకున్నాడు. (ఈ ఆశ్రమవాస చర్యలు 40 రోజుల అనంతరం ముగిశాయి.)

గాంధీకి ఆహారం గురించి చాలా చాదస్తాలుండేవి. నేతిలోనూ, నూనెలోనూ వేపిన పదార్థాలు విషంతో సమానం అని గాంధీ అంటే, టాగూరు, "అవి చాలా నింపాదిగా పనిచేసే విషం అయి ఉండాలి. నేను పుట్టిననాటినుంచీ పూరీలు తింటు న్నాను. ఇంతవరకు ఏ అపకారమూ జరగలేదు," అన్నాడు.

గాంధీ శాంతినికేతనంలో ఉండగానే గోఖలే చనిపోయినట్టు పూనానుంచి తంతి వచ్చింది. గోఖలే తనమీద ఆశలుపెట్టుకున్నట్టే గాంధీ గోఖలేపైన చాలా ఆశలు పెట్టుకున్నాడు. గోఖలే గౌరవార్థం గాంధీ ఒక ఏడాదిపాటు చెప్పులు తొడగకుండా తిరిగాడు.

గోఖలే పెట్టిన గడువులో మిగిలివున్న కాలాన్ని గాంధీ దేశాటనకు వినియోగిం చాడు. కలకత్తా వెళ్ళాడు. బర్మాకు వెళ్ళివచ్చాడు. హరిద్వారంలో కుంభమేళా జరుగు తుంటే అక్కడికి వెళ్ళి హిందూమతం పేర అక్కడ సాగే కుళ్ళు అంతా కళ్ళార చూశాడు.

అప్పటికింకా గాంధీ భారతీయ రాజకీయాలలో ప్రవేశించకపోయినా, దక్షిణాఫ్రి కాలో ఆయన చేసిన పనులు విని చాలామంది ఆయన "దర్శనం"కోసం ఎగబడ్డారు.

* * *

గాంధీ వెంట ఆయన బంధువులూ, అనుచరులూ వచ్చారు. వారికోసం గాంధీ ఒక ఆశ్రమం ఏర్పాటు చేయాలనుకుంటే గోఖలే అందుకు డబ్బిస్తానన్నాడు. కాని 1915 ఫిబ్రవరిలోనే గోఖలే పోయాడు. ఆశ్రమం ఎక్కడ స్థాపించాలి? రాజకోట, హరిద్వారం, కలకత్తాలనుంచి గాంధీకి ఆహ్వానాలు వచ్చాయి. కాని గాంధీ అహమ్మదా బాదును ఎన్నుకున్నాడు. అక్కడి పారిశ్రామికులు ధనసహాయం చేస్తామన్నారు. అదీ గాక చేతినూలు తియ్యటానికీ, చేతినేత నెయ్యటానికీ అది తగిన ప్రదేశం. చేసు

కునేటందుకు పనీ, తినటానికి తిండీలేని పేదప్రజలకు నూలు వడకటమూ, బట్టలు నేయటమూ ఉపయుక్తమైన వ్యాపకమని గాంధీ భావించాడు

"సత్యాగ్రహాశ్రమం" 25 మందితో ఆరంభమయింది. అందులో ఒక్క బంగళా ఉన్నది. అయితే ఆశ్రమానికి జనం వచ్చి చేరుతున్నారు. బంగళా చాలలేదు. సబర్మతీ నదీతీరాన చిట్టడవి కొట్టేసి 150 ఎకరాల విస్తీర్ణంగల ఆశ్రమం ఏర్పాటుచేసి అందులో కుటీరాలూ, బడీ, లైబ్రరీ, నేత సాపళ్ళూ, పశువుల కొట్టాలూ, పత్తి చెట్లూ, కూరలూ పెంచటానికి మడులూ ఏర్పాటుచేశారు. ఈ కార్యభారమంతా మోసినవాడు మగన్‌లాల్ గాంధీ.

కొద్దికాలంలోనే ఆశ్రమంలో చిక్కులు ఏర్పడ్డాయి. ఆశ్రమానికి ఒక అస్పృశ్య కుటుంబం – భార్యా, భర్తా, కూతురూ – వచ్చారు. దాంతో ఆశ్రమం లోపలా, వెలుపలా అలజడి బయలుదేరింది. అహమ్మదాబాదు పారిశ్రామికులు ఆశ్రమానికిచ్చే ధనసహాయం బిగించారు – కాని అదృష్టవశాన అంబాలాల్ సారాభాయి అనే అహమ్మదాబాదు కోటీశ్వరుడు ఆశ్రమానికి 13,000 రూపాయలు గుప్తదానం చేశాడు.

దక్షిణాఫ్రికాలో అందరితోనూ కలిసితిరిగిన కస్తూర్బాయి అస్పృశ్యుల స్పర్శను సహించలేకపోయింది. గాంధీ ఆమెను కావలిస్తే ఆశ్రమం విడిచివెళ్ళమన్నాడు. దానితో ఆమె బుద్ధి మారిపోయింది.

ఆశ్రమవాసులు సత్యానికీ, అహింసకూ, బ్రహ్మచర్యానికీ కట్టుబడి ఉంటామని ప్రమాణం చెయ్యాలి. అస్పృశ్యతా నివారణకు పాటుపడాలి. శరీర శ్రమ చేస్తూ, నిర్భయులై జీవించాలి. ఇవే ఆశ్రమ నియమాలు.

ఆశ్రమంలో ఒక దొంగతనం జరిగింది. కస్తూర్బాయి పెట్టెను ఎవరో ఎత్తుకుపోయారు. అందులో ఆమె మనమల బట్టలున్నాయట! కస్తూర్బాయికి ఒక పెట్టె ఉన్నట్టుకూడా గాంధీ ఎరగడు. ఆశ్రమంలో దొంగిలించదగిన వస్తువులుంటాయని ఎవరన్నా అనుకోవటమే ఆయనకు ఆశ్చర్యం కలిగించింది.

సబర్మతీ ఆశ్రమాన్ని గాంధీ ఒక ప్రయోగశాలగానూ, భావి సత్యాగ్రహులు ఆత్మనిగ్రహం నేర్చుకోవటానికి శిక్షణ కేంద్రంగానూ తయారుచేశాడు.

* * *

గాంధీ భారతీయ రాజకీయ రంగంలో ప్రవేశించేనాటికి భారత జాతీయోద్యమం చాలా దూరం నడిచింది. గాంధీ 16 ఏళ్ళవాడై ఉండగానే నేషనల్ కాంగ్రెసు వ్యవస్థాపన జరిగింది. ఆలన్ ఆక్టేవియన్ హ్యూమ్ అనే మాజీ ప్రభుత్వ కార్యదర్శి – బ్రిటిషువాడు – ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య వారధిగా ఈ సంస్థను ఏర్పాటుచేశాడు.



దక్షిణాఫ్రికానుంచి తిరిగివచ్చిన గాంధీ దంపతులు

ఇది అప్పట్లో ప్రభుత్వ వ్యతిరేక సంస్థ ఏమాత్రమూ కాదు; కాకపోతే బ్రిటిషువారు ఇండియాను పాశ్చాత్య ఆధునిక పద్ధతులలో పరిపాలించ గలందులకు సహాయపడే సంస్థగా పనిచేయ యత్నించింది. కాని బ్రిటిషుపాలకులు ఈ కృషిని ఆదరంతో చూడక కాంగ్రెసుపట్ల అనుమానంతో ప్రవర్తించారు. దీనికి తగ్గట్టే ఈ సంస్థలో అతివాదులకూ, మితవాదులకూ ఘర్షణలు ప్రారంభమయ్యాయి. 1905 లో బెంగాలు విభజన తరవాత టెర్రరిస్టు ఉద్యమాలు బయలుదేరాయి. తిలక్, అరవిందుడు మొదలైన తీవ్రవాదులు ప్రజానాయకులయారు. ప్రభుత్వం మితవాదులను తనపక్షం చేసుకోవటానికి వారికి "కాకబలులు" చల్లింది; అంతటితో వదలక భారతీయులైన హిందూ, ముస్లిముల మధ్య విభేదాలు తెచ్చిపెట్టింది.

1915 లో గాంధీ ఇండియాకు వచ్చేనాటికి జాతీయోద్యమం కొడిగట్టి ఉన్నది. యుద్ధకాలం అన్నది అడ్డంపెట్టుకుని ప్రభుత్వం "డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్" ద్వారా నిరంకుశాధికారం చేపట్టింది. కాంగ్రెసులో గోఖలే, ఫిరోజ్‌షా మెహతా లాంటి మితవాదనాయకులది పైచెయ్యి. కాంగ్రెసులోని అతివాద నాయకుడు తిలక్ అప్పుడే జైలునుంచి బయటికి వచ్చి, రికామీగా ఉన్నాడు. పంజాబు సింహం లాలా లజ్పత్‌రాయ్ దేశాంతరంలో ఉన్నాడు. అరవిందుడు రాజకీయాలనుంచి విర మించుకున్నాడు. అబుల్ కలామ్ ఆజాద్, అలీ సోదరులూ జైలుకు పోవటానికి సిద్ధంగాఉన్నారు.

ఈ స్థితిలో శ్రీమతి ఆనీ బిసెంట్ రాజకీయరంగంలోకి దూకింది. ఈమె ఐరిష్ జాతి స్త్రీ అయినా, పదహారణాల భారత స్త్రీగా మారిపోయి, భారతీయ సంస్కృతిలో మునిగి తేలింది. ప్రపంచయుద్ధం ఆరంభం కాకపూర్వమే ఈమె లండనులో ఉపన్యసిస్తూ భారతీయుల అండ కావాలంటే భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలని ఉద్ఘాటించింది. 1915 డిసెంబరులో జరిగిన కాంగ్రెసు సమావేశంలో తాను హోమ్ రూల్ ఉద్యమం ప్రారంభిస్తానని ఈమె హెచ్చరించగా మితవాదులు తీవ్రంగా వ్యతిరేకించారు. అయినా ఆమె లక్ష్యపెట్టక, 1916 సెప్టెంబరులో "హోమ్‌రూల్ లీగ్" స్థాపించింది. ఆమె తన ఉద్యమాన్ని బలపరచమని గాంధీని కోరింది. కాని గాంధీ అలా చెయ్యలేదు. యుద్ధకాలంలో బ్రిటిషువారిని తొందరపెట్టటానికి ఆయన జంకాడు. అదీకాక, యుద్ధానంతరం రాజకీయ సంస్కరణలు అమలులోకి వస్తాయని ఆయన నమ్మాడు. ఆమె నవ్వి, "యుద్ధపు తొందరలో బ్రిటిషువారిని ఒత్తిడి చేస్తేనే తప్ప ఇండియాకు స్వాతంత్ర్యం రాదు," అన్నది.



సేవాగ్రామ్ (వార్ధా) లోని గాంధీ ఆశ్రమం

"మిసెస్ బిసెంట్, మీకు బ్రిటిషువారిలో విశ్వాసంలేదు, నాకున్నది," అన్నాడు గాంధీ.

ఈనాడు మనకు హోమ్‌రూల్‌లీగ్ లక్ష్యం ఏమంత విప్లవయుతంగా తోచదు – బ్రిటిషు సామ్రాజ్యంలోనే ఉంటూ చట్టసమ్మతమైన స్వపరిపాలన దానిలక్ష్యం. కాని ఈ లీగ్ ఏర్పడటం ఆనాడు గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఆమె ప్రచారంలో చాలా ఘటికురాలు. దేశంలోని విద్యావంతులు ఆమె ప్రచారానికి ఉత్తేజితులయారు. ఆమె తన "న్యూ ఇండియా" పత్రికలో కొరడా చెణుకులు విసిరింది. "ఇండియాకు మీ వరాలతోనూ, రాయితీలతోనూ, దయాధర్మ బిచ్చాలతోనూ పని లేదు... తనయింట తనకు అధికారం కావాలి... రష్యాలో నిరంకుశత్వం రూపుమాసింది; జర్మనీలో పతనావస్థలో ఉన్నది; ఒక్క బ్రిటిషుబావుటా కిందనే అది స్వైరవిహారం చేస్తున్నది."

తిలక్, బిసెంటులు తమ అధికారానికి ఎసరు తెస్తున్నారనీ, వాళ్లు ప్రజలలో తెచ్చే చైతన్యాన్ని మితవాదులు ఆపేస్థితిలో లేరనీ అధికారులు భయపడ్డారు. వారికి ఏర్పడిన పెద్ద చిక్కేమిటంటే, ఇండియాకు స్వపరిపాలన ఇస్తామని వారు అన్నారు. వాళ్లిస్తామన్న స్వపరిపాలనకూ, బిసెంట్ అడిగే హోమ్‌రూలుకూ తేడా సూచించకుండా, ఆమెపై ఎట్టిచర్యా తీసుకోవటానికి లేదు.

1917 ఆగస్టులో ఒక ప్రకటన జరిగింది : పరిపాలనలో భారతీయులకు క్రమంగా హెచ్చుబాధ్యతలు కల్పించుతూ, బ్రిటిషు సామ్రాజ్యాంతర్భాగంగాఉండే భారత దేశంలో కాలక్రమాన బాధ్యతాయుత పరిపాలన ఏర్పడేలాగు చూడగలం."

ఆ సంవత్సరమే అనీ బిసెంటును ఊటీలో నిర్బంధంలో ఉంచారు. ఆమెను విడుదల చేయించేటందుకు ఏదన్నా మార్గం చూడమని కొందరు అడిగితే, నూరు మంది వాలంటీర్లు బొంబాయినుంచి ఊటీకి పాదయాత్ర చెయ్యాలని గాంధీ సూచించాడు. అది దక్షిణాఫ్రికాలో ఆయన చేసినపనే, కాని భారతీయ రాజకీయవేత్తలకది "ఉన్మాదం"లాగా తోచింది :

*　　　*　　　*

గాంధీకి అనుకోని చోటునుంచి పిలుపు వచ్చింది.

బీహారులోని చంపారణ్ జిల్లాలో కొందరు తెల్లవాళ్ళు ఫాక్టరీలుపెట్టి నీలిమందు తయారుచేసేవారు. ఈ ఫాక్టరీ యజమానులు రైతులను అమానుషంగా దోపిడీ చేస్తూ వచ్చారు. రాష్ట్రప్రభుత్వం వారిపక్షం.

రాజకుమార్ శుక్లా అనేవాడు గాంధీమెడలువిరిచి చంపారణ్ తీసుకుపోయాడు. తీరా అక్కడికివెళ్ళి రైతులతో మాట్లాడినాక అక్కడి అక్రమాలు ఆయనకు తెలిసి వచ్చాయి. చంపారణ్ జిల్లా అధికారులు గాంధీని "తిరుగుబండి"లో వెళ్ళిపొమ్మని నోటీసిచ్చారు. గాంధీ వెళ్ళనన్నాడు. డివిజను కమిషనరు తన పై అధికారులకు తెలియకుండా గాంధీని అరెస్టుచేశాడు. బీహారు ప్రభుత్వం ఈ పొరపాటును సరి చేస్తూ ఇండియా ప్రభుత్వానికి సంజాయిషీ చెప్పుకున్నది. స్వేచ్ఛగా విచారణ సాగించటానికి గాంధీకి అనుమతి లభించింది.

కాని విచారణ సాగితే ఫాక్టరీ యజమానుల పాపాలు బట్టబయలు అయి తీరుతాయి. గాంధీ అక్కడ సత్యాగ్రహం సాగిస్తాడని ఇండియా ప్రభుత్వం భయపడి, విచారణ సంఘాన్ని నియమించమనీ, అందులో గాంధీనికూడా చేర్చమనీ, దానితో గాంధీఆట కొంత కట్టవచ్చుననీ బీహారు గవర్నరుకు సలహా ఇచ్చింది. కాని అప్పటికే గాంధీ 8,000 మంది రైతుల సాక్ష్యం సేకరించి, వారి సమస్యలన్నిటినీ కూలంకషంగా చర్చించగల స్థితిలో ఉన్నాడు. అక్రమ వసూళ్ళన్నీ రుజువయాయి. ఈ వసూళ్ళలో నాలుగోవంతు మాత్రమే రైతులకు తిరిగి ఇప్పించటానికి గాంధీ సమ్మతించాడు. ఇది తెల్లవాళ్ళకు తృప్తికరంగానే తోచింది, కాని గాంధీ తమ ఖ్యాతి మట్టిపాలు చేశాడని గ్రహించి, పదేళ్ళలోపుగా వాళ్ళు జిల్లావదిలి వెళ్ళిపోయా

చంపారణ్ రైతుల మూలసమస్య అజ్ఞానమని గాంధీ గ్రహించాడు. వారికి చదువుసంధ్యలు నేర్పాలి. అందుకుగాను గాంధీకి కస్తూరిబాయీ, కొడుకు దేవదాసూ, మహాదేవదేశాయీ, నరహరి పరీఖ్, కృపలానీ తోడ్పడ్డారు. ఈ ఉద్యమం గాంధీ ఉన్నంతకాలమే సాగింది. దాన్ని స్థానికులు కొనసాగించలేదు.

ఈ సమయంలోనే అహమ్మదాబాదు బొంతమిల్లుల యజమానులకూ, కార్మికులకూ మధ్య సంఘర్షణ వచ్చింది. 1917 ఆగస్టులో అహమ్మదాబాద్‌లో ప్లేగు వచ్చినందు వల్ల కార్మికులు పరారీ కాకుండా వారికి "ప్లేగు బోనస్" అనేపేరుతో వారి వేతనాలలో 80 శాతం అదనంగా ఇచ్చారు. ప్లేగుపోయింది. ప్లేగుబోనస్‌కూడా పోయింది. జీవనవ్యయం యుద్ధంమూలాన చాలా పెరిగిందనీ, బోనస్ ఉండాలనీ కార్మికులు పట్టుబట్టారు. పరిస్థితి విషమిస్తుందని భయపడి అహమ్మదాబాదు కలెక్టరు గాంధీని ఉభయపక్షాలమధ్య రాజీ కుదర్చమన్నాడు.

పారిశ్రామికుల పెద్ద అంబాలాల్ సారాభాయి — సబర్మతీ ఆశ్రమానికి 13,000 గుప్తదానం చేసినవాడు. గాంధీ ఉభయపక్షాలనూ రాజీసంప్రతింపులకు ఒప్పించాడు. సంప్రతింపులలో కార్మికులు తమ వేతనాలు 50 శాతం పెంచాలన్నారు. యజమానులు 20 శాతం పైన ఇవ్వమన్నారు. గాంధీ కార్మికులను 35 శాతానికి ఒప్పించాడు. కాని యజమానులు అందుకు ఒప్పుకోలేదు; 20 శాతం పెరుగుదలకు ఒప్పుకోని వాళ్ళను పనినుంచి తొలగిస్తామన్నారు.

గాంధీ కార్మికులకు నాయకత్వం వహించవలసి వచ్చింది. ఈ సంఘర్షణలోకి ఆయన సత్యాగ్రహ సూత్రాలను ప్రవేశపెట్టాడు. కార్మికులు "సత్యాగ్రహ" సమ్మె చేశారు. ఈ సమ్మెలో ఆయనకు సాయపడినది అంబాలాల్ సారాభాయి సోదరి అనసూయాబెన్. ఆమె కార్మికులకు సానుభూతి చూపుతూ, వ్యాధిగ్రస్థులకు ఉపచారాలుచేస్తూ, కొందరికి ఇతరపనులుకూడా చూపింది. ప్రతిరోజూ అపరాహ్ణం కార్మికులు ఒక చెట్టుకింద గాంధీని కలిసేవారు.

కొద్దిరోజులు గడిచాక గాంధీ కార్మికుల స్థితి దిగజారిపోతున్నట్టు గ్రహించాడు. ఒకనాడు ఒక కార్మికుడు, "గాంధీదీ, అనసూయాబెన్‌దీ ఏం పోయింది? కడుపు నిండా తింటారు, కార్లలో తిరుగుతారు," అనటం గాంధీ చెవినపడింది. తరవాత చెట్టుకింద సమావేశాలకు హాజరయేవారిసంఖ్య తగ్గుతూ వచ్చింది.

ఆస్థితిలో గాంధీ నిరశనవ్రతం అవలంబించాడు. కార్మికుల నిగ్రహాన్ని పెంపొం

దించటానికి ఆరంభించిన ఈ నిరశనం ఓ్లుయజమాలపై ఒత్తిడి తెస్తున్నదని గ్రహించి గాంధీ, మూడురోజుల అనంతరం రాజీపడ్డాడు. కార్మికులు పనిలోకివెళ్లారు.

* * *

1918 లో యుద్ధం జర్మనులకే అనుకూలంగా నడుస్తున్నట్టు కనబడింది. ఢిల్లీలో యుద్ధసమావేశం ఏర్పాటుచేసి వైస్రాయి ప్రముఖ భారతీయులను ఆహ్వానించాడు (తిలక్, జిన్నా ప్రభృతులు కొందరిని పిలవలేదు) దీనికివెళ్ళిన గాంధీ బ్రిటిషువారికి సైనికులను చేర్చటానికి ఒప్పుకుని, అందుకోసం గుజరాతు అంతటా తిరిగాడు. ఆయనవెంట వల్లభాయిపటేలు కూడా తిరిగాడు. జనం వారితో మాట్లాడనైనాలేదు వాళ్ళు ఊరిపొలిమేరలో వంట చేసుకోవలసి వచ్చింది.

అహింసావాది అయివుండి గాంధీ సైనికసేకరణకు బయలుదేరటం చిత్రం. ఒక సభలో ఆయన, "బ్రిటిషువారి పరిపాలనలో జరిగిన అక్రమాలన్నిటిలోనూ దారుణమైనది భారతీయులను నిరాయుధులను చెయ్యటం," అన్నాడు ఈ తిరుగుడులో ఆయనకు గ్రహణివ్యాధి పట్టుకున్నది. లంఖణాలతో అది నయంకాలేదు. గాంధీ తన ఆయువు మూడిందనుకుని గీతలోనుంచి శ్లోకాలుచదివాడు; తన జీవితాన్ని సమీక్షించుకుంటూ, ప్రారంభించినదేదీ పూర్తిచేయకుండానే పోతున్నానని అన్నాడు; అహింసద్వారానే భారతదేశానికి ముక్తి అని తన తుదిసందేశంకూడా చెప్పాడు.

కాని ఒక "మంచు డాక్టరు" వచ్చి ఆయనకు చికిత్సచేసి, వ్యాధిని తిరుగుముఖం పట్టించాడు. గాంధీలో తిరిగి జీవితేచ్ఛ తలఎత్తింది. రౌలట్‌కమిటీ రిపోర్టూ, రౌలట్‌బిల్లులూ ఆ జీవితేచ్ఛను బాగా రెచ్చగొట్టాయి. "నా ఒంట్లో బాగున్నట్టయితే దేశమంతా తిరిగిజనాన్ని రెచ్చగొట్టిఉందును," అన్నాడాయన. ఈ బిల్లులు భారతీయులకున్న పౌరస్వాతంత్ర్యాలకు గొడ్డలిపెట్టు. వీటి ఆధారంతో అనుమానితులను అరెస్టు చెయ్యవచ్చు, అనుమానంగా ఉండేవారినుంచి ధరావతు తీసుకోవచ్చు. రాజద్రోహులను శిక్షిస్తే అప్పీలుండదు. ఇంకొకటి ఏమిటంటే, లోగడనే ఇలాటి దుష్టచట్టాలు అమలులో ఉన్నాయి. "నాగరిక ప్రభుత్వం ఏదీ ఇలాటి చట్టంచెయ్యదు," అన్నాడు జిన్నా.

జిన్నాయేకాదు, దేశంలోని అన్ని రాజకీయ వర్గాలవారూ ఏకకంఠంగా ఈ రౌలట్ చట్టాలను ఖండించారు. అయినా ప్రభుత్వం ఈ చట్టాలను పాసుచేసింది. పరిపాలనలో గొప్పగొప్ప సంస్కరణలు పెట్టనున్న ప్రభుత్వం ఇలాటి శాసనాలను

తయారుచెయ్యదని గాంధీ భావించాడు. ఈ రౌలట్ శాసనాలకు విరుద్ధంగా సత్యాగ్రహం జరగాలని ఆయన నిశ్చయించాడు.

ఇందుకుగాను సత్యాగ్రహసభ ఏర్పాటయింది. గాంధీ దేశపర్యటన చేశాడు. ఏప్రిలు 6 న దేశమంతటా హర్తాలు జరపాలని నిర్ణయం జరిగింది. ఢిల్లీలో మార్చి 30 నే హర్తాలు జరిగింది. ఆసందర్భంలో కొంత దొమ్మీకూడా జరిగింది. పంజాబు వాళ్ళు గాంధీని ఆహ్వానించారు, కాని ప్రభుత్వం గాంధీని మధ్యదారిలో మరొక రైలు ఎక్కించి, బొంబాయిలో వదిలింది. బొంబాయి, అహమ్మదాబాదు మొదలైన చోట్ల ప్రజలు అహింసను పాటించలేదు. గాంధీ మూడురోజులు ఉపవాసంచేసి ప్రాయశ్చిత్తం చేసుకుని, సత్యాగ్రహాన్ని ఉపసంహరించాడు.

పంజాబులో మాత్రం దురంతాలు జరిగిపోయాయి. ఏప్రిలు 10 న అమృతసర్ పౌరులు, తమ నాయకులిద్దరు అరెస్టయినందుకు రెచ్చిపోయి, దౌర్జన్యచర్యలకుదిగి, టౌనుహాలూ, పోస్టాఫీసూ తగలబెట్టి, టెలిగ్రాఫుతీగెలు తెంచి, కొందరు తెల్ల వాళ్ళను కొట్టారు. బ్రిగేడియర్ జనరల్ డయర్ అనేవాడు సిపాయిలతోవచ్చి, నగరంలో శాంతినెలకొల్పాడు. రెండురోజుల అనంతరం ఏప్రిలు 13 న వైశాఖోత్సవానికి జలియన్‌వాలా బాగ్‌లో జనం గుమిగూడారు. ఆ మీటింగు చెదరగొట్టటానికి డయర్ సిపాయిలను తీసుకుపోయి, స్త్రీలూ, పిల్లలూగల ఆ గుంపుమీద కాల్పులు చేసి, 400 మందిని చంపి, 1200 మందిని గాయపరిచాడు! పంజాబులో మార్షల్‌లా వెలిసింది.

బ్రిటిషు సామ్రాజ్య విచ్ఛిత్తికి అదే నాందీవాక్యం.

సత్యాగ్రహం ఉపసంహరించినాక గాంధీ పంజాబువెళ్లాలని చూశాడుగాని, ఆరు నెలలదాకా ఆయనకు అనుమతి లభించలేదు. అప్పటికిగానిపంజాబులో జరిగిన అత్యాచారాలనుగురించి ఆయనకు నిజం తెలియలేదు. అప్పటికీ ఈ అత్యాచారాలకు కొద్దిమంది అధికారులు బాధ్యులై ఉంటారనీ, నిజం తెలిశాక ప్రభుత్వం తగుచర్యలు తీసుకుంటుందనీ ఆయన నమ్మాడు. కాని అలాటిదేమీ జరగలేదు. పంజాబులో దురంతాలు జరిపిన అధికార్లు బదిలీ కాకపోగా, తెల్లవాళ్ళ దృష్టిలో హీరోలయారు.

జనరల్ డయర్‌ను సైనికపదవినుంచి తొలగించినమాట నిజమేగాని, ''మార్నింగ్ పోస్ట్'' పత్రిక ఇచ్చిన పిలుపుతో బ్రిటిషువారు చందాలు వేసుకుని, అతనికి 30,000 పౌనులు ఇచ్చారు!

అంతదాకా సంస్కరించితే చాలుననుకుంటున్న ప్రభుత్వ విధానాన్ని అంత మొందించి తీరాలన్న నిర్ణయానికి గాంధీ వచ్చాడు.

* * *

గాంధీకి బ్రిటిషువారిపై ఉండిన విశ్వాసం పూర్తిగాపోయినది ఖిలాఫత్ ఉద్యమం సందర్భంలో.

ఖిలాఫత్ అన్నది అంతర్జాతీయ ముస్లింసంస్థ. అంతర్జాతీయ ముస్లిములకు ఖలీఫా టర్కీ సుల్తాను అతను యుద్ధంలో జర్మనీపక్షమయాడు. ఆయనగతి ఏమవుతుందోనని భారతీయ ముస్లిములు ఆందోళన చెందారు. టర్కీకి ఎలాటి అన్యాయమూ జరగబోదని బ్రిటిషుప్రధాని భరోసా ఇచ్చాడు. కాని యుద్ధం పూర్తి అయినాక బ్రిటిషువారు టర్కీ సుల్తానును ఖలీఫా పదవినుంచి తొలగించ టమేగాక, టర్కీ సామ్రాజ్యంనుంచి అరబ్ ప్రాంతాలను వేరుచేయ సంకల్పించారు.

దానితో భారతీయ ముస్లిములు ఖిలాఫత్ ఉద్యమం ప్రారంభించారు. గాంధీ వారితో చేరి సహాయనిరాకరణోద్యమం సాగించమని సలహా ఇచ్చాడు. టర్కీపట్ల బ్రిటిషువైఖరి మారకపోతే ముస్లిములచేత సహాయ నిరాకరణోద్యమం ప్రారంభింప జేసి, అందులో హిందువులుకూడా పాల్గొనేలాగా చేస్తానని గాంధీ వైస్రాయికి 1920 జూన్‌లో తెలిపాడు సహాయ నిరాకరణోద్యమాన్ని కాంగ్రెసుకూడా బలపరిచింది. అలీ సోదరులను వెంటవేసుకుని గాంధీ దేశమంతాతిరిగి ఉపన్యాసాలిచ్చాడు ఒక్క మగపురుగులేని ముస్లిముస్త్రీల సమావేశాలలో మాట్లాడేటందుకు గాంధీకి అనుమతి లభించింది. హిందూ ముస్లిము సఖ్యత పరాకాష్ఠ అందుకున్నట్లు కనబడింది

* * *

గాంధీ తలపెట్టిన సహాయ నిరాకరణోద్యమంకూడా సత్యాగ్రహ సమరమే. అది యుద్ధమేగాని, అందులో హింసకు తావులేదు. సహాయ నిరాకరణోద్యమంలో ప్రధా నాంశాలు – విద్యార్థులు తమ పాఠశాలలను విసర్జించి జాతీయ పాఠశాలలలో చదువు కోవటమూ, ఉన్నవారూ లేనివారూ రాట్నాలమీద నూలుతీసి, దానితో నేసినబట్టలు– ఖాదీ– ధరించటమూ, ప్రభుత్వకార్యాలయాలను వాటిలో పనిచేసేవారు వదిలి రావ టమూ, బ్రిటిషువారు ఏర్పాటుచేసిన కోర్టులుప గైరాలను నిషేధించటమూ, విదేశీ వస్తు బహిష్కరణా.

"ఇంగ్లీషువారు భారతదేశాన్ని తీసుకోలేదు. భారతీయులే తమ అనైక్యతవల్ల భారతదేశాన్ని బ్రిటిషువారికి అర్పించుకున్నారు,'' అని గాంధీ వాదం అనైక్యతతో

పోగొట్టుకున్న దేశాన్ని ఐక్యతతో సాధించవచ్చు. సహాయ నిరాకరణోద్యమం భారతీయులను ఏకం చేస్తుంది గాని బ్రిటిషువారిని హింసపెట్టదు.

ఈ ఉద్యమం ప్రభుత్వంలోని అధికారులకేగాక జాతీయ నాయకులకు కూడా "దారుణంగా" కనిపించింది. "నా పిలుపుకు దేశం సరిగా జవాబిస్తే ఏడాదిలో స్వరాజ్యం వస్తుంది," అని గాంధీ అన్నప్పుడు, "కుప్రతర్కం", అన్నాడు సుభాష్ బోసు.

"స్వాతంత్ర్యం పుట్టుకలాంటిది... ఒక్క క్షణంలో జరుగుతుంది...అస్పృశ్యత లాంటి పాపాన్ని కడిగేసుకుని, తాగుడు పీడనుంచి విముక్తమై, తీరిక కాలాన్ని 60 కోట్ల రూపాయల విలువ గల వస్త్రాన్ని ఉత్పత్తి చేసుకోగల జాతి ... బ్రిటిషువారితో సమగౌరవం పొందగలదు. స్వరాజ్యం బ్రిటిషువారి కానుకగా వచ్చేదికాదు," అన్నాడు గాంధీ.



అహింసాయుత సహాయ నిరాకరణోద్యమాన్ని ఖిలాఫత్ కమిటీ ముందే ఆమోదించింది. కాంగ్రెసుకూడా ఆమోదించవలసి ఉన్నది. ఇందుకుగాను 1920 సెప్టెంబరులో కలకత్తాలో, లాలా లజ్పత్ రాయ్ అధ్యక్షతన ప్రత్యేక కాంగ్రెసు సమావేశం జరిగింది. "స్వరాజ్యం వచ్చేదాకా భారత ప్రజలు క్రమబద్ధంగా అహింసా యుత సహాయ నిరాకరణం సాగించాలి" అన్న తీర్మానం జరిగింది.

"స్వరాజ్యం'' అన్న మాట కాంగ్రెసు సంస్థయొక్క నిబంధనావళిలో చేర్చుతూ, కాంగ్రెసు స్వభావంలో గాంధీ మార్పు తెచ్చాడు. ఆ సంస్థ ప్రజలకు సన్నిహితంగా ఉండి పనిచేయగలందులకు అనుకూలంగా నిబంధనలు మారాయి. గ్రామాలలోనూ, యూనియనులలోనూ, జిల్లాలలోనూ, రాష్ట్రాలలోనూ కాంగ్రెసు కమిటీలూ, పావలా కాంగ్రెసు సభ్యత్వమూ ఏర్పాటయాయి. అన్ని కమిటీలకూ తల అఖిలభారత కాంగ్రెసు కమిటీ. కాంగ్రెసు తరఫున కార్యాచరణ చెయ్యటానికి కాంగ్రెసు అధ్య క్షుడితో కూడిన వర్కింగుకమిటీ కూడా ఏర్పాటయింది. ఈ వ్యవస్థాపనద్వారా దేశంలోని ప్రతి గ్రామంలోనూ రాజకీయ చైతన్యం ఏర్పడింది. కాంగ్రెసుకు గాంధీ మహానాయకుడయాడు.

గాంధీకి పూర్వం బ్రిటిషువారి పద్ధతులు మార్చటానికి ఒక కార్యక్రమం లేదు. కాంగ్రెసు తీర్మానాలు చేసేది. అవి బుట్టదాఖలయేవి. కొద్దిమంది తీవ్రవాదులు అడపా, దడపా హింసాచర్యలు చేసేవారు. బలయుతమైన ప్రభుత్వం దమన విధా నాలను అవలంబించేది. ఆ పరిస్థితిలో కాంగ్రెసుకు గాంధీ ఒక కార్యక్రమాన్ని అందించి, దానితో ప్రభుత్వాన్ని ప్రతిఘటించవచ్చునని చూపాడు.

1920 ఆగస్టు 1న తిలక్ చనిపోయాడు. ఇంకో పక్షానికి చనిపోతాడనగా ఆయన గాంధీతో, "నాకు సత్యాగ్రహంలో నమ్మకం లేకపోలేదు. ప్రజలు దాన్ని అవలం బిస్తారా అన్నదే నా సందేహం," అన్నాడు. సత్యాగ్రహోద్యమాన్ని తీవ్రంగా విమర్శించిన లజపతిరాయి, చిత్తరంజన్‌దాసులు గాంధీకి చెరొక భుజంగా తయా రయ్యారు. ఇక ప్రజలమాట చెప్పనవసరం లేదు. గాంధీ సందేశంతో ప్రజలలో ఎంతటి చైతన్యం కలిగిందంటే నాయకులు వారి వెనక దౌడుతీయవలసి వచ్చింది. గాంధీ కాస్తా మహాత్మాగాంధి అయాడు. ఆయన నిరాడంబరుడు, పరిత్యాగి, పురాణ కాలపు ఋషి — చాలామంది దృష్టిలో అవతార పురుషుడు. ఆయన దర్శనంతోనే తృప్తిపడ్డవాళ్లు దేశంలో అసంఖ్యాకులుగా ఉండేవాళ్లు.

బీహారులో ఒక 104 ఏళ్ళ ముసలిది, గాంధీ వస్తున్నాడని విని ఒకరోజల్లా తిండీ తిప్పలూ లేకుండా నిలబడి, ఎవరికోసం ఎదురుచూస్తున్నావని ఎవరో అడిగితే, "నాయనా, గాంధీ ఏడీ?" అని ఎదురు అడిగింది.

కారుటైరు పగిలినందువల్ల అక్కడ ఆగిన గాంధీ, "ఎందు కతన్ని చూడగోరు తున్నావు?'' అని అడిగాడు.

"ఆయన అవతారం,'' అన్నది ముసలిది.

కాని మహాత్ముడు కావటం గాంధీకి ఒక్కొక్కసారి జబ్బుచేసేది. "మహాత్ముల పాట్లు మహాత్ములకే ఎరుక," అన్నా డాయన.

జాతీయపోరాటంలో గొప్ప నాయకులైన వారందరూ ఆయన నిస్వార్థాన్నీ, నిజాయితీనీ, ధైర్యాన్నీ చూసి ఆకర్షితులైనవారే. ఆయన ప్రభావంవల్ల మోతీలాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్, సి. ఆర్. దాస్, వల్లభ్బాయిపటేలు, రాజగోపాలాచారి లాంటి సంపాదనపరులు తమ సంపాదనలకు స్వస్తిచెప్పారు. జవాహర్‌లాల్ తన భార్యాబిడ్డలనే మరిచిపోయాడు

*　　　　*　　　　*

సహాయ నిరాకరణోద్యమమూ, శాసనోల్లంఘనమూ విజయవంతమవుతాయని ప్రభుత్వం అనుకోలేదు. ఖిలాఫత్ నాయకులకూ, కాంగ్రెసునాయకులకూ మధ్య విభేదాలేర్పడతాయనీ, కాంగ్రెసులోనే గాంధీవాదులకూ, పాతకాలపు మితవాదులకూ చెడుస్తుందని ప్రభుత్వం అంచనావేసుకున్నది. అదీగాక గాంధీ నిర్దేశించిన ఉద్యమంలో శిక్షార్హమైనవి పన్నుల ఎగవేతలాటివి మాత్రమే. దానికితోడుగా ప్రజలలో ఉద్యమం వేడి తగ్గిపోతున్నట్టు అన్ని రాష్ట్రాలనుంచీ అధికారవార్తలు ఢిల్లీకి చేరాయి.

అలీసోదరులు సైన్యంలో ప్రభుత్వ విద్వేషం పెంపొందించ యత్నించిన నేరం కింద 1921 సెప్టెంబరులో అరెస్టయారు. వెంటనే గాంధీ మొదలుకుని యాభైమంది నాయకులు సైనికులలో ప్రభుత్వంపై తిరుగుబాటు బోధిస్తూ ఒక ప్రకటనచేశారు. పోలీసుశాఖనుంచి చాలా మంది విరమించుకుంటున్నారని కలకత్తా పోలీసుకమీషనరు నవంబరులో రహస్య పోలీసుశాఖకు తెలిపాడు.

ఉద్యమంపైన ప్రభుత్వం తీవ్రచర్యలు తీసుకున్నందువల్ల లాభనష్టాలను బేరీజు వేస్తూ హోంసభ్యుడు సర్ విలియం విన్సెంట్ అనే ఆయన ఒక జాబితా తయారు చేశాడు :

1921 నవంబరు 17 న ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఎడ్వర్డ్ (ఇప్పుడు విండ్సర్ ప్రభువు) బొంబాయిలో దిగాడు. ఆ ఉదయం గాంధీ బొంబాయిలోనే ఉండి పెద్ద మీటింగులో విదేశీ వస్త్రదహనం జరిపించాడు. వేల్స్ యువరాజు గౌరవార్థం ఏర్పాటుచేసిన కార్యక్రమాలలో పాల్గొన్న తెల్లవాళ్ళమీదా, పార్సీవాళ్ళమీదా ఆ అపరాహ్ణం దౌర్జన్య కాండ ప్రారంభమయింది. గాంధీ ఉపవాసదీక్ష అవలంబించకపోతే బొంబాయిలో ఆ సమయంలో గొప్ప దౌర్జన్యాలు జరిగిపోయేవి.

డిసెంబరు ఆఖరులో వేల్స్‌యువరాజు కలకత్తాకు రానున్నాడు. కలకత్తాలో హర్తాలూ, వ్యతిరేక ప్రదర్శనలూ జరుగుతాయని భయపడి వైస్రాయి మదన

మోహన మాలవీయను గాంధీతో రాజీకి పురికొల్పాడు. రౌండుటేబిలు సమావేశం ఏర్పాటు చెయ్యవలసిందిగా కోరటానికి తాను వైస్రాయివద్దకు ఒక డెప్యుటేషను తీసుకుపోబోతున్నానని మాలవీయ గాంధీకి తంతి ఇచ్చాడు. వైస్రాయి రౌండు టేబిలుకు సమ్మతించి, నాయకులను విడుదలచేసినట్టయితే వేల్సుయువరాజును బహిష్కరించటమూ, శాసనోల్లంఘనోద్యమమూ ఆపుచేయాలి. ఇందుకు కొందరు సుముఖులుగా కనిపించారు. వైస్రాయి రౌండుటేబిలు సమావేశానికి ఒప్పుకుంటే ఉద్యమానికి ప్రతిష్ఠ పెరుగుతుందని వారి ఉద్దేశం. కాని గాంధీ షరతులుపెట్టాడు. రౌండుటేబిలు సమావేశం ఎప్పుడు, ఎక్కడ జరిగేదీ, అందులో ఎవరెవరు పాల్గొనేదీ ముందుగా నిర్ధారణ కావాలి; విడుదల అయే నాయకులలో అలీసోదరులు కూడా ఉండాలి.

మాలవీయ రాయబారం విఫలమయింది. ప్రభుత్వానికీ, కాంగ్రెసుకూ మధ్య రంధి హెచ్చింది. ప్రభుత్వం 1921 అంతంలో డిసెంబరు, జనవరి మాసాలలో 30,000 మందిని జైళ్ళలో కుక్కింది; వలంటీరు సంస్థలను నిషేధించింది; ఊరేగింపులనూ, మీటింగులనూ చెదరగొట్టింది. నిశిరాత్రివేళ కాంగ్రెసు, ఖిలాఫత్ కార్యాలయాలపై దాడులూ, సోదాలూ జరిగాయి.

కావాలంటే ఏ రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ అయినా తన బాధ్యతపై శాసనోల్లంఘనమూ, పన్నుల నిరాకరణా ప్రారంభించవచ్చునని అఖిలభారత కాంగ్రెసు కమిటీ నిర్ణయించింది. కాని గాంధీ శాసనోల్లంఘనాన్ని ఒక్కొక్క జిల్లాలోనూ ప్రారంభించటం మంచిదన్నాడు. గుజరాతులోని బార్డోలీ తాలూకాలో తానే స్వయంగా నాయకత్వం వహించ నిశ్చయించాడు.

ఉద్యమం ప్రారంభించేముందు ఆయన బార్డోలీ ప్రజలకు స్పష్టంగా చెప్పాడు. ఉద్యమంలో హింసాచర్యలకు ఎలాటి తావూ ఉండదు. భూమి శిస్తులు చెల్లించనవారి పైరు వేలం కావచ్చు, పొలాలే పోవచ్చు, పశువులు జప్తుకావచ్చు, బార్డోలీ తాలూకా అన్నదే రూపుమాసిపోవచ్చు.

బార్డోలీ సత్యాగ్రహం ప్రారంభించబోయేముందు గాంధీ వైస్రాయికి రాశాడు. ప్రభుత్వం దేనికైనా సంసిద్ధంగా ఉన్నట్టు ప్రభుత్వం జవాబిచ్చింది.

ఉభయపక్షాలూ నడుములు బిగించాయి.

*   *   *

1922 ఫిబ్రవరి 4న ఒక దుస్సంఘటన జరిగింది. ఉత్తరప్రదేశానికి చెందిన గోరఖ్‌పూరు జిల్లాలోని చౌరీచౌరా గ్రామంలో సత్యాగ్రహుల ఊరేగింపు పోలీసు

స్టేషను పక్కగా నడిచింది. ఊరేగింపు చివర నడిచే అలగా జనాన్ని చూసి పోలీసులు హేళన చేశారు. అలగాజనం వాళ్ళమీద చెయ్యి చేసుకున్నారు. పోలీసులు వాళ్ళపై కాల్పులు చేసి, తూటాలు అయిపోయేసరికి పోలీసు స్టేషనులో చేరి తలుపులు బిడాయించారు. ఈలోపల అసలు ఊరేగింపువాళ్లు వెనక్కి తిరిగివచ్చి, కోపోద్రేకంలో పోలీసుస్టేషనుకు నిప్పంటించి, బయటికి వచ్చే పోలీసులను నరికేశారు. చచ్చిన 22 మందిలో సబిన్స్పెక్టరు కొడుకుకూడా ఉన్నాడు.

ఈ వార్త అందగానే గాంధీ నెత్తిన పిడుగు పడ్డట్టయింది. తాను ప్రారంభించనున్న బార్డోలీ సత్యాగ్రహానికి స్వస్తిచెప్పి, ఆయన జైళ్ళకు పోయే కార్యక్రమాలను కట్టిపెట్టి, నిర్మాణ కార్యక్రమాలకు పిలుపిచ్చాడు.

ఉద్యమాన్ని ఆపవద్దని గాంధీకి ఆయన అనుచరు లందరూ చెప్పిచూశారు. చౌరీచౌరాలో ఏదో జరిగిందని బార్డోలీలో ఉద్యమం ఆపట మెందుకో వారికి అర్థం కాలేదు. ప్రభుత్వమే ప్రేరేపకులను నియోగించి హింసాచర్యలు చేయవచ్చు గద! అంతటితో సత్యాగ్రహం విచ్ఛిన్నం కావలిసిందేనా? కాని గాంధీ కేవలమూ చౌరీచౌరా సంఘటనల కారణంగానే ఉద్యమం మానలేదు. దేశంలో హింసాత్మక శక్తులుండటం ఆయన గమనిస్తూనే ఉన్నాడు. వాటిని అహింసా మార్గంలో నడిపించా లన్నదే ఆయన ఆశయం. "ఈ ఉద్యమాన్ని నేను నిలపకపోయినట్టయితే మనం హింసాత్మకమయిన ఉద్యమానికి నాయకత్వం వహించినవాళ్ళమై ఉండేవాళ్ళమని నమ్మకంగా చెప్పగలను," అని ఆయన జవాహర్‌లాల్‌కు రాశాడు.

గాంధీని ఆయన అనుచరులు సరిగా అర్థం చేసుకోనట్టే ప్రభుత్వమూ అర్థం చేసుకోలేదు. ఉద్యమంలో వేడి తగ్గిన కారణంగా ఆయన దాన్ని విరమించాడని వాళ్లు తలపోశారు.

"దేశమంతటా దౌర్జన్యకాండ సాగుతుందన్న భయంతో ప్రభుత్వం నన్ను అరెస్టు చెయ్యకపోతే అందుకు నేను సంతోషించను, అవమాన పడతాను," అని మార్చి 9న గాంధీ "యంగ్ ఇండియా"లో రాశాడు. మర్నాడు ఆయననూ, "యంగ్ ఇండియా" ప్రచురణకర్త అయిన శంకర్‌లాల్ బాంకర్‌నూ అరెస్టు చేశారు.

ముద్దాయిలు తమనుతాము సమర్థించుకోలేదు. దేశంలో జరిగిన హింసాచర్యలకు బాధ్యత తనదేననీ, తనకు వీలయినంత హెచ్చుశిక్ష వెయ్యవచ్చుననీ గాంధీ కోర్టులో అన్నాడు. విచారణ 100 నిమిషాలు పట్టింది. గాంధీకి ఆరేళ్ళ జైలుశిక్ష విధించారు.

ఆయననూ, శంకర్లాల్ బాంకర్నూ యెర్రవాడ జైలుకు తీసుకుపోయారు. జైలుకు పోవటంకూడా శాసనోల్లంఘనమే.

*　　*　　*

గాంధీ జైలుకు వెళ్లాక ఇతర కాంగ్రెసు నాయకులలో చీలిక ఏర్పడింది. కొందరు చిత్తరంజన్దాసు నాయకత్వాన స్వరాజిస్టులమని పేరు పెట్టుకుని, శాసన సభలలో ప్రవేశించాలని సిద్ధాంతీకరించారు. ఇండియా ప్రభుత్వం లోకాన్ని మభ్యపెట్టటానికి కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ శాసన సభలు ఏర్పాటుచేసి, ఎన్నికలు జరిపి నాటకం ఆడుతున్నది. ప్రభుత్వం చెయ్యదలచినది చెయ్యటానికి ఈ శాసన సభలు అడ్డురావు. కాని వాటిలో ప్రవేశించి, ప్రభుత్వ నిర్ణయాలను ప్రతిఘటించినట్టయితే ప్రభుత్వం ఎంత నిరంకుశంగా పాలిస్తున్నదీ వెల్లడి అవుతుందని సి. ఆర్. దాస్, మోతీలాల్ నెహ్రూ, హకీమ్ అజ్మల్ఖాన్, మహమ్మదాలీ, విఠల్భాయ్పటేల్లాంటి కాంగ్రెసు నాయకుల ఉద్దేశం. వాళ్ళు మంచివక్తలు, వాదించగల పీడర్లు. వల్లభ్భాయ్ పటేల్, రాజగోపాలాచారి మొదలైనవారు కొందరు ఈ పద్ధతికి ఒప్పుకోలేదు.

రెండు నెలలు వ్యవధి ఉన్నదనగా శాసన సభా ప్రవేశానికి నిర్ణయించి, అనేక మంది కాంగ్రెసు నాయకులు కేంద్ర, రాష్ట్ర శాసన సభలలోకి జొరబడగలిగారు. కేంద్ర శాసన సభలో స్వరాజ్యపార్టీకి నాయకుడు మోతీలాల్నెహ్రూ, బెంగాలు శాసన సభలో సి. ఆర్. దాస్.

1924 జనవరిలో గాంధీకి తీవ్రమైన ఎపెండిసైటిస్ వ్యాధి ఏర్పడింది. పూనాలోని సాసూన్ ఆస్పత్రిలో 12వతేదీ రాత్రి 10 గంటలకు శస్త్ర చికిత్స ప్రారంభించారు. ఆరంభంలోనే లైట్లు ఆరిపోయాయి. టార్చిలైటుతో ఆపరేషన్ చేస్తూండగా మధ్యలో అదికూడా ఆరిపోయింది. అయినా చికిత్స జయప్రదంగా జరిగింది. ఆయనను విడుదల చేయాలని శాసన సభలలో తీర్మానాలు ప్రవేశపెట్టబడ్డాయి. కాంగ్రెసు నాయకుల మధ్య విభేదాలు ఏర్పడి ఉండటంచేత ప్రస్తుతానికి గాంధీకి చేతినిండా పని ఉంటుందన్న నమ్మకంతో వైస్రాయి ఆయన విడుదలకు ఉత్తరువిచ్చాడు. 1924 ఫిబ్రవరి 5న గాంధీని విడుదలచేశారు.

గాంధీ జైలులో ఉన్నకాలంలో ఎన్నో మార్పులు జరిగాయి. స్వరాజ్య పార్టీవారి పలుకుబడి పెరిగింది. హిందూ ముస్లిము సమైక్యత దెబ్బతిన్నది. నిర్మాణ కార్యక్రమం మూలపడది. దాని ఆధారంమీద సత్యాగ్రహోద్యమం నడిచే ఆశలేదు. గాంధీ స్వరాజ్య పార్టీవారికి కాంగ్రెసును అప్పజెప్పి, తాను తటస్థంగా ఉండిపోవటమేగాక, తనతో ఏకీభవించే వారినికూడా తటస్థంగా ఉండిపొమ్మన్నాడు.

*　　*　　*



గాంధీ, నెహ్రూలు

అన్నిటికన్న గాంధీని హెచ్చుగా బాధించినది హిందూ ముస్లిము సంఘర్షణలు. మత కలహాలు చాలాచోట్ల సాగాయి. సత్యాగ్రహోద్యమం నిలిచిపోయాక ఉభయ మతాలలోనూ మత నాయకులు చురుకుగా పనిచేశారు. టర్కీ రిపబ్లికు కావటంతో ఖిలాఫత్ ఉద్యమానికే అడుగు ఊడిపోయింది. ముస్లిములు అల్ప సంఖ్యాకవర్గం. హిందువులతో కలిసి రాజకీయ పోరాటంలో పాల్గొనటం తమకు నష్టదాయకం కావచ్చునని ముస్లిములకు అనిపించింది.

శంభల్, అయోధ్య, గుల్బర్గాలలో మత కలహాలు జరిగాయి. కోహాట్‌లో 155 మంది హిందువులు చచ్చారు. హిందూ ముస్లిముల మధ్య గాంధీ కోరిన సహసౌహృదం పూర్తిగా పోయింది. ఆయన ఇతరుల పాపాలకు తాను ప్రాయశ్చిత్తం చేసుకునే అలవాటు గలవాడు కావటంచేత 21 రోజులు ఉపవాసం చేశాడు. ఈ ఉపవాస దీక్ష దేశంలో చాలా సంచలనం కలిగించింది. సమైక్యత సదస్సు జరిగింది. ఢిల్లీలో అనీ బిసెంట్, అలీ సోదరులూ, స్వామి శ్రద్ధానంద, మాలవీయ మొదలైన వాళ్ళు

300 మంది సమావేశమై తీర్మానాలు చేశారు. 1924 అక్టోబరు 8 న, గీత, కొరాను, క్రైస్తవ ప్రార్థనల మధ్య గాంధీ ఉపవాస విరమణ చేశాడు.

మత సామరస్యం తిరిగి వచ్చినట్టే కనబడింది. కాని అది భ్రమ. కొంతకాలం జరిగాక గాంధీ, "హిందూ ముస్లిము సమస్య మనిషి చేతులుదాటి దేవుడి చేతిలోకి వెళ్ళిపోయింది," అన్నాడు.

తరవాత కొన్ని సంవత్సరాలపాటు గాంధీ దేశపునర్నిర్మాణం గురించి కృషి తలపెట్టి, రాజకీయాలజోలికి పోలేదు. దేశంనిండా నిరుపేదలున్నారు. వారిలో పదోవంతు ఒంటిపూట భోజనంమాత్రమే చెయ్యగలరు. వాళ్ళకు స్వేచ్ఛా, దేవుడూ అనేమాటలు అర్థంలేనివి; రొట్టెముక్క అర్థమవుతుంది. వారి దారిద్ర్యం ఎంత మేరకు తీరినా తీరినట్టే. అందుకు ఖాదీని మించినదిలేదు. అది రాజకీయ సమరంలో ఉపయోగించే ఆర్థిక అస్త్రం. గ్రామజీవిత పునరుద్ధరణకు అదే పట్టుకొమ్మ. ఏడాదికి ఆరునెలలు పనులు లేనివారికి అది ఎంతో లాభిస్తుంది.

ఈ కాలంలో గాంధీ దేశాటనచేశాడు. మారుమూల పల్లెటూళ్ళకు కూడా వెళ్ళాడు. 1925 నవంబరులో గాంధీ ఆత్మకథారచన ఆరంభమయింది. ఆయన దాన్ని గుజరాతీలో రాస్తే, మహదేవదేశాయి, ప్యారేలాల్ మొదలైనవాళ్ళు ఇంగ్లీషులోకి అనువదించారు. 1927 లో ఆయన దేశసంచారంచేసి, వారానికి 30 ఉపన్యాసాలు చేశాడు. ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. ఆయన మైసూరువెళ్ళి విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది.

ఈపర్యటనలో ప్రజలు తనకు ఇచ్చిన ప్రతి సన్మానకాగితాన్ని వేలంవేసి, ఆయన ఖాదీనిధికి చేర్చాడు.

*   *   *

1922 లో ఆరేళ్ళ జైలుశిక్షపొందిన గాంధీ, అస్వస్థతకారణంగా 1924 లో జైలునుంచి విడుదల అయినప్పటికీ, తాను ఆరేళ్ళూ జైలులో ఉన్నవాడిలాగే రాజకీయాలకు దూరంగాఉండి, తిరిగి 1928 లో రాజకీయాలలో ప్రవేశించాడు. అలా ఆయన రాజకీయాలలో తిరిగి అడుగుపెట్టవలసిన పరిస్థితి ఈవిధంగా ఏర్పడింది.

1923 లో శాసనసభలో ప్రవేశించిన స్వరాజిస్టులు కొంత హడావిడి చేశారుగాని, రానురాను వారి పస తగ్గిపోయింది. 1926 ఎన్నికలలో వారికి వోట్లురాలేదు. దానికి తగ్గట్టే మోతీలాల్‌లాటి నాయకులకు కనువిప్పు కలిగింది. శాసనసభలు వట్టిమోసం. వాటిద్వారా చేయగలదేమీలేదు.

1927 నాటికి దేశంలో రాజకీయ ప్రశాంతత నెలకొన్నది. ఈ సమయంలో ప్రభుత్వం కోరకోరి తనతలను కొరివితో గోక్కున్నది. ఇండియాలోని పరిస్థితులు విచారించటానికి ఒక రాయల్ కమిషను నియోగించబడింది. ఇదే సైమన్ కమిషన్. ఇండియాకు స్వపరిపాలనార్హత కలదో లేదో విచారించటానికి రానున్న ఈకమిషనును పూర్తిగా బాయికాట్ చెయ్యాలని కాంగ్రెసు తీర్మానించింది. కాంగ్రెసు వ్యతిరేకించినా, దేశంలోని మితవాద నాయకులూ, పార్టీలూ కమిషనుతో సహకరిస్తాయని బ్రిటిషుపాలకులు ఆశపడ్డారు. కాని అది జరగకపోగా, సైమన్ కమిషనును అన్ని భారతీయవర్గాలూ వ్యతిరేకించాయి; అదివరకు సామరస్యం లేకుండాఉన్న భారతీయ రాజకీయవర్గాలమధ్య ఐక్యతకూడా ఏర్పడింది.

అఖిలపక్ష సమావేశాలు జరిగాయి. మోతీలాల్ నెహ్రూ ఒకరిపోర్టు (నెహ్రూ రిపోర్టు) తయారుచేసి, డొమినియన్ స్టేటస్ ప్రాతిపదికపై అఖిలపక్షాలకు ఆమోద కరంగాఉండే సూచనావళి రూపొందించాడు. యువతరం నాయకులైన జవాహర్లాల్, సుభాష్‌బోసులు, ఈరిపోర్టును కాంగ్రెసు ఆమోదించేపక్షంలో, తాము కాంగ్రెసులో ఉండబోమని బెదిరించారు. అంతటితో ఊరుకోక కాంగ్రెసు ఆశయం సంపూర్ణ స్వాతంత్ర్యమని ఉద్ఘాటిస్తూ వారు ఇండిపెండెన్సు లీగ్ కూడా నెలకొల్పారు. 1928 డిసెంబలో జరుగనున్న కాంగ్రెసు మహాసభలో ముసలంపుట్టే లక్షణాలు కనబడ్డాయి.

ఈభయంతో మోతీలాల్ గాంధీకి రాశాడు: "నన్ను గద్దెఎక్కించి, నానెత్తిన ముళ్ళకిరీటం పెట్టారు. నాఇక్కట్లను దూరంనుంచి చూడకండి."

గాంధీ కలకత్తా సమావేశానికివచ్చి, ఒకచిన్న సవరణతో నెహ్రూ రిపోర్టును సమావేశంలో నెగ్గించాడు. ఆ సవరణ ఏమిటంటే: 1929 డిసెంబరు 31 లోగా ప్రభుత్వం నెహ్రూరిపోర్టును ఆమోదించని పక్షంలో కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యం లక్ష్యంగా పెట్టుకుని, అవసరమైతే దానిసాధనకు సత్యాగ్రహ సమరం సాగిస్తుంది.

"బ్రిటిషువాళ్ళు స్వాతంత్ర్యం కాదుగదా, డొమినియన్ స్టేటస్ కూడా ఇవ్వరు. కాంగ్రెసు తనబలాన్ని కూడగట్టుకుని అహింసా సమరానికి ఆయత్తంకావాలి. ముందు చెయ్యవలసినపని చాలాఉన్నది," అని గాంధీ కాంగ్రెసును హెచ్చరించాడు.

చెయ్యవలసినపని చాలా ఉన్నదనటంలో గాంధీ ఉద్దేశ మేమిటి? రాజకీయపు ఎత్తులు ఆలోచించటం కానేకాదు — దేశసంచారంచేసి, ఖాదీ ఉత్పత్తిని ప్రచారం చెయ్యటమూ, విదేశీవస్త్ర బహిష్కరణనూ, దహనాన్నీ ప్రోత్సహించటమూ,

ఇంటింటికీ తిరిగి ఖాదీ అమ్మే వాలంటీర్లను నియోగించెయ్యటమూ, విదేశీ వస్త్రాలమ్మే దుకాణాలదగ్గర పికెటింగు జరపటమూనూ.

1929 మార్చిలో కలకత్తాలోని శ్రద్ధానందపార్కులో విదేశీవస్త్రాలు పెద్దగుట్టవేసి తగలబెట్టారు. (ప్రభుత్వ కార్యాలయాల సమీపంలో విదేశీవస్త్ర దహనం జరపటాన్ని నిషేధించారు. శ్రద్ధానందపార్కు ప్రభుత్వ స్థలంకాదు.) పరశురామప్రీతి ఆరంభమవుతుండగా గాంధీకి సమను అందించారు. దానిపై ఆయన సంతకంచేయ నిరాకరించాడు. అయితే ఆయన బర్మావెళ్లి వచ్చినదాకా ఆయన విచారణ వాయిదాపడింది. మూడువారాల అనంతరం గాంధీ విచారణ జరిగినరోజున దేశమంతటా విదేశీవస్త్ర దహనం ఉత్సాహంగా జరిగింది.

గాంధీకి పడిన శిక్ష ఒకరూపాయి జరిమానా. దాన్ని ఎవరో చెల్లించారు.

1929 ప్రభుత్వాన్ని కలవరపెట్టిన సంవత్సరం. 1930 లో ప్రభుత్వం ఒక పెద్ద ఉద్యమాన్ని ఎదుర్కోవాలన్నది అలా ఉండగా, 1929 లోనే దేశంలో అశాంతి రేగింది. బొంబాయిలోనూ, జంషెడ్పూరులోనూ సమ్మెలు సాగాయి. ఏప్రిల్‌లో కేంద్ర శాసనసభా భవనంలో విజిటర్స్ గాలరీనుంచి ఇద్దరు యువకులు, భగత్‌సింగ్, బి. కె. దత్ అనేవాళ్ళు, బాంబులువేసి, అరెస్టయారు. "మా ఉద్దేశం ఎవరినీ చంపాలనికాదు; చెవిటివాళ్ళు వినేటట్టు చేయాలని," అని వాళ్ళు తమ వాఙ్మూలంలో అన్నారు. చాలాచోట్ల టెర్రరిస్టు చర్యలు జరిగాయి; అనేకమంది యువకులు అరెస్టయారు. ఇవే వరుసగా నడచిన "కాన్‌స్పిరసీ కేసులు." దేశం ఈ హింసావాదులను అభినందించింది. హింసావిధానాలను ఆమోదించనివారుసైతం వారి ఆశయాలను మెచ్చుకున్నారు. వారిలో కొందరు జైలు పరిస్థితులపై నిరసనతెల్పుతూ నిరశన ప్రారంభిస్తే దేశం అట్టుడికిపోయింది. జతీన్‌దాస్ జైలులో మరణించి మహావీరుడి గౌరవం పొందాడు.

మార్చిలో "మీరట్ కాన్‌స్పిరసీ కేసు" నడిచి, ట్రేడ్‌యూనియన్‌వాళ్లూ, కమ్యూనిస్టులూ, తదితరులూ విచారించబడ్డారు. "ఇదంతా కమ్యూనిజమును అణచటానికి కాదు, ప్రజలను అదరగొట్టటానికి, ప్రభుత్వం తన పంజాగోళ్లను అప్పుడప్పుడూ ప్రదర్శించటం ఆనవాయితీ అయింది," అన్నాడు గాంధీ.

1929 అక్టోబరు 25 న వైస్రాయి (ఇర్విన్) ఒకప్రకటన చేశాడు. దాని సారాంశమేమంటే....ఇండియాకు ఎప్పటికైనా డొమినియన్ స్టేటస్ ఖాయమే; ఈలోపల అన్నిపక్షాల ప్రతినిధులనూ, సంస్థానాల ప్రతినిధులనూ సమావేశపరచి సంప్రతించి,



వల్లభ్ భాయ్ పటేల్, ఇతర కాంగ్రెసు నాయకులు గాంధీతో

అందరికీ ఆమోదంగా ఉండే పద్ధతులను పార్లమెంటుకు అందజేయ ప్రభుత్వం నిశ్చయించింది.

ఈ ప్రకటనలో "హృదయపరివర్తన" ఉన్నట్లు కనబడటంవల్ల, గాంధీ, మోతీలాల్, పటేల్, సప్రూ, ఆనీ బిసెంట్, జవాహర్లాల్ ప్రభృతులు ఒక మానిఫెస్టోపై సంతకాలుచేస్తూ కొన్ని షరతులు ప్రతిపాదించారు. అందులో రాజకీయ ఖైదీలందరి విడుదలా, రౌండ్ టేబిల్ సమావేశంలో కాంగ్రెసుకు ప్రముఖమైన స్థానమూ ఉన్నాయి.

అయితే ఈ ఆశాభావం ఎంతోకాలం దక్కలేదు. బ్రిటిషు పార్లమెంటులో పెద్ద దుమారం చెలరేగింది. ఇండియాపట్ల బ్రిటిషు ప్రభుత్వవైఖరిలో పెద్ద మార్పేమీ ఉండరాదని బ్రిటిషు అధికారులు పార్లమెంటు సభ్యులకు చెప్పటం జరిగింది. డొమినియన్ స్టేటస్ లక్ష్యంతో రౌండ్ టేబిల్ సమావేశంలో సంస్కరణలు చర్చకు రాగలవని వైస్రాయి దేశీయనాయకులకు హామీ ఇవ్వలేకపోయాడు.

ప్రభుత్వానికి కాంగ్రెసు ఇచ్చిన ఏడాదిగడువు అయిపోవస్తున్నది. లాహోరులో 1929 ఆఖరులో జరగనున్న కాంగ్రెసు సమావేశం సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్య ప్రకటన చెయ్యకతప్పదు. దానికి గాంధీ అధ్యక్షత వహిస్తాడని అందరూ అనుకున్నారు, కాని గాంధీ జవాహర్లాల్‌ను ముందుకు తోశాడు. రానున్న సమరంకోసం ఉత్సాహంగా ఎదురుచూస్తున్న యువకుడు జవాహర్.

ఈసారి కాంగ్రెసు మహాసభ లాహోరులో జరిగింది. 1929 డిసెంబరు 31 అర్ధరాత్రి రావీ నదీతీరాన భారత స్వాతంత్ర్యపతాక ఎత్తబడింది. కేంద్ర, రాష్ట్ర శాసనసభలలో ఉన్న కాంగ్రెసువారందరూ బయటికి వచ్చెయ్యాలని ఆదేశించబడ్డారు. శాసనోల్లంఘనం సాగించవలసిందిగా అఖిలభారత కాంగ్రెసు కమిటీకి హెచ్చరిక జరిగింది.

*　　　　*　　　　*

గాంధీ శాసనోల్లంఘనోద్యమాన్ని వెంటనే ప్రారంభించక, 11 సూత్రాలతో కూడిన సూచనను వైస్రాయికి పంపాడు. ఈ సూత్రాలకు ప్రభుత్వం ఆమోదిస్తే స్వరాజ్యం వచ్చేస్తుందని కాదు; ఇది ప్రభుత్వాని కొక పరీక్ష. అధికారానికి అంటి పెట్టుకోదలచని ప్రభుత్వమైతే ఆ సూత్రాలకు ఆమోదించాలి. అందులో ఉప్పుపన్ను రద్దూ, భూమిశిస్తు తగ్గింపూ, విదేశీవస్త్రంమీద సుంకం విధింపూ వగైరా లున్నాయి.

గాంధీ సూచనలను ప్రభుత్వం బుట్టదాఖలు చేసింది.

1930 జనవరి 26 భారత స్వాతంత్ర్యదినంగా గాంధీ ప్రకటించాడు. ఆ రోజున దేశమంతటా ఉత్సవాలూ, బ్రిటిషుపాలనను సహించమని ప్రమాణాలూ జరిగాయి. శాసనోల్లంఘనానికి దేశం సిద్ధంగా ఉన్నట్లు స్పష్టమయింది.

శాసనోల్లంఘనోద్యమం ఉప్పు సత్యాగ్రహంతో ప్రారంభమయింది. ఉప్పు చట్టాన్ని ప్రతిఘటించటానికి గాంధీ మొదటి జట్టు సత్యాగ్రహులను వెంటబెట్టుకుని అహమ్మదాబాదులోని సబర్మతీ ఆశ్రమంనుంచి సముద్రతీరాన ఉన్న దండీకి కాలి నడకన బయలుదేరాడు. దండీ ప్రస్థానం మార్చి 12 ఉదయం 6-30 కి ప్రారంభ మయింది. గాంధీ వెంట 79 మంది సత్యాగ్రహులున్నారు; వీరిలో పండితులూ, పత్రికా సంపాదకులూ, అస్పృశ్యులూ, సాలెవాళ్లూ కూడా ఉన్నారు. అందరికన్న తక్కువ వయసుగల సత్యాగ్రహి 16 ఏళ్ళవాడు, అందరికన్న వృద్ధుడివయసు 61. నడవవలసిన దూరం 241 మైళ్ళు.

ప్రభుత్వం గాంధీని దారిలో అరెస్టుచెయ్యలేదు. గాంధీ కోరినది అరెస్టుకావటమే ననీ, అరెస్టు జరగనికారణంచేత ఉద్యమం చప్పబడిపోతున్నదనీ వారు నమ్మారు. మూకఉమ్మడి అరెస్టులు చెయ్యవద్దని రాష్ట్రప్రభుత్వాలకు హెచ్చరికకూడా వెళ్ళింది. కాని ఇలా జరగలేదు. మార్చి 7 నే స్థానికాధికారులు వల్లభ్భాయిపటేలును అరెస్టు చేశారు. ఏప్రిలు ఆరంభంలో జవాహర్లాలు అలహాబాదులో అరెస్టయాడు. ఉప్పు సత్యాగ్రహం చేసేవాడి పిడికిటవున్న ఉప్పు భారతస్వాతంత్ర్యానికి చిహ్నం అని గాంధీ అన్నాడు. ఈ సత్యాగ్రహంలో రాజగోపాలాచారీ, మాలవీయా, సేన్‌గుప్తా,



ఢిల్లీలోని రాష్ట్రపతిభవన్‌లో (అప్పటి వైస్రాయి భవనం) ది 31-3-1947 నాడు వైస్రాయి లార్డ్ మౌంట్ బాటెన్, శ్రీమతి మౌంట్ బాటెన్ లతో గాంధీజీ.

ఖేర్, మున్షీ, దేవదాస్‌గాంధి, మహాదేవదేశాయి, విఠల్భాయిపటేల్‌లాటి నాయకులే గాక, 60 వేల మంది భారతీయులు జైళ్ళను అలంకరించారు.

గాంధీ అరెస్టు మే 5 న జరిగింది.

కాంగ్రెసు కమిటీవారు శాసనోల్లంఘనాన్ని ఇతరచట్టాలకుకూడా విస్తరింపజేయమనీ, పన్నులు నిరాకరించమనీ, విదేశ వస్త్రాలనూ, బాంకులనూ, నౌకలనూ, భీమా కంపెనీలనూ విసర్జించమనీ ఉత్తరు విచ్చారు.

గాంధీ అరెస్టుతో ఉద్యమం మరింత చురుకెక్కింది. కాంగ్రెసు వెనక దేశం బలంగా నిలబడిందని పాశ్చాత్యులే ఒప్పుకున్నారు.

మళ్ళీ రాజీప్రయత్నాలు—వైస్రాయిదగ్గరికి సప్రూ, జయకర్ల రాయబారాలు— 1931 జనవరి 25 న (మర్నాడు స్వాతంత్ర్య దినమనగా) కాంగ్రెసు కమిటీ సభ్యుల విడుదల—ఫిబ్రవరిలో గాంధీ ఇర్విన్ సంప్రతింపులు—మార్చి 4 న ఇద్దరిమధ్యా ఒప్పందం. ఆ ఒప్పందంలో కాంగ్రెసు ఆశయాల వాసనేలేదు. జవాహర్లాల్ "షాక్" తిన్నాడు. "ఇలాటి ఒప్పందం 1929 డిసెంబరులోనే జరిగి ఉండేదే! ఈమధ్య జరిగిన శాసనోల్లంఘన మంతా దేనికీ?" అన్నారు విమర్శకులు.

"ఇది బ్రిటిషువాళ్ళ దొంగ ఎత్తు. కాంగ్రెసు బుట్టలో పడింది," అన్నారు మరి కొందరు.

కాని గాంధీ మటుకు ఈ ఒప్పందం కాంగ్రెసు ప్రభుత్వ సంబంధాలలో ఒక నూతనాధ్యాయమని భావించాడు. కరాచీ కాంగ్రెసు సమావేశంలో ఈ ఒప్పందం ఆమోదించబడింది. ఆగస్టు 29 న గాంధీ ఇంగ్లండులో రౌండుటేబిలు (రెండవ) సమావేశానికి బయలుదేరాడు. ఆయన వెంట మహదేవ దేశాయి, ప్యారేలాల్, దేవదాస్, మీరాబెన్ ఉన్నారు. సరోజినీ నాయుడూ, మాలవీయాకూడా అదే నౌకలో ప్రయాణించారు.

రౌండుటేబిలు సమావేశంలో కాంగ్రెసు ప్రతినిధి గాంధీ ఒక్కడే. మిగిలిన వారంతా జమీందార్లూ, సంస్థానాలవాళ్ళూ, బ్రిటిషు ప్రభుత్వం ఎన్నుకున్నవారూ. ఇండియాకు స్వాతంత్ర్యం ఎందుకు కావాలో గాంధీ చాలా చక్కగా చెప్పాడు. కాని ఆయన మాటలు ఎక్కలేదు. మత విభేదాలకు చర్చలలో ప్రాముఖ్యం వచ్చింది. ఇండియాను చెయి జారిపోనివ్వటం ఆత్మహత్యా సదృశమని బ్రిటిషు పత్రికలు స్పష్టంగా రాశాయి. సమావేశంలో చెలరేగిన సంఘర్షణలూ, చర్చలూ అసలు సమస్యకు సంబంధించినవి కావు. ఇంత ఘోరకలిగా చర్చలు జరుగుతాయని ఆయన అనుకోలేదు. ఆయన బొత్తిగా ఒంటరిగాడయిపోయాడు.

రౌండుటేబిల్ సమావేశంలో గాంధీకి లభించినది పూర్తి అపజయమే. కాని సమావేశం బయట ఆయన కొన్ని విజయాలు సాధించాడు. ఆయనను చాలాచోట్ల ఉపన్యసించటానికి ఆహ్వానించారు. ఆయన జార్జి బెర్నార్డ్‌షా, లాయిడ్ జార్జి మొదలైన వాళ్ళను కలుసుకున్నాడు. చార్లీచాప్లిన్ ఆయనను చూడవచ్చాడు.

గాంధీ స్వదేశానికి తిరిగి వచ్చేటప్పుడు స్విట్జర్లాండులో రొమారోలా ఇంట కొన్నాళ్ళున్నాడు. అక్కడి ప్రజలు గాంధీపట్ల చాలా అభిమానం చూపారు. ఆయన గవాక్షంవద్ద యువకుడు ఒకడు వయొలిన్ వాయించాడు. స్కూలుపిల్లలు ఆయనకు పూలు తెచ్చి ఇచ్చారు. ఆయనచేత చాలాచోట్ల ఉపన్యాసాలు ఇప్పించి ప్రశ్నలు వేశారు: స్విట్జర్లాండుపై దాడి జరిగితే ఏం చెయ్యాలి? సైన్యంపై ఆధారపడాలా వద్దా?

"సైన్యం వృథా. పురుషులూ, స్త్రీలూ, పిల్లలూ శత్రువులకు అడ్డంగా గోడలాగా నిలబడితే చాలు," అని సమాధానం.

వర్గసంఘర్షణగురించి గాంధీ అభిప్రాయం: "శ్రామికవర్గానికి తన శక్తి తెలీదు. తెలిసి అది లేచింపంటే పెట్టుబడిదారీవర్గం శిథిలమవుతుంది. ప్రపంచంలో ఉన్నదల్లా శ్రామికశక్తే."



బిర్లా మందిరంలోని గాంధీజీ పుస్తకాలు, వ్రాతపరికరాలు, చరఖా.

గాంధీ అభిప్రాయాలు అక్కడి ఉన్నతవర్గాలకు ఏమీ రుచించలేదు. ఆయన శాంతివాదంలో చాలా సమరోత్సాహం ఉన్నది; ఆయన ఆర్థికసూత్రాలు మరీ అతివాదంతో కూడివున్నాయి.

రోము నగరంలో ఆయన ముసోలినీని కలుసుకోగలిగాడు గాని పోప్ చూడ నిరాకరించాడు.

గాంధీ బొంబాయిచేరిన వారంలోపల ఆయనను జైలులో పెట్టారు. సత్యాగ్రహోద్యమం తిరిగి ఆరంభమయింది. కాంగ్రెసును ప్రతిఘటించటానికి ఈసారి ప్రభుత్వం అన్నిరకాల ఆర్డినెన్సులతోనూ, ఇతర ఏర్పాట్లతోనూ సిద్ధంగా ఉన్నది. వీటి ఆధారంతో జవాహర్లాలునూ, గఫర్ ఖానునూ ప్రభుత్వం అదివరకే అరెస్టుచేసింది. రాజకీయ వాతావరణం సంక్షుభితంగా ఉన్నది. సరిహద్దున కాల్పులుకూడా జరిగాయి. గాంధీ ఇర్విన్ ఒప్పందానికి ఏనాడో కాలదోషంపట్టింది. ఇర్విన్ వెళ్ళిపోయి కొత్త వైస్రాయిగా వెలింగ్టన్ వచ్చాడు. ఈయన కాంగ్రెసును అణచివేయ్యటానికి నిశ్చయించుకుని ఉన్నాడు. రాష్ట్రపాలకులు ఆయనకన్న ఒక అడుగు ముందేఉన్నారు— బొంబాయి ప్రభుత్వం గాంధీని అండమానుకు పంపమని వైస్రాయికి సలహా ఇచ్చింది!

కాంగ్రెసూ, దానిశాఖలూ, అనుబంధసంస్థలూ ప్రభుత్వనిషేధానికి గురిఅయాయి. కాంగ్రెసు నిధులు బిగించబడ్డాయి. 61,551 మంది సత్యాగ్రహులు ఖైదు చేయ

బడ్డారు. యు.పి., బెంగాలు, బీహారు, బొంబాయిరాష్ట్రాలనుండి పదేసివేలమందికి పైగ సత్యాగ్రహులు జైళ్ళకుపోయారు. అతిచిన్న రాష్ట్రమైనప్పటికీ సరిహద్దురాష్ట్ర 5,557 మందిని జైళ్ళకు పంపింది.

నాలుగునెలలు గడిచాక ఉద్యమం చప్పబడింది.

*　　　　*　　　　*

ప్రభుత్వం నిమ్న (అస్పృశ్య) వర్గాలకు ప్రత్యేక నియోజకవర్గాలు ప్రకటించింది 1932 సెప్టెంబరు 20 నుంచి గాంధీ ఆమరణ నిరాహారదీక్ష తీసుకోబోతున్నట్టు 13న ప్రకటించాడు. ఇదంతా లోకానికి ఆకస్మికంగా తెలిసినా, ఈ సమస్యమీద గాంధీకీ ప్రభుత్వానికీ మధ్య కొన్నిమాసాలపాటు ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. అస్పృశ్యు లంటూ ఒక జాతిని కేటాయించటానికి గాంధీ అభ్యంతరం చెప్పాడు. నిమ్న జాతులకు అదనపుహక్కు లిస్తామంటే గాంధీ ఎందుకు వద్దనాలి అని ప్రభుత్వప్రశ్న

సెప్టెంబరు 20న దేశమంతటా ఉపవాసాలూ, ప్రార్థనలూ జరిగాయి. శాంతి నికేతనంలో టాగోరు నల్లబట్టలు ధరించి, గాంధీ అవలంబించిన నిరశనవ్రతం యొక్క అంతరార్థంగురించి ప్రసంగించాడు. బావులవద్దకూ, గుళ్ళలోకీ హరిజను లను రానిచ్చారు.

హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గాలు కావాలని పట్టుబట్టికూర్చున్నాడు డాక్టర్ అంబేద్కర్. ఆయన కరేనంటేతప్ప ప్రభుత్వం హరిజనుల విషయంలో ఎలాంటి చర్యా తీసుకోదు. అంబేద్కరు హరిజన ప్రాతినిధ్యంలో కొన్ని సవరణలకు సమ్మ తించినమీదట "పూనా ఒప్పందం" అన్నది కుదిరింది. గాంధీ ఆరోగ్యం అపాయ కరంగా పరిణమించనున్న దశలో ఆయన నిరశన విరమణ చెయ్యటం జరిగింది.

అటు తరవాత గాంధీ తన సర్వశక్తులను హరిజన సమస్యకు ధారపోశాడు. సబర్మతీ ఆశ్రమాన్ని హరిజనసేవక సంఘానికి ఇచ్చేసి, నవంబరు 7 నుంచీ దేశసంచారం ప్రారంభించి, తొమ్మిదినెలల కాలంలో 12,500 మైళ్లు పర్యటించాడు. "గేదెలు రోజూదిగే చెరువుదగ్గరికి హరిజనులను ఎందుకు రానివ్వకూడదు?" అని ఆయన సవర్ణ హిందువులను అడిగాడు. హేయమైన అలవాట్లుమానేసి పైకిరమ్మని ఆయన హరిజనులను హెచ్చరించాడు. మామూలు ప్రజలనుంచి దానాలుపట్టి ఆయన 10 నెలల కాలంలో 8 లక్షల హరిజననిధి పోగుచేశాడు. ఆమొత్తం ఏ కోటీశ్వరు డైనా క్షణంలో ఇచ్చిఉండును, కాని తన హరిజనోద్యమంలో అసంఖ్యాక ప్రజలు పాల్గొనటం ప్రధానంగా ఆయన భావించాడు.

అయితే ఈ హరిజనయాత్ర నిర్విఘ్నంగా సాగలేదు. సనాతనులు ఆయనను ప్రతిఘటించారు; ఆయనకు నల్లజెండాలు చూపారు; ఆయన మీటింగులు సాగకుండా చేయ యత్నించారు.

1934 జూను 25 న పూనాలో మునిసిపల్ హాలుకు పోతుండగా ఆయన అనుచరులమధ్య బాంబుపేలింది. ఏడుగురు గాయపడ్డారు. కాని గాంధీకి దెబ్బ తగల లేదు. బాంబువేసిన వాడిపట్ల గాంధీ జాలిప్రకటిస్తూ, "వీరమరణం పొందాలని నాకు లేదు. కాని అసంఖ్యాకులైన తోటి హిందువుల విశ్వాసాలను సంరక్షించటానికి చావవలసివస్తే నేను ధన్యుణ్ణిగానే భావిస్తాను," అన్నాడు.

* * *

సత్యాగ్రహోద్యమం నిలిచిపోయింది. కాంగ్రెసు విశ్రాంతి తీసుకుంటున్నది అన్నాడు గాంధీ. 1934 మేలో పట్నాలో జరిగిన కాంగ్రెసుకమిటీ మీటింగులో, కాంగ్రెసువాదులు శాసనసభలలో ప్రవేశించటాన్ని ఆమోదిస్తూ తీర్మానాన్ని గాంధీ స్వయంగా ప్రవేశపెట్టాడు. కాంగ్రెసు సంస్థలపై నిషేధాలను ప్రభుత్వం తొలగించింది. స్వరాజ్యపార్టీది కాంగ్రెసులో పైచెయ్యికావటమూ, సత్యాగ్రహం నిలిచి పోవటమూ కాంగ్రెసువాదులలో చాలామందికి ఏమాత్రమూ నచ్చలేదు. "నేను మారలేదు. కాలస్వభావాన్ని గుర్తించి దాని కనుగుణంగా పోతున్నాను," అన్నాడు గాంధీ.

కాని, తన అహింసాసిద్ధాంతం తన అనుచరులలో చాలామందికి అర్థంకాలేదన్నది ఆయనను బాధించింది. ఆయనకు రాజకీయ స్వభావంగలదిగా కనిపించిన నిర్మాణ కార్యక్రమాన్ని వారు రాజకీయంగా పరిగణించలేదు. ఈ విభేదాలు, 1934 అక్టోబరులో ఆయనను కాంగ్రెసునుంచి ఎడంచేశాయి.

కాంగ్రెసునుంచి విరమించిన గాంధీ గ్రామోద్ధరణ కార్యక్రమం చేపట్టాడు. అఖిల భారత గ్రామపరిశ్రమల సమాఖ్య ఏర్పడింది. అఖిలభారత చేనేతసంఘం 5,300 గ్రామాలలో పనిచేస్తూ, రెండుకోట్ల రూపాయలు బట్వాడా చేసింది. గ్రామీణులు చైతన్యవంతులైతే తమ పరిస్థితిని చాలా మెరుగుపరచుకోవచ్చు. చంద్రనాథ్ అనే నిరక్షరుడు 1500 మంది గ్రామీణులను పోగుచేసి మూడుమైళ్ళ నిడివిగల కాలువా, రోడ్డూ నిర్మించాడు. వాటి కిమ్మతు 50,000 రూపాయలుంటుంది!

గాంధీ వర్ధాకు సమీపంలో ఉన్న సేవాగ్రాంకు మారాడు. అక్కడిజనాభా 600. పక్కారోడ్డుగాని, దుకాణంగాని, పోస్టాఫీసుగాని లేవు. దానికి తగ్గట్టు అనారోగ్య ప్రదేశం. ఈగ్రామానికి గాంధీ ఒంటరిగావెళ్ళాడు; తన భార్యనుకూడా రానివ్వలేదు.

కాని ఆయనచుట్టూ జనంచేరారు. క్రమంగా గ్రామోద్ధరణ పథకానికి సేవాగ్రాం నమూనాగా తయారయింది. పైవాళ్ళ సహాయం అవసరంలేకుండా గ్రామస్థులు ప్రారంభించదగిన లఘు పరిశ్రమలు ప్రారంభమయాయి.

"సేవాగ్రాంలోని 400 మంది వయోజనులు నా కార్యక్రమాన్ని అనుసరించి నట్టయితే ఏటా 10 వేల రూపాయలు సంపాదించుకో గలుగుతారు, కాని వారిలో సహకారంలేదు. కొత్త విషయాలు అలవరుచుకోరు," అన్నాడు గాంధీ.

ఆయన యంత్ర పరిశ్రమలనూ, యంత్ర నాగరికతనూ తీవ్రంగా ఖండించాడు. వర్గసంఘర్షణ అనివార్యమని ఆయన నమ్మలేదు. "ఆదర్శప్రాయుడైన భూస్వామి తన రైతుల సంక్షేమంకోసం తాను దారిద్ర్యం వరించి వారికి అన్ని సౌకర్యాలూ కలిగిస్తాడు," అన్నాడు.

* * *

1935 లో బ్రిటిషు పార్లమెంటు తయారుచేసిన నూతన రాజ్యాంగం 1937 లో అమలులోకి వచ్చింది. ఈ రాజ్యాంగంపై ఒక బ్రిటిషు పత్రిక ఇలా అన్నది:

"బ్రిటిషువారు ఇండియాను పాలించనూలేరు, విడిచిపోనూలేరు గనక, బ్రిటిషు పాలకులకు బ్రిటిషు రాజ్యంలాగానూ, ఇండియా వారికి స్వరాజ్యంలాగానూ తోపింప జేసే రాజ్యాంగం తయారు చేయబడింది."

"దీనికింద భారతీయులకు అధికారాలు లేకుండా బాధ్యతలు పెరిగాయి," అన్నాడు జవాహర్లాల్.

కాంగ్రెసు ఈ రాజ్యాంగాన్ని తోసిపుచ్చింది—కాని ఎన్నికలలో పాల్గొన్నది. దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ దానికి మెజారిటీ లభించింది. ఏ రాష్ట్రంలోనూ ఏ ఇతర పార్టీకీ కాంగ్రెసుకన్న హెచ్చు స్థానాలు రాలేదు. ఎన్నికలలో గెలిచి ఏమి చేయాలో కాంగ్రెసు తీర్మానం స్పష్టంగా చెప్పలేదు.

"ఈ నూతన రాజ్యాంగం ఆధారంగా కాంగ్రెసు స్వాతంత్ర్య లక్ష్యాన్ని సాధించే టట్టయితే హింసాయుత విప్లవమూ, మూకసత్యాగ్రహమూ తప్పుతాయి," అన్నాడు గాంధీ.

ఆరు రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి—బొంబాయి, యు. పి., బీహారు, మధ్యరాష్ట్రం, ఒరిస్సా, మద్రాసు. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలోని అంశాలను అమలు చెయ్యటానికి మంత్రులు యత్నించారు. వాటిలో గాంధీకి ముఖ్యంగా తోచినవి మద్యనిషేధమూ, విద్యా. ఈ దేశంలోని గ్రామాలకు అనుకూ



సేవాగ్రాం (వర్ధా) లోని గాంధీజీ గది.

లించే విద్యా విధానాన్ని గాంధీ సూచించాడు. అదే వర్ధావిద్యావిధానం. ఇందులో మాతృభాషలో విద్యాబోధన ఒక ముఖ్యసూత్రం; వృత్తి విద్యకూడా ముఖ్యమైనదే.

కాంగ్రెసు పదవిలోకి రావటం ఆశ్చర్యకరమైన పరిణామాలకు దారితీసింది. ఉద్యోగా లిప్పించమనీ, మంత్రి పదవు లిప్పించమనీ గాంధీకి కుప్పలు తెప్పలుగా ఉత్తరాలు వచ్చాయి. కాంగ్రెసువాదులైనవాళ్ళు చేయదగిన పని హెచ్చు భాగం గ్రామసీమలలోనే ఉన్నదని ఆయన అనుకుంటూ వచ్చాడు. కాంగ్రెసు వర్గాలలో "కరప్షన్" గురించి ఆయన "హరిజన్" పత్రికలో చాలా తీవ్రంగా రాశాడు. "ఇంత అవినీతిని సహించేకన్న కాంగ్రెసు సంస్థను నిలువునా పాతి పెట్టటానికి కూడా నేను సిద్ధమే," అన్నాడాయన.

కాంగ్రెసువర్గాలలో కొంత క్రమశిక్షణ అమలుజరపటానికి అగ్రకాంగ్రెసు నాయకులతో సెంట్రల్ పార్లమెంటరీబోర్డు ఏర్పాటయింది. కాంగ్రెసు అధిష్ఠానవర్గం అనుమతిలేకుండా కాంగ్రెసు మంత్రివర్గాన్ని మార్చినందుకు మధ్యరాష్ట్ర ప్రధాని అయిన డా. ఖరేను తొలగించారు. కేంద్రం అజమాయిషీలేని పక్షంలో రాష్ట్ర కాంగ్రెసుప్రభుత్వాలు రాజీధోరణి లవలంబించే అవకాశం ఉన్నది. దీన్ని ఫాసిజం అని కొందరు విమర్శిస్తే గాంధీ, "ఇది ఫాసిజమే అయితే డా. ఖరే తల పోయే ఉండేది," అన్నాడు.

"1937–39 పాక్షిక ప్రజాస్వామ్యం" అని జవాహర్లాల్ అన్నది ప్రపంచ యుద్ధంతో ముగిసింది.

కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పాటుచేసిన నాటినుండి కూడా జిన్నా కాంగ్రెసు వ్యతిరేక ప్రచారం ప్రారంభించాడు—కాంగ్రెసు బ్రిటిషుపాలకుల అండ చేరి ముస్లిములను అణగదొక్కజూస్తున్నది; ముస్లిములకు ఎలాటి రక్షణలూ లేవు ; ముస్లిముల రక్షణకు గవర్నర్లుగాని, వైస్రాయిగాని రాజ్యాంగంలో తమకుగల ప్రత్యేక హక్కులను వినియోగించకుండా ఉన్నారు !

ఇండియాను విభజించాలని పట్టుబట్టాడు.

"ఇండియాను చీల్చేముందు, నన్ను చీల్చండి," అన్నాడు గాంధీ. అయితే ఆయన ముస్లిముల మీద "ఐక్యత"ను బలాత్కారంగా రుద్దటానికి ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. అవతలివాణ్ణి బలాత్కరించటం అహింసావిధానం కాదు.

* * *

1939 సెప్టెంబరులో యుద్ధం ఆరంభమయింది. "ఒక్కవ్యక్తి (వైస్రాయి లిన్‌లిత్‌గో) 40 కోట్లమందిని (భారతీయులను) వారి అనుమతిలేకుండా ఆ యుద్ధంలోకి దించాడు," అన్నాడు జవాహర్లాల్.

1939 సెప్టెంబరు 14 న కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశమై నాజీలకు విరుద్ధంగా పోరాడేవారిపట్ల సానుభూతి ప్రకటించి, ఇండియా సహకారం కావాలంటే బ్రిటను తన యుద్ధలక్ష్యాలను, ప్రజాతంత్రం, సామ్రాజ్యవాదం దృష్ట్యా ప్రకటన చెయ్యాలన్నది. ఎటువంటి వ్యవస్థకోసం బ్రిటను యుద్ధం చేస్తున్నది ? ఇండియా ప్రజాతంత్రంకోసం యుద్ధంలో పాల్గొనేపక్షంలో ఆ ప్రజాతంత్రం "రుచి" వెంటనే ఇండియాకు లభిస్తుందా ?

ఈ ప్రశ్నలకు సమాధానాలు రాలేదు.

1940 లో నాజీ విజృంభణ తీవ్రంగా ఉండగా కాంగ్రెసు, గాంధీని విడిచిపుచ్చటానికికూడా సిద్ధపడి, యుద్ధానంతరం ఇండియాకు స్వాతంత్ర్యం ఇస్తామని ప్రకటన జరిగేపక్షంలో జాతీయప్రభుత్వం ఏర్పాటుచేసి, యుద్ధ సహకారం చేస్తామని ప్రకటించింది. ఈ ప్రకటన చెయ్యటానికి కాంగ్రెసు ఎంతో దిగివచ్చింది. కాని ప్రయోజనం లేకపోయింది.

ఈసారి కాంగ్రెసు మూకసత్యాగ్రహం ప్రారంభిస్తుందని ప్రభుత్వం భయపడి పెద్ద ఎత్తున చర్యలు తీసుకోవటానికి సిద్ధపడింది. అయితే యుద్ధంలో మునిగి ఉన్న తరుణంలో ప్రభుత్వంమీద ఒత్తిడి తేవాలన్న ఉద్దేశం గాంధీకిగాని, కాంగ్రెసుకు

గాని ఏ మాత్రమూ లేదు. గాంధీ ఆదేశించినది వ్యష్టిసత్యాగ్రహం. ఇందులోకి శ్రామికులనూ, కార్మికులనూ, విద్యార్థులనూ తేవలసిన పనిలేదు. కాంగ్రెసు సంస్థను ప్రభుత్వం నిషేధించినా వ్యష్టి సత్యాగ్రహం సాగిపోవచ్చు.

1940 ఆఖరుకల్లా 400 మంది కాంగ్రెసు శాసనసభ్యులు, 29 మంది మాజీ మంత్రులతో సహా, జైళ్ళకుపోయారు. 1941 మే 15 నాటికి 25,069 సత్యాగ్రహులు జైళ్ళలో ఉన్నారు. యుద్ధప్రయత్నాలకేమీ ఆటంకం కలగలేదు. ఇంకా మూడు రోజులకు జపాను పెరల్‌హార్బరుపై దాడి జరుపుతుందనగా సత్యాగ్రహులందరూ విడుదల అయారు.

జపాను ఇండియాపై దాడి చేసే ప్రమాదం సమీపించేసరికి గాంధీ అహింసా సిద్ధాంతంపట్ల విశ్వాసంగల కాంగ్రెసు నాయకులెవరూ లేకపోయారు. బ్రిటిషు ప్రభుత్వానికికూడా పరిస్థితి క్లిష్టంగానే ఉన్నది. ఆ స్థితిలో బ్రిటిషు ప్రధాని చర్చిల్ క్రిప్స్ కమిటీని రాయబారానికి పంపాడు.

గాంధీ క్రిప్స్ తెచ్చిన సూచనలు చూస్తూనే, "తిరుగు విమానంలో మీరు వెళ్ళిపోవచ్చు," అన్నాడు. ఆ సూచనలు నెహ్రూను చాలా నీరసపెట్టాయి. అవి జిన్నా పాకిస్తాను వాదానికి మరింత దోహదకారిగా ఉన్నాయి. ఇండియా యూనియను ఏర్పడితే దానిలో చేర నిరాకరించే హక్కు ముస్లిము మెజారిటీ గల రాష్ట్రాలకే గాక, స్వదేశ సంస్థానాలకుకూడా ఇవ్వబడింది.

క్రిప్సు ఇంగ్లండుకు తిరిగి వెళ్లి, కాంగ్రెసు తన సూచనలకు ఒప్పుకునేదేగాని గాంధీ పడగొట్టాడని చెప్పారు.

1942 జులై 14న కాంగ్రెసు వర్కింగు కమిటీ వర్ధాలో సమావేశమై బ్రిటిషు వారు వెంటనే తొలగిపోకపోతే గాంధీ నాయకత్వం కింద సత్యాగ్రహం సాగాలని నిర్ణయించింది. ఈ నిర్ణయాన్ని ఆగస్టు 7న బొంబాయిలో కాంగ్రెసు కమిటీ సమావేశమై బలపరచవలసి ఉన్నది. ఇదే "క్విట్ ఇండియా" తీర్మానం.

ఈ తీర్మానం కాంగ్రెసువాదులలో చాలా సంచలనం కలిగించింది. దీన్ని విమర్శించినవారూ ఉన్నారు.

అఖిలభారత కాంగ్రెసు కమిటీ ఆగస్టు 7 రాత్రి తీర్మానాన్ని ఆమోదించింది. గాంధీకి ఉద్యమాన్ని మర్నాడే ప్రారంభించే ఉద్దేశంలేదు. "ముందు వైస్రాయితో సంప్రతింపులు జరుపుతాను. ఇది రెండు, మూడు వారాలు పట్టవచ్చు. అంతదాకా మీ రంతా ఏం చేస్తారు?...సంపూర్ణ స్వతంత్ర పౌరులుగా ఈ క్షణం నుంచి మసులుకొండి," అని గాంధీ కమిటీ సభ్యులతో అన్నాడు.

ఆగస్టు 8 అర్ధరాత్రి దాటినాక గాంధీ, నెహ్రూ, ఆజాద్ మొదలైన కాంగ్రెసు నాయకులు అరెస్టుచేయబడ్డారు. ఈ వార్త తెలుస్తూనే బీహారు, యు. పి, బెంగాలు, బొంబాయి రాష్ట్రాలు అట్టుడికిపోయాయి. ప్రజలు ఆగ్రహావేశం చెంది, బ్రిటిషు పరిపాలనా చిహ్నాలయిన పోస్టాఫీసులనూ, రైలుస్టేషన్లనూ, పోలీసు స్టేషన్లనూ ధ్వంసం చేశారు; రైలు మార్గాలనూ, రైలు పెట్టెలనూ, టెలిగ్రాపు తీగెలనూ నాశనం చేశారు. ప్రజల ఈ తిరుగుబాటును ప్రభుత్వం క్రూరంగా, తుపాకులతోనూ, మరతుపాకులతోనూ అణచివేసింది. కాంగ్రెసు అహింసకు స్వస్తి చెప్పిందని ఇతర దేశాలలో ప్రచారం జరిగింది.

నిజానికి గాంధీ అనుకున్న ఉద్యమం అహింసాయుతమైనదే. అది యుద్ధ యత్నాలకు అడ్డుతగిలేదికూడా కాదు. ఆ విషయంలో వైస్రాయిని ఒప్పించటానికి ప్రయత్నించి విఫలుడై గాంధీ, ప్రజలను సరిఅయిన మార్గాన తిప్పటానికి నిరశన వ్రతం ప్రారంభించాడు. ఇది 1943 ఫిబ్రవరి 10 న ప్రారంభమయింది; 21 రోజుల వ్రతం.

ఒక్కొక్కరోజే గడిచినకొద్దీ దేశంలో అంధకారం ఆవరిస్తున్నట్టయింది. వైస్రాయిగారి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌నుంచి ముగ్గురు సభ్యులు బయటికి వచ్చారు. అన్ని రాజకీయపక్షాలవారూ గాంధీని జైలునుంచి విడుదల చేయమని ప్రభుత్వాన్ని అర్థించారు. కాని వైస్రాయిలో చలనం రాలేదు.

1942 ఆగస్టులో గాంధీ అరెస్టయిన వారానికల్లా మహదేవ దేశాయి—గాంధీ కుడిభుజం—పోయాడు. కస్తూర్బాయి ఆరోగ్యం క్షీణించసాగింది. 1944 ఫిబ్రవరిలో ఆమె తన భర్త సన్నిధిలో కన్నుమూసింది.

1942 లో ఆరంభమైన ఆందోళన పరిస్థితి 1944 నాటి కింకా చల్లారలేదు. 1944 జూను 17 న గాంధీ వర్కింగు కమిటీ సభ్యులను కలుసుకోగోరుతూరాస్తే వైస్రాయి (వేవెల్) నిరాకరించాడు.

బ్రిటిషువారు ఇండియా స్వాతంత్ర్య సమస్యను భారతీయుల మీదికే నెట్టారు. భారతీయ స్వాతంత్ర్యానికి అడుగా ఉన్నది బ్రిటిషు ప్రభుత్వం కాదు, కాంగ్రెసుకూ, ముస్లింలీగుకూ మధ్య విభేదాలు; కాని 1942 లోనే గాంధీ, జాతీయ ప్రభుత్వం ఏర్పరచే బాధ్యతను లీగును తీసుకోమంటే జిన్నా లక్ష్యపెట్టాడు కాడు.

జైలునుంచి విడుదల అయాక గాంధీ జిన్నాతో 18 రోజుల పాటు సంప్రతింపులు జరిపాడు, కాని జిన్నా పాకిస్తానుకోసం (దేశ విభజన కోసం) గట్టిగా పట్టుపట్టాడు.



గాంధీజీ ఆస్తి : చెప్పులు, పావుకోళ్లు, గడియారం, కళ్లజోడు,
గిన్నెలు, చెంచాలు, ఆయనకు ప్రియమైన భజనకీర్తనల పుస్తకం.

అదికూడా స్వాతంత్ర్యానికి ముందే జరగాలి. ఈ సంప్రతింపులు జిన్నా పలుకుబడికే దోహదం చేశాయి.

1946 మార్చిలో బ్రిటిషు ప్రభుత్వం ఇండియాకు స్వేచ్ఛ ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నట్టు స్పష్టమయింది. ఇంగ్లండునుండి కాబినెట్ మిషన్ వచ్చింది; "472" మంది నాయకులతో మంతనాలు జరిపింది. ముఖ్యమైన సమస్య ఇండియాను విభజించటమా, మానటమా అన్నది. అవి తేల్చగలవి కాంగ్రెసూ, లీగూమాత్రమే. ఇండియాకు స్వాతంత్ర్యం ఇవ్వటమన్నది మిగిలినవారిదృష్టిలో ఒక రాజకీయ సమస్య అయితే గాంధీకి నైతికసమస్య. తొందరపడి తప్పుడునిర్ణయం చెయ్యవద్దని ఆయన కాంగ్రెసును హెచ్చరించాడు. ఆకస్మికంగా వచ్చిపడుతున్న స్వాతంత్ర్యానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారా అన్నదికూడా ఆయనను బాధించింది.

గాంధీ, కాంగ్రెసూ ప్రజలఉద్రేకాన్ని తగ్గించ చూస్తూంటే, జిన్నా, లీగ్ ఉద్రేకాలను పెచ్చుగొట్టే ధోరణి అవలంబించాయి. ఈ వేడిమీదనే దెబ్బ పడకపోతే పాకిస్తాను రాదని వారికితోచింది. వాళ్ళు కాబినెట్ ప్లానును తోసిపుచ్చి, రాజ్యాంగసభను బహిష్కరించి, హింసాచర్యలకు సిద్ధపడ్డారు.

లీగ్ ఆగస్టు 16 న "ప్రత్యక్షచర్య" ప్రారంభించింది. 12 మాసాలపాటు విలయ తాండవం కొనసాగింది.

* * *

ప్రత్యక్షచర్య జరిగేనాటికి బెంగాలులో లీగ్ ప్రభుత్వమే ఉన్నది. మొదటిదెబ్బ ముస్లిములే తీసినా, కలకత్తాలో హిందువులసంఖ్య జాస్తికావటంచేత ముస్లిములపై హింసాకాండ సాగింది. అటు తరవాత నవఖాలీలో ముస్లిములు హెచ్చుగాఉండి, హిందువులపై పగతీర్చుకున్నారు. అక్కడి దురంతాలలో హిందువులను బలాత్కారంగా ఇస్లాముమతంలోకి చేర్చటమూ, హిందూ స్త్రీలను ఎత్తుకుపోవటమూ కూడా జరిగాయి.

ఈ వార్తలు అందినప్పుడు ఢిల్లీలో ఉన్న గాంధీ నవఖాలీకి బయలుదేరాడు. "నేనక్కడికి వెళ్ళి ఏంచేస్తానో తెలీదు. వెళితేగాని నాకు శాంతిఉండదని మాత్రమే నాకుతెలుసు," అన్నాడాయన.

తూర్పుబెంగాలులో ఆయనకు "సత్యం" గోచరం కాలేదు. ఎటుచూసినా భీతి, అనుమానమూ, అవిశ్వాసమూ మటుకే గోచరించాయి.

నవఖాలీ జిల్లాలోని శ్రీరాంపూర్ గ్రామంలో 200 హిందూ కుటుంబాలుండేవి. గాంధీ వెళ్ళేనాటికి మూడేవున్నాయి.

గాంధీ రాకతో తూర్పుబెంగాలులోని ప్రజలలో అశాంతి కొంతతగ్గింది. ఆయన ప్రభావం ఇంకా హెచ్చుగానే ఉండును. ముస్లిముపత్రికలు ఆయనకు విరుద్ధంగా చాలా విషప్రచారంచేసి, ఆయన రాకలో ఏదో గూఢరాజకీయ అంతరార్థం ఉన్నదని జనాన్ని మభ్యపెట్టాయి. బెంగాలు ప్రధాని సురవర్దీ ఆయనను బెంగాలుపర్యటన చాలించమన్నాడు. 1947 జనవరి 2 న ఆయన శ్రీరాంపూరునుంచి బయలుదేరాడు.

బీహారులో హిందువులు ముస్లిములమీద పగతీర్చుకున్నారు. పరిస్థితి అదుపులోకి వచ్చేలోపున అసంఖ్యాకులైన ముస్లిములు బలిఅయారు. బీహారులో గాంధీ హిందువులనుంచి చందాలు వసూలుచేసి ముస్లిము బాధితులకిచ్చాడు.

గాంధీ బీహారులో ఉండగా పంజాబులో సంఘర్షణ ఆరంభమయింది. లాహోరు,



పోర్ బందర్‌లో మహాత్మాగాంధీ పుట్టినచోటు.

అమృతసర్‌లలో గెరిల్లాయుద్ధం సాగింది. కర్ఫ్యూ, పోలీసుగస్తీలూ హత్యాకాండను అరికట్టలేకపోయాయి.

"ఇంగ్లీషువాళ్ళు ఇంతకాలమూ అదుపులో ఉన్నారుగాని, స్వాతంత్ర్యం వస్తే భారతీయులు ఇలాటి అరాచక చర్యలే చేస్తారు," అన్నారు చర్చిల్ ప్రభృతులు.

స్వాతంత్ర్యానికి అంతా సన్నద్ధమయింది. లార్డ్ మౌంట్‌బాటన్ ఆఖరు వైస్రాయిగా వచ్చాడు. వస్తూనే ఆయన గాంధీతో సంప్రదింపులు జరిపాడు. "జిన్నానే ప్రభుత్వం ఏర్పాటు చెయ్యమనండి," అని గాంధీ సలహా ఇచ్చాడు.

"ఇండియాను విభజించితీరాలి," అని జిన్నా సలహా ఇచ్చాడు.

దేశవిభజన తప్పనిసరి అయింది. చివరదాకా దానికి గాంధీ వ్యతిరేకే. కాని ఆయన దేశవిభజనకు అడ్డుపడలేదు.

1947 ఆగస్టు 15 స్వాతంత్ర్యోత్సవాలకు గాంధీ ఢిల్లీలో లేడు. ఆయన ఆగస్టు మాసంలో కాశ్మీరు, పంజాబులలో తిరిగి, కలకత్తా చేరుకున్నాడు. కలకత్తాలో ఆయనకు హిందూ, ముస్లిం సఖ్యత కనబడింది. రెండు దేశాల జెండాలు పక్కపక్కనే ఎగిరాయి. ఆయన ప్రార్థనా సమావేశానికి 4 లక్షలమంది హాజరయారు.

కాని అంతలో మత విద్వేషం పెచ్చరిల్లింది. ఆగస్టు 31 రాత్రి హిందువుల తండా వచ్చి ఆయన బసమీద పడింది. ఆయనకు లాఠీ దెబ్బ వెంట్రుకవాసిలో

తప్పింది. సెప్టెంబరు 1 న ప్రారంభించి, శాంతి నెలకొనేదాకా నిరశనం ఉంటానని ఆయన ప్రకటించాడు. ఆమాటతో కలకత్తాలో శాంతి ఏర్పడింది. గుప్తంగా దాచిన ఆయుధాలు బయటికి వచ్చాయి. సఖ్యంగా ఉంటామని ఉభయమతాలవారూ ప్రమాణాలు చేశారు. కలకత్తా నిరశనం అంతర్జాతీయ ఖ్యాతి ఆర్జించింది.

ఇదే కారణానికి గాంధీ ఢిల్లీలో ఉపవాస దీక్ష అవలంబించవలసి వచ్చింది. పంజాబునుంచి 50 లక్షలమంది హిందువులూ, సిక్కులూ కాందిశీకులై వచ్చేశారు. ఢిల్లీ చుట్టూ శరణార్థుల శిబిరాలున్నాయి. వారు "క్షమించే" స్థితిలో లేరు. ఢిల్లీలో ముస్లిములను చూసినప్పుడల్లా వారికి తమపాట్లు గుర్తొస్తున్నాయి. అరాచకచర్యలు జరగకుండా ఢిల్లీ ప్రభుత్వం తగు చర్యలు తీసుకున్నా, ఢిల్లీ వాతావరణం అశాంతంగానే ఉన్నది.

ఆ స్థితిలో గాంధీ నిరశనం ఆరంభించాడు. ఈ దీక్షయొక్క సత్ఫలితాలు పశ్చిమ పంజాబులోకూడా కనిపించి, ముస్లింలీగు ప్రభుత్వపు మన్ననలు లభించాయి. 1948 జనవరి 18 న ఢిల్లీలోని వివిధ వర్గాలవారూ, పార్టీలవారూ గాంధీ ఎదుట ఢిల్లీలో శాంతి కాపాడతామని ఒప్పందం చేసుకున్నారు.

తరవాత 12 రోజులకు గాంధీ ప్రార్థనాస్థలానికి వస్తూండగా గోడ్సే ఆయనను సమీపించి, నమస్కారం చేసేవాడిలాగా నటించి, పిస్తోలు తీసి, వరసగా మూడు సార్లు ఆయనను కాల్చాడు. "హే రాం," అంటూ గాంధీ పడిపోయాడు.

యావజ్జీవితం అహింసకోసం జీవించినవాడు హింసకు గురిఅయాడు. మతసామరస్యంకోసం ఆరాటపడినవాడు స్వమతస్థుడి చేతిలో ప్రాణాలు వదిలాడు. గాంధీ చితి మీద మతవైషమ్యమే కాలి ఆహుతి అయింది.

---

## మహాత్ముని స్వప్నదర్శనము

పరమదరిద్రులును తమదిగా దేశమును భావించుకొన జాలునట్టియు, దాని నిర్మాణమున వారిపలుకుబడి చెల్లునట్టియు, ఉచ్చనీచ విభాగము ఉండనట్టియు, అన్ని కులములవారును పూర్ణ సామరస్యమున జీవింప జాలునట్టియు, భారత దేశ ప్రాభవమునకై నేను కృషిచేసెదను. అట్టి భారతములో అస్పృశ్యతా పీడ ఉండదు; మాదకద్రవ్య, సారాయముల పీడన ముండదు. పురుషుల హక్కులే స్త్రీలకును ఉండును. ఇదే భారత దేశమును గూర్చిన నా స్వప్నదర్శనము.



# ప్రశ్న

'ఆర్తి'

సంజీవి కూచున్న అరుగు ముందునుంచి ఓ లారీ వెళ్ళింది. అంతకుముందు ఓ బండి వెళ్ళింది. వాటి రెండింటికీ మధ్య ాలుగు పందు లెళ్ళాయి ... అన్నిటినీ ాశాడు.

ఈ మధ్య స్కూళ్లు లేకపోవటంవల్ల ోచన ఎక్కువైంది సంజీవికి. దీని ంచిదానిగురించి...అనేకాదు, అన్నిటి ంచి. గడియారం పన్నెండు గంటలే ంకు కొట్టాలి? పదమూడు గంట ంకు కొట్టకూడదు? ఇలా. రాత్రిళ్ళు లేని అనవసర ప్రశ్నలతో ఓ అర గంట తండ్రిని చంపుకు తింటున్నాడు కూడా....

స్కూలు లేకపోవటం మొదట్లో సరదాగా ఉంది సంజీవికి. ఉంచనుకుని స్కూలుకు వెళ్ళటం, లేదని చెప్పేటప్పటికి హోలోమని గుంపుగా బయటికిరావటం, కాస్సేపు రోడ్డుమీద అందరితోపాటే అరుస్తూ తిరగటం. కాని రాను రాను ఏంతోచక చిరాకు ఎక్కువయింది. 'అసలు స్కూళ్ళు ఎందుకు మూసేయటం?' అదే తండ్రి నడిగితే ఏవేవో చెప్పాడు. ఆ చెప్పింది నచ్చలేదు సంజీవికి...

తనకి స్కూలుకి వెళ్ళాలని లేనిరోజున స్కూలు మూసేయమంటే వీళ్ళు మూసేయనప్పుడు, వాళ్ళు వద్దన్నప్పుడుకూడా తను మానేయటం ఏంబాగుండ లేదనిపించింది. "అసలు కుర్రాణ్ణని అందరూ చిన్నతనంగా చూస్తున్నార" నిపించింది సంజీవికి...

ఇటువంటి ఆలోచనల్లోనే లారీ వెడుతుంటే చూశాడు. అందులో ఇటుకలున్నాయి.

"లారీ ఇటుకల్ని తీసుకెడుతోంది" అనుకున్నాడు...

కాస్సేపటికి ఇంకో బండొచ్చింది. దాన్నిండా దూలాలున్నాయి. వీధి మలుపు దగ్గర ఆగిపోయింది బండి.

బండివాడు ఇంకో ముగ్గురు మీదికి విసురుతున్నారు దూలాల్ని ... చిత్రంగా చప్పుడవుతోంది.

అరుగు దిగి గబగబా పరిగెట్టుకెళ్ళాడు సంజీవి. అలా ఓ దూలంమీద ఇంకో దూలంపడి కొద్దిగా పైకి ఎగరటం బలే బాగుంది సంజీవికి ... చాలాసేపు చూశాడు.

ఇంటికెళ్ళి భోంచేసిన తర్వాత మళ్ళీ వచ్చాడు. రోడ్డు మలుపు తిరగ్గానే విశాలంగా ఖాళీస్థలం ఉంది. కొంతమంది చిన్నచిన్న గోతులు తవ్వి దూలాలు పాత్తున్నారు.

'ఎవరిదేనా పెళ్ళేమో' అనిపించింది సంజీవికి.

మర్నాడుకూడా చూశాడు. పెద్ద షామియానా వేశారు. ఓ పక్క ఎత్తుగా బల్లలూ అవీ పేర్చి మండపంలా తయారు చేశారు. ఇదంతా చూస్తుంటే మంచి కాలక్షేపంలా తోచింది సంజీవికి.

సాయంత్రంవరకూ చూసేటప్పటికి ఎవరి పెళ్ళో, ఏమిటో తెలుసుకోవాలనిపించింది.

నెమ్మదిగా, పొద్దున్నించి పనిపాటలు చేస్తున్న వాళ్ళమీద అజమాయిషీ చేస్తున్న ఒకాయన దగ్గరకెళ్ళి నిలబడ్డాడు.

నెమ్మదిగా అడిగాడు.

"ఏదేనా పెళ్ళాండీ!'' అని...

అతను ఓ క్షణం ఆశ్చర్యంగా చూసి నెమ్మదిగా నవ్వాడు. అవునన్నట్టు తలూపాడు. తరవాత "గాంధీగారి పెళ్ళి" అన్నాడు మళ్ళీ నవ్వుతూ...

తిరిగి ఇంట్లోకి వచ్చేవరకు ఆలోచన సాగుతూనేఉంది సంజీవికి. గాంధీగారి గురించి పాఠాల్లో చదువుకున్నాడు. ఆయన్ని గాడ్సే కాల్చిచంపేసింది కూడా చదువుకున్నాడు. 'మరి చచ్చిపోయిన గాంధీగారి పెళ్ళేమిటి?'...ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా అర్థంకాలేదు. "నాన్నగార్ని అడగాలి రాత్రికి'' అనుకున్నాడు.

రోజూ ఈ మధ్యన సంజీవి అడుతున్న ప్రశ్నలకి చిరాగ్గాఉంది రనాథానికి. ఆఫీసులో చచ్చిరాగానే డిక్కడ చంపటంతో కోపం కవస్తోంది. కాని పన్నిండేళ్ళ ఆ వయః తెలుసుకోవాలన్న కుతూహలం ఉం

ముందు ముందు సంజీవికి బాగా ఉపయోగ పడుతుందని ఓపిగ్గా సమాధానాలు చెప్పు తున్నాడు. కాని...

..."నాన్నగారూ...మన వీధి చివర చేపు గాంధీగారి పెళ్ళి చేస్తున్నారు" అన్నప్పుడు నవ్వొచ్చింది రంగనాథానికి. నవ్వాడుకూడా...

తండ్రి నవ్వు చూసి చిన్నబుచ్చు కున్నాడు సంజీవి.

వాడు చిన్నబుచ్చుకోవటం చూసి అన్ని సంగతులు విడమర్చి చెప్పాడు రంగనాథం.

అది గాంధీగారి పెళ్ళికాదని...ఆయన నూరవ జన్మదినోత్సవ సందర్భంగా జరుపుతున్న ఉత్సవమని, ఇంకా గాంధీ గారి గురించి కొన్ని వివరాలు చెప్పాడు.

అన్నీ విన్న సంజీవి ... మరి గాంధీ గారి ఈ ఉత్సవం ఎవరు చేస్తున్నారని అడిగాడు.

"గాంధీగారి అభిమానులు" అన్నాడు ఏం చెప్పాలో తోచక రంగనాథం... "గాంధీగారి అభిమాను లెవరని" తడుము కోకుండా సంజీవి అడుగుతాడని తెలుసు.

అందుకనే కులమత భేదంలేని వాళ్ళు, ...బద్ధం ఆడనివాళ్లు, నీతినిజాయితీల మీద ...రవం ఉన్నవాళ్లు...ఇలాంటి వాళ్లంతా ...మనకి అభిమానులని విడమర్చి ...ప్పాడు రంగనాథం.

* * *

...ర్నాడు సంజీవి బలవంతంవల్ల, ...రం సెలవకావటం మూలంగా ...వితో కలిసి వెళ్ళాడు రంగనాథం.

కొందరు రాజకీయ నాయకులు... పదవిలో ఉన్నవాళు, లేనివాళ్లు, ఖద్దరు బట్టల్లో మెరిసిపోతూ వచ్చారు. గంభీ రంగా ఉపన్యాసాలిచ్చారు. ఉత్సవం గొప్పగా జరిగింది.

ఆ ఉత్సవాన్ని అంత జయప్రదంగా నిర్వహించిన నరిసింహులికి, వెంకట రావుకి, సోమయాజులుగారికి అందరూ అభినందనలు తెలిపారు.

కాని రంగనాథానికి భయంవేసింది... సంజీవి ఆ ప్రశ్న అడుగుతాడేమో అని.

గాంధీగారి అభిమానులు చేస్తారన్నా పుగా ఉత్సవం...నల్లబజారు వ్యాపారంలో చేయితిరిగిన వెంకట్రావు, గుడంబా వ్యాపారంలో దిట్ట నరిసింహులు, నిత్యం ప్రతిదానికి నక్కజిత్తులతో అబద్ధాలని అవలీలగాఆడే ఛాందసుడు సోమయాజులు గారు, ఎందుకు చేశారు ఉత్సవం అని.

గాంధీగారి అభిమానులు అంటే ఆయన చెప్పినవి నోటితోటే ఉపన్య సించి, చేతల్లో ఆయనకి దూరంగా ఉండేవారా అని.

కాని సంజీవి అడగలేదు. పన్నెండేళ్ళ సంజీవికి వాళ్ళగురించి ఏమీ తెలియదు. ఏదో పెళ్లి చూసినట్టే చూశాడు ఈ ఉత్సవాన్నికూడా...కాని తెలివైన కుర్రా డికి జవాబు చెప్పాల్సొచ్చే తండ్రిగా, ఆ ప్రశ్నలు సంజీవి అడక్కపోయినా రంగనాథం భయపడ్డాడు. భయపడి తొందరగా సంజీవిని తీసికెళ్లిపోయాడు అక్కడనుంచి.

# తెలుగు భాష

సింగపటం అనే గ్రామం నిడదవోలుకు ఒకటిన్నర మైళ్ళ దూరమున తూర్పు గోదావరి జిల్లాలోవుంది. కీ. శే. చక్రయ్యగారిదీ వూరే. అన్న పిల్లలపై చక్రయ్యగారికి చాలా ఆప్యాయత. వారి భవిష్యత్తును గురించి చాలా ఆందోళన వుండేది. ఇది గుర్తెరిగిన ప్రభాకర్‌జీ బాపూజీ అనుమతితో చక్రయ్యగారి అన్న కుమార్తె అనసూయను ఆశ్రమానికి తీసుకరావటానికి ఏర్పాటు చేశారు. గాంధీజీకి సన్నిహితులైన శ్రీ ఆర్. కె. రాంగారు అనసూయ నెత్తుకొని ఆశ్రమానికి తెచ్చారు.

ఒకనాడు రాత్రి అనసూయకు చెవిపోటు వచ్చింది. చెవి చీముపోసింది. బాగా జ్వరం వచ్చింది. అనసూయ ఏడ్పు ఆరంభించింది. చెవిపోటు చెవిపోటు అంటూ ఒక్కటే పెట్టున ఏడుస్తున్నది. ఆమెకు హిందీరాదు. చిమ్మన్‌లాల్‌భాయికి తెలుగు రాదు. "ఎందుకేడుస్తున్నావ్ ? ఏంకావాలి ? ఏడవకు ? ప్రభాకర్‌జీని పిలువనా ?" అంటూ ఆయన పలుమారులు ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించారు. ఓదార్చేకొద్దీ ఆమె ఏడ్పు ఎక్కువైందే కాని తగ్గలేదు. చెవిపోటు చెవిపోటు అని పెద్దపెట్టున ఏడుస్తోంది. చివరకు చిమ్మన్‌లాల్‌భాయ్ ఒక ఉపాయం కనిపెట్టాడు. ఆ పిల్ల అంటున్న మాట భద్రంగా తీసుకపోయి "ప్రభాకర్‌జీ! అనసూయ ఒక్కటే పెట్టున ఏడుస్తోంది. చెవుటోపి చెవుటోపి అంటూంది. దీని అర్థం ఏమిటి" అన్నారు.

ఇరువురు అనసూయ దగ్గరకు వచ్చారు. అనసూయ యింకా ఏడుస్తూనే వుంది. ప్రభాకర్‌జీ అడిగారు. చెవిపోటని ఆ పిల్ల చెప్పింది. ప్రభాకర్‌జీ ఆమెను ఆసుపత్రికి తీసుకపోయి చెవి శుభ్రపరిచి మందువేశారు. చెవిబాధ తగ్గిపోయింది.

ఈ విషయం మర్నాడు ఉదయం బాపూజీకి ప్రభాకర్‌జీ చెప్పారు.

బాపూజీ నిత్యం వాహ్యాళినుంచి తిరిగి వచ్చేటప్పుడు రోగుల్ని చూస్తారు. చిమ్మ. లాల్‌భాయ్‌కి ఉబ్బసముంది. అందుచేత బాపూజీ చిమ్మన్‌లాల్‌జీ వుండే యింటికివ. కుశలప్రశ్నలు వేసి పోతుంటారు. అనసూయకు చెవిపోటువచ్చిన మర్నాటి వుదయ చిమ్మన్‌లాల్‌జీని చూడటానికి బాపూజీ వచ్చారు. అప్పుడు ప్రభాకర్‌జీ ఆ( జరిగిన కథ చెప్పారు. బాపూజీతోపాటు అందరూ గొల్లున నవ్వారు. నవ్వుతూ బా. అచ్చటనుండి కదలి వెళ్ళుతూ, "తెలుగు భాషను అంతవరకైనా జ్ఞాపకం కున్నారుకదా?" అన్నారు తృప్తిగా. [ఊట్ల కొండయ్యగారి 'గాంధీ పథం'న



# ప్రేమలో పగ

తాళ్ళూరు నాగేశ్వరరావు

సాయంత్రం అయిదు గంటలకు ఆఫీసులువొదులుతారు. అప్పట్నుంచీఆవీధి సందడిగా ఉంటుంది. ఆ సందడిని చూడటానికి వసంతలక్ష్మి వీధి కిటికీదగ్గర చేరుతుంది. మునిమాపు వేళదాకా ఆ కిటికీలోనే కూర్చుని వచ్చేపోయే జనాన్ని కళ్ళు కాకరకాయలంత చేసుకొని చూస్తుంది. అది ఆమెకు గొప్ప కాలక్షేపం. ఈ లోపల వదినె పిలిచినా, వదినె పిల్లలు కేకలేసినా, అన్నయ్య ఆఫీసు నుంచి వచ్చినా, పిడుగుపడినా, భూకంపం వచ్చినా — ఆ కిటికీ బయటనుంచి కళ్ళు తిప్పదు; ఆ కిటికీ దగ్గర్నుంచి కాళ్ళు కదల్చదు. అది ఆమె దినచర్య.

అట్లా కూర్చోడం మొదట్లో. ఆమెకు కాలక్షేపంగా తోచినా, క్రమేపీ అలవాటై, ఆ టైము వచ్చేసరికి తప్పనిసరి కావొచ్చింది. అందుకు బలమైన కారణం లేకపోలేదు. అయిదుగంటల ఆరు నిముషాలకు — టెర్లిన్ గొట్టాం ప్యాంటూ, వొంటికి గమ్‌తో అంటించినట్లున్న బిగుతైన టెర్లిన్ శ్లాకూ ధరించి, ముక్కుమీదకు తొంగిచూసే వొదులైన క్రాపుతో, సన్నగా, గాలి సహాయంతో నడిచే ఓ పాతికేళ్ళ పెళ్ళికాని పిల్లవాడు అడే. దారిన పోతాడు. కిటికీలో కూర్చున్న కన్యకేసి కళ్ళెత్తి, నుదురు చిట్లించి, పెదవులు కదిలించి — మరీ చూస్తాడు. ఆ

చూపుకు వసంతలక్ష్మి హృదయంలో కలువ పువ్వు విచ్చుకుని కిలకిలా నవ్వుతుంది. అతగాడు బిలబిలా నవ్వుతాడు.

ఆ సన్నివేశం శతదినోత్సవం చేసుకోబోతూన్న సినిమాలా మూడు మాసాల్నుంచీ జరుగుతోంది. ఇరువురి చూపులూ కలిశాయి; ఇరువురి మనస్సులూ ఒకటైనాయి. కాని శరీరాలే చేరువకాలేదు.

చూడటానికి ఆ యువకుడు పోకిరీగా, రౌడీగా, తీన్ తేరా ఆర్ అఠారాగా కనబడతాడు. చదువుతున్నాడో, ఉద్యోగం చేస్తున్నాడో, వ్యాపారం చేస్తున్నాడో, సినిమాల్లో వేషాలకోసం ప్రాకులాడుతున్నాడో, రోడ్ల సర్వేలో కాలం వెళ్ళబుచ్చుతున్నాడో – ఏమీ ఆమెకు తెలియదు. తనకు పెళ్ళికాలేదనీ, తల్లిదండ్రులు లేరనీ, అప్పర్ డివిజన్ క్లర్కుగా ముగ్గురు పిల్లలతో జీవిత శకటాన్ని దొర్లిస్తున్న అన్నయ్య పంచనే పడివుంటూన్నదనీ, కట్నం యిచ్చుకోలేని మిష మీద మూడు సంబంధాలు జారిపోయాయనీ – అతనికి తెలుసో, లేదో ఆమెకు తెలియదు. అయినా ఆ షోకిల్లాను ఆమె గాఢాతి గాఢంగా ప్రేమించింది. రోజూ అతన్ని చూడటానికి అలవాటుపడింది. ఆ అలవాటుద్వారా మానసికమైన ఆనందాన్నీ, తృప్తినీ పొందసాగింది.

ఆరోజు సాయంత్రం కూడా వసంతలక్ష్మి యధాతధంగా కిటికీలో కూర్చుని వీధిలోకి చూడసాగింది. ఆ యువకుడు కవ్వింపు చూపులతో ప్రత్యక్షమైనాడు. ఆమె మొహంపై సంతృప్తికరమైన చిరునవ్వు వెలిగింది. ఆ చిరునవ్వుకు ఆమె మొహం ఇష్టే వెడల్పయింది. అది ఆసరాగా తీసుకొని ఆ యువకుడు ఓ చీటీని కిటికీలోకి విసరివేశాడు. ఆ తర్వాత మామూలుగా నడిచి ముందుకెళ్ళాడు.

వసంతలక్ష్మి ఆనందంతో తబ్బిబ్బు అయి ఆచీటీని విప్పిచూసింది.

ప్రియమైన...

రేపుసాయంత్రం పబ్లిక్ గార్డెన్‌కు రా. తీరిగ్గా మాట్లాడుకుందాం. నీకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తూ వుంటాను.

—ప్రేమనాథ్.

వసంతలక్ష్మి గుండె కొన్ని క్షణాలపాటు టపటప కొట్టుకున్నా, ఆ తర్వాత తమాయించుకుంది. ప్రియుడ్ని కల్సుకొనేందుకే గట్టిగా నిశ్చయించుకుంది. ఆ క్షణంనుంచీ మరునాటిసాయంత్రంవరకూ ఆమె ప్రియుణ్ణి గురించీ, కల్సుకోవడంలోని 'త్రిల్'ను గురించీ నిర్విరామంగా ఆలోచిస్తూనే ఉంది. సంతోషంతో స్వర్గలోకపు సరిహద్దులలో విహరిస్తూనేఉంది.

మరునాడు సాయంత్రం నాలుగున్నర గంటల్నుంచీ ముస్తాబు మొదలెట్టింది వసంతలక్ష్మి. సెంచరీమిల్స్ నేవీబ్లూ ప్రింటెడ్ చీర కట్టింది. 'వి'నెక్ మ్యాచింగ్ జాకెట్టు వేసుకుంది. తనకు గల ఒకే ఒక బంగారు సాదా నెక్‌లెస్




వేసుకుంది. గోడకు తగిలించిన అద్దం ముందు నిలబడి స్నో, పౌడర్లు పట్టించింది. నాలుగున్నమ్మప్పావుకు ఆఫీసునుంచి అన్నయ్య వచ్చాడు. అప్పటికే వదినె, పిల్లలుకూడా తయారైనారు. వసంతలక్ష్మి ఆశ్చర్యపోయింది. ఆమెకు మతి పోయినట్లయింది. వదినెను అడిగింది.

"సంగనాచి తుంగబుర్ర! నీకు తెలియదేమిటె పిల్లా! నువ్వెక్కడికి, ముస్తాబు అవుతున్నావో, మేమూ అక్కడికే!" అన్నది వదిన వయ్యారంగా.

వసంతలక్ష్మి విస్తుబోయింది.

"అంటే?"

"మరీ విడ్డూరం పోతున్నావే వసంతా! నీకు మీ అన్నయ్య చెప్పలేదా?– ఇవాళ అందరమూ సినిమాకు వెళదామని."

వసంతలక్ష్మి లేతహృదయంలో ఈత ముల్లు గుచ్చుకుంది. గింజుకుంది.ససేమిరా సినిమాకు రానన్నది. ఓ స్నేహితురాలింటికి వెళ్ళాలన్నది. సినిమా చూడాలనే కాంక్ష లేదన్నది. అన్నయ్య, వదినెలు ఎంత బ్రతిమాలినా ఆమె వినలేదు. అయిదుంబావుకు బయలుదేరి, సిటీ బస్సులో పబ్లిక్ గార్డెన్‌కు వెళ్ళింది.

గేటుదగ్గర ఆజీలుగా నిలబడ్డాడు ప్రేమనాథ్. ఆమెను చూడగానే తన్మయత్వంతో ఉబ్బితబ్బిబ్బు అయినాడు. రోడ్డుమీద పోతున్న టాక్సీని పిలిపించాడు.

"ఎక్కడికి వెళదాం?" అన్నది వసంతలక్ష్మి అమాయకంగా.

"ఇక్కడేముంది? పచ్చగడ్డీ, పచ్చని చెట్లూ, హైదరాబాద్‌లో స్వర్గం ఎక్క

డుందో అక్కడకు తీసికెళతాను. తర్వాత ఇక్కడకు వద్దంటే'' అన్నాడు ప్రేమనాథ్ జోరుగా.

వసంతలక్ష్మికి ఆ మాటల్లో అర్థం ఓపట్టాన బోధపడలేదు. బిత్తరపోయి ప్రియునికేసి చూసింది.

టాక్సీ తలుపు తెరిచి, "ఎక్కు వసంతా" అన్నాడు ప్రేమనాథ్. యాంత్రికంగా వసంత ఎక్కికూర్చుంది. ఆమె మనస్సు మారుమూలల్లో ఎర్రచీమలు పాకులాడుతూనే ఉన్నాయి. ఎరిగిన వాళ్ళు ఎవరైనాచూస్తే - ఏమనుకుంకుంటారు? కాని ఆ భయాన్ని నొక్కిపట్టుకుంది. తన ప్రేమికునికోసం ప్రపంచాన్నే ధిక్కరించే ఆవేశం, పట్టుదలా ఆమెలో ఉన్నాయి.

టాక్సీ నేరుగా 'త్రీఏసెస్' బార్ అండ్ రెస్టారెంట్ దగ్గరకెళ్ళి ఆగింది. ప్రేమనాథ్ దిగి, ఆమె చేయిపట్టుకొని లోపలకు తీసికెళ్ళాడు. అతని చేతి మణికట్టుకు ఏదో కట్టుకట్టి ఉంది.

"ప్రేమ్, ఏమిటా కట్టు?" అన్నది వసంతలక్ష్మి దొరవగా.

"ఓ అదా! నిన్న మోటర్ సైకిల్ మీద చిన్న యాక్సిడెంటు జరిగింది," అన్నాడు ప్రేమనాథ్.

బార్ లోకి వెళ్ళగానే వసంతలక్ష్మి మతిపోయినట్లయింది. ఆ సోఫాలూ, డిమ్ లైట్లూ, ఎయిర్ కండిషన్ వాతావరణము, రకరకాల మందుల వాసనలూ, అక్కడ కూర్చున్న మనుషులూ—అంతా నిజంగా స్వర్గలోకంలో ఉన్నట్లే ఉంది. మైక్ దగ్గర ఓ ఆంగ్లో ఇండియన్ యువతి నిలబడి ఇంగ్లీషు పాటలు పాడుతోంది - చిన్నగా డాన్సు చేస్తూంది. యూనిఫారమ్ లో ఉన్న పదిమంది మ్యూజిక్ యిస్తున్నారు ఆ పాటలకు.

ఓ మూలకు తీసికెళ్ళాడు ప్రేమనాథ్ ఆమెను. లైట్లు మరీ డిమ్ గా ఉన్నాయి.

"ఇక్కడ కరెంటు తక్కువా? మరీ లైట్లు అంత నిద్రబోతున్నట్లున్నాయి" అన్నది వసంతలక్ష్మి.

ప్రేమనాథ్ విరగబడి నవ్వాడు.

"ఇది నిషాకు నిలయం. నిషాకూ, లైటు కాంతికీ పడదు. కళ్ళు బేజారెత్తిపోతాయి. అందుకే లైట్లు డిమ్ గా అట్టేపెడతారు."

బేరర్ వచ్చాడు. మెనూకార్డు ఇచ్చాడు. అది చూసి ప్రేమనాథ్ వైట్ హార్స్ స్కాచ్ విస్కీ ఓ నిప్ కూ, గోల్డెన్ ఈగిల్ బీరు బాటిలుకూ ఆర్డరిచ్చాడు. చికెన్ పకోడా, చికెన్ బిరియానీ, తాండూరీ చికెన్ తీసుకురమ్మన్నాడు.

విస్కీ వాసనను భరించలేకపోయింది వసంతలక్ష్మి. తాగమని బలవంతంచేశాడు ప్రేమనాథ్. కాని ఆమె పుచ్చుకోలేదు. బీర్ కాబోలు ఓ అరగ్లాసు పుచ్చుకుంది. అప్పటికే ఆమె కడుపులో వేపనూనె తాగినట్టు తెమిలింది.



బాగా చీకటిపడేవరకూ వాళ్లు అక్కడే ఉన్నారు. ప్రేమనాథ్ బాగా నిషా ఎక్కేవరకూ గ్లాసుమీదగ్లాసుతాగాడు. తిన్నాడు. ఏవేవో మాట్లాడాడు. అరిచేతిలో స్వర్గం చూపెడతానన్నాడు. ఆమె నడుంచుట్టూ చేయివేసి రెండుమూడుసార్లు దగ్గరకు లాక్కోబోయాడు. కాని ఆమె జాగ్రత్త పడింది.

వందరూపాయలకు పైన బిల్లు అయింది. జేబులోంచి పర్సు తీశాడు. ఆ పర్సులో వందరూపాయలనోట్లు బోలెడన్ని ఉన్నాయి. ఆ నోట్లనుచూసి వసంతలక్ష్మి అప్రతిభురాలైంది. బేరర్ కు మూడురూపాయల టిప్ ఇచ్చాడు.

"అబ్బా! ప్రేమనాథ్ కు డబ్బంటే లక్ష్యంలేదు. కుళాయిలోని నీళ్ళలాగ ఖర్చుపెడతాడు" అనుకుంది వసంతలక్ష్మి.

"ప్రేయసీ! పద. చల్లగాలిలో కులాసాగా విహరిద్దాం" అంటూ లేచాడు ప్రేమనాథ్.

మళ్లీ టాక్సీలో ఆమెను పబ్లిక్ గార్డెన్ కు తీసుకొచ్చాడు ప్రేమనాథ్. మెర్క్యూరీ దీపాలకాంతిలో పబ్లిక్ గార్డెన్ దేవేంద్రలోకంలో ఉద్యానవనంలా కనబడింది ఆమెకు. పచ్చనిగడ్డిలో అతని వొళ్లో కూర్చుని—అతను చెప్పే కబుర్లు వింటూంటే, స్వర్గము ఎక్కడోలేదు—

ఈ భూమిమీదనే ఉన్నదన్న మిథ్యాభావం ఆమెకు కలిగింది. కౌగిలింతలతో, ముద్దులతో శరీరాన్ని సిల్కుగుడ్డలా అతగాడు నలిపివేసినా—ఆమె ఏమాత్రం అభ్యంతరం చెప్పలేదు. రాత్రి పదిగంటలవరకూ వాళ్లు అక్కడే ఉన్నారు.

"ఇక వెళదాం" అన్నది వసంతలక్ష్మి అతని వొళ్లోంచి లేస్తూ.

"మళ్లీ రేపు మనం ఇక్కడ కలుసుకుందాం" అన్నాడు ప్రేమనాథ్.

"మళ్లీనా ?"

"అవును. మన వివాహం అయ్యేవరకూ రోజూ ఇక్కడే కలుసుకుందాం."

వసంతలక్ష్మి సిగ్గుపడింది. ఆ సిగ్గు దొంతరలలోనే ఆమె పెదవులనుంచి "సరే" అన్న అంగీకారం వెలువడింది.

టాక్సీలో ఆమెను ఇంటిదగ్గర దిగవిడిచాడు ప్రేమనాథ్. 'చీరియో' అంటూ హుషారుగా ఆ వీధిలో చివరవున్న తన ఇంటికి వెళ్లాడు.

ఆ రాత్రంతా వసంతలక్ష్మి పక్కమీద అటూఇటూ దొర్లుతూ ప్రియుణ్ణిగురించి భావాత్మక ప్రేరణలతో కలలుగన్నది.

*　　*　　*

కలల బరువుతో, ఆలోచనల తీయదనంతో వసంతలక్ష్మి మరునాడు బారెడు పొద్దెక్కిన తర్వాతగాని పక్కమీద నుంచి లేవలేదు. కాఫీ త్రాగాక ఆనాటి దినపత్రిక చూస్తూ కూర్చుంది. ఆ పత్రికలో ఒకవార్త ఎందుకో ఆమె మనస్సును చివుక్కుమనిపించింది: "నిన్న మధ్యాహ్నం ఇసామియా బజార్‌లో ఒక ముసలాయన దగ్గర్నుంచి ఓ యువకుడు పట్టపగలు పదిహేనువందల రూపాయలు దోచుకున్నాడు. ఆ యువకుడు సన్నగా గాలికి పడేట్టు వుంటాడు. అతనికోసం నగరంలో పోలీసులు గాలిస్తున్నారు."

అది చదవగానే వసంతలక్ష్మి మనస్సులో హఠాత్తుగా ప్రేమ్‌నాథ్ మెదిలాడు. ఆమె మనస్సు రవరవ లాడిపోయింది. అతను కాకూడదు. ఛీ, తను అనవసరంగా అనుమాన పడుతూంది. తన ప్రేమ్‌నాథ్ మంచివాడు. పైకి రౌడీగా కనిపించినా, మనస్సు శ్రేష్ఠమయినదనుకొని సరిపెట్టుకొనేందుకు ఆమె ఆ సాయంత్రంవరకూ ప్రయత్నిస్తూనే ఉంది.

అన్నయ్య ఆఫీసునుంచి ఇంటికి రాకముందే వొదినెకు మాయమాటలు చెప్పి, అయిదున్నరకు పబ్లిక్‌గార్డెన్సుకు వెళ్లింది వసంతలక్ష్మి - ప్రేమికునికి యిచ్చిన వాగ్దానం ప్రకారం.

ఆమెకోసం ఎదురుచూస్తూ గేటులో ప్రేమనాథ్ లేడు. ఇంకా రాలేదేమో అనుకుంటూ వసంతలక్ష్మి లోపలకు వెళ్ళింది.

కొంచెం దూరంగా థాలియా పూల చెట్ల చాటున ఎవరో యువతి కౌగిలిలో ఉన్న ప్రేమనాథ్‌ను చూసి ఆమె విద్యుద్ఘాతానికి గురైంది. నిశ్చేష్టురాలై నేలకు



అంటుకుపోయింది ఆమె. నిర్ధారణ కోసం మళ్ళీమళ్ళీ చూసింది. అతను నిజంగా ప్రేమనాథే! తను ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తూన్న ప్రేమనాథ్! నిన్నటి దినాన తన కౌగిలిలో వున్న ప్రేమనాథే! ఇవాళ _ తన స్థానంలో మరో యువతి. ఛీ. ఛీ. ఎంత మోస గాడు? దుర్మార్గుడు. వంచకుడు. ఇడి యట్. బ్రూట్.

ఆ పైన ఓ క్షణం అక్కడ నిలబడ లేకపోయింది. ఒక ప్రక్కన ప్రేమలో దగా తాలూకు ఉక్రోషం; మరో పక్కన తనని దమ్మనమని ఇంకో యువతితో కులకడంవల్ల కలిగిన కోపం—ఆమెను గింగిరాలు తిప్పినాయి. ఆమెలో ప్రతీకార ద్వేషం ఘగఘగ మంటల్ని ప్రజ్వరిల్ల జేసింది.

వసంతలక్ష్మి దగ్గర్లోవున్న పోలీసు స్టేషనుకు నేరుగా వెళ్లింది. సబ్ఇనస్పె క్టరు ఎదుట నిలబడింది.

"ఏంకావాలి?" అన్నాడు యస్. ఐ.

"నిన్న ఇసామియాబజార్లో ఒక

ముసలాయన్ను ఓ యువకుడు కొట్టి, పదిహేను వందల రూపాయలు దోచుకున్నాడట.''

''అవును. అవును.''

''ఆ యువకుణ్ణి నేను పట్టిస్తాను.''

''ఎక్కడున్నాడు?''

''రండి, నావెంట.''

పబ్లిక్‌గార్డెన్‌లో ఓ యువతి వోళ్లో తలవాల్చి ప్రేమ సంభాషణల్లో నిమగ్నుడైవున్న ప్రేమనాథ్‌ను అంతదూరంలో నిలబడి చూపెట్టింది వసంతలక్ష్మి. సబ్ ఇనస్పెక్టరు వెంటనే వెళ్లి అతన్ని పట్టుకున్నాడు. స్టేషనుకు తీసుకువచ్చాడు. ఓ తడి తగిలించేసరికి — ఆ దోపిడీచేసినట్లు ఒప్పుకున్నాడు ప్రేమనాథ్.

''నేర పరిశోధనలో మీరు మాకెంతో సహాయంచేశారు. పోలీసు డిపార్టుమెంటు తరపున మీకు బహుమానం ఇప్పిస్తాను'' అన్నాడు సబ్ ఇనస్పెక్టరు ఆమెతో.

వసంతలక్ష్మి బావురుమన్నది. గబగబా పోలీసు స్టేషన్నుంచి బయటకువచ్చింది.

పోలీసు డిపార్టుమెంటుకోసం, సంఘంకోసంకాదు తను ప్రేమనాథ్‌ని పట్టించింది. తనని మోసం చేశాడు. తన హృదయాన్నీ, ప్రేమనూ ఆటబొమ్మగా భావించి—దగా చేశాడు. పగదీర్చుకుంది. అంతే!—తనకు బహుమానం దేనికి?—అనుకుంది వసంతలక్ష్మి మనస్సులో కన్నీళ్ళు కారుస్తూ.

---

## సామ్యవాది గాంధీ

''పిపీలికాన్నికూడా నొప్పించని సోషలిస్టులనూ, కమ్యూనిస్టులనూ నేనెరుగుదును. అయితే, ఉత్పత్తి సాధనాలన్నీ విశ్వమానవ యాజమాన్యానికి చెందినవనే వారి విశ్వాసం. అటువంటివారిలో నే నొకణ్ణిగా భావించుకుంటున్నాను.''

# పశ్చాత్తప్తుడు

'వైదేహి'



సాయంత్రపు అరుణకాంతుల నీడలు ఆ చెరువులోని నీటిలో ప్రతిబింబిస్తున్నాయి. బడి వదిలినతర్వాత అందరూ ఇంటి కెళ్ళినా, పదిసంవత్సరాల రవి మాత్రం ఆ చెరువుగట్టున కూర్చుని ఆలోచిస్తున్నాడు. అతనిది ఎదగని మనసు. వికసించని మొగ్గవంటి హృదయం. పౌరుషం ప్రతాపం వీటి అర్థాలు అతనికి తెలియకపోయినా అతను కార్యరూపంలో ఆచరించి చూపగల సమర్థుడు. ఈరోజు మధ్యాహ్నం క్లాసులో అతనికి జరిగిన అవమానాన్ని గురించే అతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అతనిలో ప్రతీకార వాంఛ తీవ్రంగా బాధిస్తూంది. రామలింగయ్య పంతులు పనిపట్టాలి. ఎలాగైనా సరే అతనిమీద కక్ష తీర్చుకోవాలి. ఇదీ అతని ఆలోచన.

క్లాసులో ఉపాధ్యాయుడు పాఠం చెబుతున్నాడు. అందరూ శ్రద్ధగా వింటున్నారు. వెనుకబెంచీలోని రవి మాత్రం పుస్తకంమీది అట్టమీద పిచ్చిపిచ్చిబొమ్మలు గీసుకుంటున్నాడు. ఇది గమనించిన రామలింగయ్య పంతులు రవిని మందలించడానికి చేతనున్న సుద్దముక్క అతనిమీదికి విసిరాడు. అది వెళ్ళి అతని ముక్కుకొనకు తగిలి చురుక్కుమనిపించింది. ముక్కు మంట పుట్టింది. కళ్ళమ్మట నీళ్ళువచ్చాయి.

"ఏరా రవీ! అందరూ పాఠాలు వింటూంటే నీవు మాత్రం పిచ్చిగీతలు గీసుకుంటూ కూర్చున్నావా?" అని ప్రశ్నించాడు.

రవి మౌనంగా లేచి నిల్చున్నాడు. "చిన్నతనంలో గాంధీ ఎలా ఉండేవాడో చెప్పరా?"

అప్పటి బోధనాంశమైన పాఠంలోని ప్రశ్న వేశాడు.

రవి జవాబివ్వలేదు.

"నీలాగే అల్లరిచేసేవాడు. అయినా పెద్దవాడయ్యేకొలది బాధ్యతలను గుర్తించి తన మనస్సును మంచివైపు మళ్ళించి మహాత్ముడైనాడు. ఓరీ కుంకా! నీవు కూడా గాంధీ అంతటివాడివి కావాలి" అన్నాడు రామలింగయ్య.

"మరైతే నన్నిప్పుడు అల్లరి చెయ్యనివ్వండి" అన్నాడు రవి.

ఈ మాటకు క్లాసులోని పిల్లలందరూ గొల్లుమన్నారు.

"రవీ! మంచిగా చెబితే వినవు. నీవసలు అక్కడ కూర్చుంటేనే కాదు. ఇలారా! ఈ ముందుబెంచీలో కూర్చో." రామలింగయ్య మందలింపు ధోరణిలో అన్నాడు.

"అదేం కుదరదు మాష్టారూ! నేనిక్కడే వుంటాను. నాకిక్కడే బాగుంటుంది." మొండిపట్టు పట్టినట్టు జవాబిచ్చాడు రవి.

"అంతా నీ ఇష్టమేం?" అంటూ రామలింగయ్య రవిచెవిపట్టుకొచ్చి అతన్ని ముందుబెంచీలో కూర్చోబెట్టాడు.

రవి మాష్టారు చెయ్యి విదిలించుకొని ఆ బెంచీలో కూర్చున్నాడు. అలా కూర్చున్న రవి తన ప్రక్కనున్నది తనతో విరోధం పెంచుకున్న రాముడని గుర్తించి, అదిరిపడ్డట్టు చివుక్కున పైకి లేచాడు. తన కుర్చీవైపు వెడుతూంటేన రామలింగయ్య మాస్టారుకు ఎదురుగా వెళ్ళి నిలబడి

"మాస్టారూ" అని గదమాయించాడు.

రామలింగయ్యమాస్టారు వాడి దూకుడికి ఆశ్చర్యపడ్డాడు.

"వాడిని అక్కడనుంచి లేపండి. లేదా నన్ను వెళ్ళి నా బెంచీలో కూర్చోనివ్వండి" అన్నాడు రవి.

వాడన్న మాటలకు రామలింగయ్య మాస్టారు ఆశ్చర్యపడ్డాడు. ఇంత చిన్న పిల్లలలోగూడా ఇంతటి శత్రుత్వాలా! ఆయన ఖిన్నుడైనాడు.

"అదంతా బయటరా రవీ! ఏం? వాడిప్రక్కన కూర్చోను నీకసహ్యమా?" రామలింగయ్య మాష్టారు వాడిని ప్రశ్నించాడు.

"అవును అసహ్యమే. నన్నెళ్ళి నాచోట్లో కూర్చోనివ్వండి." అంటూ మాష్టారి అనుమతికి గూడా ఎదురుచూడకుండా వెళ్ళి పుస్తకాలు తీసుకొని తన సీటువైపు నడిచాడు.

రామలింగయ్య మాష్టారుకు గూడా పట్టుదల పెరిగింది.

"రవీ!" సింహంలా గర్జించాడు.

"ఇష్టమైతే వాడి ప్రక్కన కూర్చో లేదా ఇంటికెళ్లు" అన్నాడు.

అంతే! రవి మారు మాట్లాడకుండా పుస్తకాలు చేతపట్టుకొని ఒక ఆక్రోశపు



చూపును రామలింగయ్యకేసి చూచి క్లాసుదాటి వచ్చేశాడు.

"ఒట్టి గర్విష్టివెధవ" అని తనలో తను గొణుక్కున్నాడు మాష్టారు.

మిగిలిన పిల్లలంతా పక్కున నవ్వారు.

ఇది గ్రహించిన రవి హృదయం అవమానంతో మండిపోయింది. ఇంటి కెళ్ళడానికి గూడా బుద్ధెయ్యలేదు. అందుకే వచ్చి ఆలోచిస్తూ ఆ చెఱువుగట్టున కూర్చున్నాడు.

అలా ఆలోచిస్తుండిన రవికి మెఱుపు లాంటి ఆలోచనవచ్చింది. అంతవరకూ వాడిలోవుండిన దిగులు మంచులా కరిగి పోయింది. వికసించిన ముఖంతో తన నిర్ణయాన్ని ఆచరణలో పెట్టాలని ఇంటికి బయలుదేరాడు.

ఆరాత్రి అన్నం తింటూకూడా రవి తనకు తోచిన ఆలోచనను గురించి ఆలోచిస్తున్నాడు. "అవును. అలా చేస్తేనే తనకు మనశ్శాంతి, తనకసి తీరుతుంది." పదేపదే ఇలా అను కుంటున్నాడు.

అందరూ పడుకోబోయేటప్పుడు అమ్మను చేరాడు రవి.

"అమ్మా! రేపు రామలింగయ్య మాష్టారింట్లో ఏదో శుభకార్యమట. నిన్ను అడిగి మంచి గట్టిపెరుగు పట్టుకు రమ్మన్నారు" అన్నాడు గోముగా.

"అలాగేలే బాబు" అంది రవితల్లి.

మరుసటిరోజు నిద్ర లేవగానే తన పథకం ప్రకారం రవి పెరుగుబుడ్డితో రామలింగయ్య మాష్టారింట ప్రత్యక్ష మయ్యాడు.

బడికి రావడానికి తయారౌతూండిన రామలింగయ్య మాష్టారు గుమ్మంలో నిలబడిన రవినిచూచి ఆశ్చర్య పడ్డారు.

"ఏం రవీ! ఎక్కడికొచ్చావు?" అనివాడికెదురు వెళ్ళాడు రామలింగయ్య.

"మాష్టారూ! నిన్న మిమ్మల్ని అలా ఎదిరించిన దానికి కోప్పడకండి. అమ్మ మీకీ పెరుగు ఇచ్చి రమ్మని చెప్పింది." అంటూ ఆపెరుగుబుడ్డి అందించాడు.

రామలింగయ్య మాష్టారికి ఆశ్చర్య మేసింది. వాడిది పసిడిమనసు అనుకున్నాడు. పెరుగుబుడ్డితీసి ప్రక్కనపెట్టి వాడిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు.

"రవీ! నీవా అల్లరి మానుకుంటే మంచివాడివేరా!" అన్నాడు.

"నేను ఇంటికెళ్ళి పుస్తకాలు తెచ్చుకోవాలి. వస్తాను మాష్టారూ!" అంటూ అక్కడినుంచి ఇంటిముఖం పట్టాడు.

రామలింగయ్య మాష్టారు వాడి అమాయకత్వానికి ముసిముసిగా నవ్వుకుంటూ పెరుగుబుడ్డితో ఇంట్లోకి వెళ్లాడు.

రవికి పెరుగుబుడ్డి మాష్టారు చేతికిచ్చినప్పటినుంచి మనసు మనసులో లేదు. ఏదో తెలియని భయంతో ఆపాద మస్తకం కంపించిపోసాగాడు.

బిక్కు-బిక్కు-మంటూ ఇంటికొచ్చాడు. వాడికి ఆలోచనలు ఎక్కువైపోయాయి.

ఎవరైనాగూడా ప్రతీకారపు ఆవేశంలో ఏదోపెద్దగా ఎదుటివారిమీద పగ తీర్చుకోవాలని చూస్తారు. తీరా తాననుకున్న విధంగానే ఆచరించినతర్వాత పతన మవుతున్న ఎదుటివాడిని చూడగానే తన లోని మానవత్వం మేలుకుంటుంది. వాడిలోని మనిషి "నీవు చేసింది తప్పు... తప్పు" అంటూ ఎదుట నిలిచి క్షోభ పరుస్తాడు.

ఇక్కడ రవి పరిస్థితిగూడా అలాగే అయింది. మాష్టారు నిన్నటిరోజు తనను నలుగురిలో అవమానించాడన్న కక్షతో దాన్ని తీర్చుకోవాలని ఒక మార్గం ఆలోచించాడు. అతనికి కలిగినది దారుణమైన ఊహ. అతని ఆ ఊహ కనుగుణంగా జరిగిన క్రియవల్ల కొన్ని మానవ జీవితాలు బలైపోబోతున్నాయి. ఆ పెరుగులో పెరులకు చల్లేనిమిత్తం తెచ్చి వుంచిన ఎండ్రిన్ కలిపాడు రవి. దాన్ని గనుక మాష్టారి కిస్తే, దాన్ని తాగి వారింటిల్లిపాది సమూలంగా నాశనమైపోతారు.

రవి ఆవేశంలో మాష్టారి వినాశాన్ని ఆ విధంగా కోరాడు. కానీ నిజంగా మాష్టారింట్లోవాళ్లు ఆ పెరుగు తాగుతున్నట్లు, అందరూ నిర్జీవులై నేలకొరిగి




పోతున్నట్లు, వాళ్ళలా దిక్కులేని చావు చస్తే ఆ వూరివాళ్లు దయదలచి వారికి దహన సంస్కారాలు జరుపుతున్నట్లు ఏదేదో వూహించసాగాడు రవి.

రామలింగయ్య మాస్టారు తనకు ఒకటవ తరగతినుంచి చదువు చెబుతున్నాడు. ఒక్కొక్కప్పుడు గట్టిగా మందలించినా, వేరొకప్పుడు ఎంతో ఆప్యాయంగా దగ్గర తీయకపోలేదు.

ఒకసారి అతనికి జ్వరం వస్తే, నాలుగురోజులపాటు మంచంమీద నుండి లేవలేకపోయాడు. అప్పుడు సంవత్సరం పరీక్షలు. రామలింగయ్య మాస్టారు రోజూ ఇంటికొచ్చి అతన్ని పరామర్శించి వెళ్ళేవాడు. జ్వరం తగ్గినతర్వాత రవి కొక్కడికే పరీక్షపెట్టి ప్యాసుచేయించాడు.

చురుకుగా చదువుకునే పిల్లలకు అవకాశ మిచ్చి పైకి తేవాలి. "నేటి బాలలే రేపటి పౌరులు" అనే నినాదాన్ని ఎప్పుడూ దృష్టిలో పెట్టుకొని వ్యవహరించే వ్యక్తి రామలింగయ్య.

అలాంటి రామలింగయ్య మాస్టారు యీరోజు మధ్యాహ్నం భోజనం చెయ్యడంతో యీ ప్రపంచాన్ని వదిలిపోతాడు.

ఈ మాట అనుకోవడంతో రవికి ముచ్చెమటలు పోశాయి. దూరాన బడి గంట వినిపించింది. పుస్తకాలు తీసుకొని బడికేసి పరుగెత్తాడు.

ఆరోజు జనవరి 30. భారతీయ చరిత్రలో మానవాళిలోని మానవత్వానికి ప్రతీకగా వెలుగొంది రాలిపోయి, దీనులను దిక్కులేనివారుగా చేసిన మహా

త్ముని నిర్యాణదినం. ఆ రోజు క్లాసులో 10 గంటలకు గాంధీగారి ఆత్మశాంతికి శ్రద్ధాంజలి ఘటిస్తూ మౌనంగా రెండు నిమిషాలపాటు నిలబడ్డారు.

అది జరిగిపోయిన తర్వాత రామలింగయ్య మాస్టారు గాంధీగారిని గురించి చెప్పడం మొదలుపెట్టాడు. రవి యథాప్రకారం వెళ్ళి తన వెనుక బెంచీలోనే కూర్చున్నాడు.

"పిల్లలూ, ఈ రోజు విశేష మేమిటో తెలుసా ?"

"గాంధీతాత చనిపోయిన రోజు." ఎవరో పిల్లవాడు బదులు చెప్పాడు.

"అవును. ఈ రోజు ఆయన సంస్మరణ దినం. గాంధీ మహాత్ముని జీవితం ఆదర్శప్రాయమైనది. ఆయన చిన్నప్పటి నుంచి పాపభీతి, దయార్ద్ర హృదయం, పెద్దలయెడ గౌరవము, మున్నగు మంచి లక్షణాలు అలవరుచుకున్నాడు.

"మనకు 1947 సం॥ ఆగష్టు 15వ తారీఖున స్వరాజ్యం వచ్చింది కదూ! స్వరాజ్యం వచ్చిన తర్వాత మనలో మనకు అంతః కలహాలు ప్రారంభమయ్యాయి. పరాయివారిపరిపాలననుంచి, బానిసత్వంనుంచి, విముక్తి పొందామని, శాంతిశ్వాసలు తీసుకొనే లోపలే ఈ కలహాలు ప్రారంభమయ్యాయి. వెనుకబడిన జాతులైన హరిజనులు, గిరిజనులను ఉద్ధరించాలని నడుంకట్టాడు మహాత్ముడు. వారుగూడా మనుష్యులేనని, వారిని గూడా మనుష్యులుగా చూడాలని ఆయన ఉద్బోధించారు. ఇది కొందరికి అయిష్టకరమైనదైంది.

"దాదాపు పాతిక సంవత్సరాల శ్రమ ఫలితంగాసాధించిన స్వాతంత్ర్యం నిరుపయోగమైపోయింది. ఈ స్వాతంత్ర్య సాధనకు అనేకమంది తమ జీవితాలనే త్యాగంచేశారు. ఎందరో ఎన్నో కష్టనష్టాలకు గురైనారు. వారి శ్రమంతా చివరకు బూడిదలో పోసిన పన్నీరై పోయింది.

"అంతటి జటిలపరిస్థితులతో సాధించిన స్వాతంత్ర్య పరిణామం ఇలా కావడంతో దానికి మూలకారకుడైన మహాత్ముడు ఎంతగానో పరితపించాడు."

"అనాదికాలంలో మానవుడు అజ్ఞాని. అనాగరికుడై అడవులలో తిరుగుత ఆకులలములు తిని బ్రతుకుతూ పచ్చా అప్పుడతనికి ఈ విభేద భావాలు లే యవు. అలాంటి మానవుడు క్రమేణా విజ్ఞాని అయినాడు. అతని బుద్ధివికాసంతో పాటు స్వార్థంగూడా పెరగసాగింది. ఆ స్వార్థమే హెచ్చుతగ్గు భేదాలను సృష్టించింది.

"1948, జనవరి 30వ తేది గాంధీ మహాత్ముడు ప్రార్థనా మందిరానికి వచ్చాడు. నలుగురిలోచేరి "హరేరామ-హరేరామ" అంటూ భక్తితో ప్రార్థన చేస్తున్నాడు.




''మహాత్ముని ఆశయాలను ఇచ్ఛగించని వారిలో ఒకడైన గాడ్సే, అతను చూచి, పిస్తోలుతో, మహాత్ముడు ఏ హృదయంలో నైతే ఈ విశాల విశ్వంలోని వారందరికి చోటు నిచ్చాడో ఆ హృదయాన్ని గాయపరిచాడు. ''హేరామ్!'' అంటూ నేల కొరిగిపోయాడు గాంధీ.

''బాలలూ! మంచివాళ్లెప్పుడూ ఇలా దారుణమైన హత్యలకే బలైపోతూంటారు. ఆయన హృదయ ఔన్నత్యం చూశారా! రక్తపు మడుగులో కొట్టుమిట్టాడుతూగూడా క్షమాభిరతిని ప్రదర్శించాడు. తనను చంపినందుకుగాను గాడ్సేకు ఏ శిక్ష విధించవలదని ఆయన ఏవరికోరికగా కోరాడు.

''పిల్లలూ! ప్రతి ఒక్కరూ ఆయనలాగే మెలగగల్గడం దుస్సాధ్యం. ఆయన మానవత్వానికి మణిపూస! అందుకే ఆయన ఈనాడు మనలో చిరంజీవియై నిలిచిపోయాడు.

''ఆయనలాగే మీరుగూడా మంచివారు కావాలి!''

ఏకధాటిగా రామలింగయ్య పంతులు చెప్పుకుపోతున్నాడు. రవికి ఆ కథనం విన్నతర్వాత గాబరా మరీ ఎక్కువైంది. అతని ధ్యానమంతా రామలింగయ్య ఇంట్లో వున్న పెరుగుబుడ్డిమీదనే వుంది.

''మన రవి సంగతి చెప్పనా? నిన్న రవిని మందలించినందుకు వాడు అలిగి క్లాసు వదలి పోయాడుకదూ! అలాంటివాడు రాత్రి తన తప్పు తెల్సుకొని, ఈ రోజు నావద్దకొచ్చి పెరుగునిచ్చి క్షమాపణ కోరుకున్నాడు. వాడిపుణ్యాన ఈ

రోజు మాకు దివ్యమైన పెరుగుభోజనం. ఈసరికి మా పిల్లలు ఆనందంగా దాన్ని ఆరగిస్తుంటారు."

రామలింగయ్య మాస్తారి మాటలతో రవి పసిహృదయం పరితపించింది. వాడిక అక్కడ కూర్చోలేకపోయాడు. అప్పటికే గంట పదకొండు ఐంది. నిజంగా ఈసరికి మాస్టారింట్లో భోజనం చేస్తుంటారా? అయితే తన పథకంప్రకారం వాళ్ళంతా చచ్చిపోతారా? లేదు ... లేదు ... అలా జరగడానికి వీలులేదు. జరగకూడదు. తాను గాడ్సేలాగా ద్రోహి కాకూడదు.

రవి ఇక అక్కడే కూర్చోలేకపోయాడు. మెల్లిగా లేచి రామలింగయ్య మాస్టారివద్ద కెళ్లాడు. వాడి కళ్ళమ్మట నీళ్ళు ధారావాహికంగా ప్రవహిస్తున్నాయి. అతని వాలకాన్ని చూచిన మాస్టారు ఆశ్చర్య పడ్డారు.

"ఏం రవీ అలా వున్నావు ?" వాడిని బుజ్జగిస్తున్న ధోరణిలో అడిగాడు.

"మాస్టారూ! గాంధీలాగే మీరుకూడా తప్పు చేసినవారిని క్షమిస్తారా?"

"తప్పకుండా బాబూ! మనిషి అంటే తప్పు చేయకుండా ఎలా వుంటాడు?" రామలింగయ్య చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

రవికి ఎలా చెప్పాలో అర్థంకావడం లేదు. ఒకప్రక్క భోజనాల వేళైపోతోంది.

"మాస్టారూ! మీకిచ్చిన పెరుగులో విషం కలిపానండీ!" కష్టపడి కష్టపడి ఆమాట పూర్తిచేశాడు.

రవి నోటివెంట వచ్చిన ఈమాటతో రామలింగయ్య అదిరిపడ్డాడు. వెనువెంటనే స్తంభించిపోయాడు. రవికేసి నిశ్చలంగా చూస్తుండిపోయాడు కొన్ని నిమిషాలు. తరువాత తన కర్తవ్యం స్ఫురణకు వచ్చింది.

"ఎంతపనిచేశావు రవీ!?" అంటూ గబగబా క్లాసువదలి ఇంటికేసి అడుగు వెయ్యసాగాడు. పిల్లలుగూడా ఏం జరుగుతుందో చూద్దామని ఆయన్ను అనుసరించారు.

రవిమాత్రం క్లాసులోనే వుండిపోయాడు. ఎదురుగా గోడమీద గాంధీమహాత్ముని పటం కనిపిస్తూంది. ఆయన కరుణాపూరిత నేత్రాలు ఆ బాలుని హృదయాన్ని సూటిగా నాటాయి. కంటికిమంటికి ఏకధారగా ఏడవటం మొదలెట్టాడు. వాడికా పరిస్థితులలో ఏం చెయ్యడానికీ తోచడం లేదు. నిజంగా తాను హంతకుడౌతాడేమో.

రామలింగయ్య మాస్టారు దడ దడ లాడే గుండెలతో వాకిట అడుగుపెట్టాడు. వెంటనే ఆయనకు కూనిరాగాలు వినిపించాయి. మాస్టారి అనుమానం నిజమైందనిపించింది. వణికే చేతులతో వారగా వేసివున్న తలుపు తీశాడు. మాస్టారి భార్య పెద్దగా ఏడుస్తూంది. ఆమెముందు వారి పెంపుడుపిల్లి శవం పడివుంది.









మాష్టార్ని చూడగానే ఆమె, "చూచారా! మనపిల్లి, ఉదయం మీబడి కుర్రాడు తెచ్చి ఇచ్చిన పెరుగుతాగి చనిపోయింది." ఆమెకు ఆపిల్లి అంటే ప్రాణం.

మాష్టారు ఒక శాంతిశ్వాస పీల్చాడు. భగవంతుడు తనపాలిట ఉన్నాడను కున్నాడు. వెంటవచ్చిన పిల్లలచేత ఆపిల్లి శవాన్ని ఎత్తివేయించి, భార్యను సమాధానపరిచిమళ్లీ బడికి బయలుదేరాడు.

బడి ఆవరణలో అడుగు పెట్టగానే, మలింగయ్య మాష్టారికి కిటికీగుండా నూతిలోకి దూకుతున్న రవి కనిపించాడు. గబగబ అటుకేసి పరుగెత్తి, అప్పుడే వీధినపోతూండిన ఒకరైతు సహాయంతో రవిని పైకితెచ్చాడు. అప్పటికే రవి రెండు, మూడు మునకలు మునిగి స్పృహకోల్పోయాడు.

ప్రధమచికిత్సచేసి రవిని మేల్కొలిపాడు మాష్టారు.

"రవీ! ఏ అనర్థమూ జరగలేదుగానీ, నీవల్ల ఇప్పుడు పెద్ద అనర్థం జరిగిపోయి వుండేదిరా?" అన్నాడు వెల్లికిలా పడుకొనివున్న రవి ముఖంలోకి ముఖం పెట్టి.

"నన్ను మన్నించండి మాష్టారూ!" అంటూ రవి చేతులు జోడించాడు.

"పద ఇంటికిపోదాం" అని రవిని మాష్టారే స్వయంగా భుజాన వేసుకొని వాళ్ళింటికి చేర్చడానికి బయలు దేరాడు.

# దేవుని వైద్యము

ఆ కాలంలో సేవాగ్రాంకు పట్వారీగా వున్న వ్యక్తి చాలా విలక్షణమైన గుణాలు కలిగినవాడు. కానీ, ఇటు గ్రామస్తులతోకాని, అటు ఆశ్రమవాసులతోకాని ఎలాటి సంబంధం పెట్టుకునేవాడుకాదు. ఆయన పనేమో, ఆయనేమో. ఆశ్రమ వాసులు అనేకరకాల సామాజిక కార్యక్రమాలు నిర్వహిస్తూ పరిసర గ్రామాలలో దేవదూతలవలె సంచరిస్తూ ఉండేవారు. ఈ కార్యక్రమములోకూడా ఆయనేమీ కలుగ జేసుకునేవాడుకాదు. బాపూజీ సేవాగ్రాంలో ఆశ్రమం ఏర్పాటుచేసి అక్కడ వుంటున్న తరవాత గ్రామవాసులలో చాలా మార్పు వచ్చింది. కానీ ఇతడిలోమాత్రం ఏ మార్పు రాలేదు.

ఒకసారి యీ పట్వారీకి టైఫాయిడు జ్వరం వచ్చింది. సామాన్యంగా అక్కడి వారంతా నాటువైద్యం చేయించుకోవటం అలవాటు. ఎక్కడెక్కడో ఆయన మందులు తిన్నాడు. కాని తగ్గలేదు. ఆశ్రమవాసుల సహాయం ఆయన కోరలేదు. రోగపీడితులను చూచి చికిత్స నిర్వర్తించడం ఆశ్రమవాసుల అలవాటు. ఈ అల వాటు చొప్పున ఆశ్రమవాసులు వెళ్ళి పట్వారీని చూచారు. డాక్టర్ సుశీలానయ్యార్, శంకరన్‌జీ, ప్రభాకర్‌జీలు స్వయంగా ఆయనకు వైద్యం నడిపారు. మందులు, యింజక్షనులు యిచ్చారు. జ్వరం నయమయింది. రోగి కలిగినవాడే కనుక యింజక్షన్లకు అయిన కనీస ఖర్చులు బిల్లుచేసి ప్రభాకర్‌జీ తీసుకవెళ్లారు. అదేమంత పెద్ద మొత్తంకూడా కాదు. 10 రూపాయల లోపే.

పట్వారీబిల్లు చూశాడు. "మీరేంచేశారు? దేవుడు నయంచేశాడు!" అన్నాడు. ప్రభాకర్‌జీ ఆశ్చర్యపోయి ఆశ్రమానికి తిరిగివచ్చారు. గాంధీజీకి చెప్పారు. బాపూజీ నవ్వుతూ అన్నారు: "అతడన్నమాట నిజము. దేవుడు రోగము నయముచేసి మాటయితే నిజమేకాని, మీరుకూడా కొంత చేశారని నమ్మకం కలిగితేకదా అ డిచ్చేది? ఆ నమ్మకం అతడికి కలుగలేదన్నమాట!" అని.

[ఊట్ల కొండయ్యగారి 'గాంధీపథం' నుంచి]

# గెలుపు నీదే

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను–"

మూడేళ్ళక్రితం ఆ మాటలను విని సత్యవతి మురిసిపోయింది. తన అందాన్ని, యౌవనాన్ని నిలువుటద్దంలో చూచుకొని గర్వించింది.

అయితే యివాళ అవే మాటలు విని భయపడింది. అటూ యిటూ బెదురు చూపులు చూస్తూ నెమ్మదిగా అంది– "నాన్నగారు వింటారు జాగ్రత్త" అని.

ఆ మూడుమాటలను కలిపి చక్కని వాక్యంచేసి మురిపెంతో, ముచ్చటగా అన్నవాడు ఆనాడూ యీనాడూ వొక్కడే– మురళి.

'అన్ని నవలలు వ్రాసేవు. గొప్ప రచయిత్రి వనిపించుకొన్నావ్. యింకా నాన్నంటే భయమేనా?'

సత్యవతి అసహాయురాలిలా తల వంచుకొంది. మనసులో బాధపడుతున్నట్టు మొహంలో అలుముకొన్న నీలిమేఘాలు కళ్ళల్లో కమ్ముకొన్న కారు మేఘాలు చెప్తూనే వున్నాయి.

'వయసులోవున్న ఆడపిల్లవి – మనస్సులో మురిపెంతో పెంచుకొన్న కోరికలను నవలల్లోకి ధైర్యంగా ఎక్కించిన దానివి – యింకా నాన్నను చూచి భయపడటం బాగాలేదు సత్యా. ధైర్యం తెచ్చుకో. నాన్న కోపాన్నిచూచి బెదిరిపోకు. నిశ్చయంగా ఎదురునిల్చి నీ మనసు విప్పిచెప్పు. కాదంటే ఎదిరించు. నీవెనుక నేనున్నాను –'

ఆ పిల్ల ఆపని చేయలేదని ఆమె కళ్ళల్లోని భీరుత్వమే చెప్తోంది. అయితే అలా చేయాలన్న కోరికా మరోవైపు కన్పిస్తూనేవుంది. కాగా మురళిమాటల్ని కాదనటం ఎలా?

నిజానికి సత్యవతి చిన్నతనంనుంచి పెరిగిన వాతావరణం, స్వేచ్ఛాస్వాతంత్ర్య ప్రవృత్తికి, స్వకీయమైన ఆలోచనాశక్తికి ప్రేరణ యిచ్చేటటువంటిది కాదు.

ఆ యింట్లో డబ్బుకు కొరతలేదు. పుట్టినదగ్గిరనుంచి ఆ పిల్ల పరుపులమీదనే నడిచింది. మల్లెపూల సెజ్జలపైనే పడుకొంది.

అందుకే ఆ అమ్మాయికి, నేలకూ దూరం. ఆకాశవిహారంతప్ప, నేలమీద నడవటం చాతకాలేదు.

ఊహ పూర్తిగా తెలియకముందే తల్లి మరణించింది. తండ్రికి పిల్లల్ని

---

*కప్పగంతుల మల్లికార్జునరావు*

---

కనటంతప్ప పెంచటం బొత్తిగా తెలియదు.

వృత్తి చేత రంగారావు న్యాయవాది. కానీ ఆయన ఆలోచన లెప్పుడూ అన్యాయంగానే వుండేవి.

ఊరంతా తన కనుసైగల్లో కదలాలని ఆయనకో పెద్దకోరిక. ఆ కోరిక తీర్చుకోటానికాయన ముందు యింటి నుంచి బయలు దేరేడు.

బ్రతికున్నంతకాలం భార్య ఆయన చెప్పు చేతల్లో నలిగిపోయింది.

పెద్దవాడు 'లా' చదువుతానంటే— 'లా' దేముందోయ్? మనం సమర్థుల మైతే లా చదవకపోయినా, మనం చెప్పిందే 'లా' అవుతుంది. మెడిసన్ చదువు—' అని ఆర్డర్ వేశాడు.

రెండోవాడికి నాటకాలంటే పిచ్చి. తండ్రికి తెలీకుండా నాలుగు నాటకాల్లో వేషాలువేసి మంచి నటుడని పేరుతెచ్చుకొన్నాడు. అది తెల్సేసరి, నాటకాలు గీటకాలు కట్టిపారేసి, హాస్టల్లోవుండి ఇంజనీరింగ్ చదవమని శాసించాడు రంగారావు.

ఊహతెల్సిన దగ్గర్నుంచి నాన్నంటే భయమే సత్యవతికి. వయసు పెరిగేకొద్దీ ఆమెలో కోరికలు వొక్కొక్కటి విచ్చుకోసాగేయి.

తనూ స్కూల్లో తన స్నేహితురాళ్ళ లాగా ఆడుకోవాలి. వేరుశనగ పప్పులు తింటూ షికార్లు చేయాలి. సినిమాలు చూడాలి. పత్రికల్లో నవలలు చదివి స్నేహితురాళ్ళతో మంచి చెడ్డలను గురించి చర్చించాలి.

కానీ అవన్నీ తీరని కోరికలే. కారణం? తండ్రి ఆలోచనలకు అవి భిన్నం కావటమే.

కారు తనని సరిగ్గా బెంచు స్కూలు వద్ద వదిలి వెళ్తుంది. యీలోగా స్నేహితులతో అనవసర సంభాషణలు చేయరాదు. క్లాసు పుస్తకాలుతప్ప పత్రికలు, నవలలు చదవరాదు. తండ్రి ఆజ్ఞకు భంగంగా అలాంటి పనులు చేస్తే, వెంటనే ఆయనకు తెలుస్తుంది. అందుకు ఆయన ఏర్పాట్లు చేసుకొన్నాడు.

అందుకే సత్యవతి చిన్నతనంనుంచి యిలాంటి కోరికలు పెంచుకోలేదు. తన స్వల్ప పరిధిలో కూర్చునే బంగారుకలలు కంది.

తండ్రి, అన్నలు, నౌకర్లు మొదలైన వారంతా తనను ఎంతో ప్రేమగా చూస్తున్నట్లు, తను కోరినదల్లా కాదనకుండా కోరినదే తడువుగా తీరుస్తున్నట్లు కలలు కని తృప్తిపడేది.

ఇంట్లో అలా తన ఆధిక్యతను నిలబెట్టు కొన్నాక, రంగారావు దృష్టిని బయటికి సారించి, తన వృత్తిమీద కేంద్రీకరించాడు.

వస్తుతః వృత్తిలో అంత ప్రతిభాశాలి కాదు రంగారావు. న్యాయధర్మాలు, సూక్ష్మాలను గురించి ఆలోచించేతత్వమూ




కాదు – అందుకొ్కవల్సిన వోపికా లేదు.

అయితే చిరకాలంగా ఆ వూళ్ళో వున్నవాడు. కాగా వారి కుటుంబం ఆ వూళ్ళో ప్రసిద్ధమైనది. తండ్రిచేసిందీ న్యాయవాదవృత్తే. ఆ వృత్తిలో ఆయన ఎంతో శోభించి 'ఫలానివాడు మంచి ప్లీడరు' అన్న పేరును వదిలి వెళ్ళేడు. తండ్రి వదిలి వెళ్ళిన ఆ పేరును నేర్పుగా వాడుకొని వృత్తిలో నిలబడ్డాడు.

అంతేకాదు వృత్తిలో 'షైన్' కావటానికి కొన్ని విపరీతమైన పద్ధతుల్ని అవలంబించాడు రంగారావు. తన కు స్వయం ప్రతిభతో, వృత్తిలో రాణించే నేర్పు ఎలాగూ లేదని రంగారావుకు తెల్సు. అందుకని – 'యిటునుంచి కాకపోతే అటునుంచి నరుకొ్కద్దాం' – అన్న పద్ధతిలో, ప్రత్యర్థులను పడగొట్టటంలో నేర్పు సాధించాడు.

రంగారావుది భారీ విగ్రహం. విశాలమైన నుదురు, పెద్దపెద్ద కళ్లు, వెడల్పయిన పెదవులపైన గుబురైనమీసాలు– చూడగానే ఎంతవాడికీ భయం పుట్టేలా వుంటుందాయన విగ్రహం. అందుకు తోడు ఖంగుమనిమోగే కంఠం. కాగా తప్పులో వొప్పులో ధారాళంగా మాటల్ని దొర్లించేయగలడు.

భగవంతుడిచ్చిన ఆ మహాకాయాన్ని, ఆ గొంతును, ఆ వాక్ప్రవాహ సౌభాగ్యాన్ని ఆయన చక్కగా వినియోగించుకొన్నాడు.

పాయింట్లు లేకపోయినా గబగబ మాట్లాడి కోర్టు హాలును అదరగొట్టేవాడు. ప్రత్యర్థి వకీలు 'పాయింట్ ఆఫ్ ఆర్డర్' అంటూ లేవబోయాడా, రంగారావు గుడ్లురిమి చూచేవాడు – 'వాకిట్లోకి రా నీపని పడ్తా' అన్నట్టు.

పైగా ఆ వూళ్ళో అతనికంటూ వో గ్రూపు వుంది. ఆ గ్రూపుకు రాజకీయపు రంగు పూసేడు రంగారావు. తనేనాటికైనా పెద్ద రాజకీయవేత్త కావాలన్న కోరికకు ఈ గ్రూపును నాందిగా నిర్మించుకొన్నాడు. అయితే అది నిజానికి రౌడీ గ్రూపు.

ఆ గ్రూపులో వాళ్ళు చేసే అన్యాయమైన పనులన్నిటినీ వెనకేసుకొచ్చి వకాల్తా పుచ్చుకొని కోర్టులో వాదించేవాడు.

రంగారావు కయిష్టమైనపని ఆ వూళ్ళో ఏది జరిగినా ఆ రౌడీగ్రూపు కొట్లాటకు తయారవుతుంది. కొట్లాటలు ముదిరి వ్యవహారం కేసులు, కోర్టులుదాకావస్తే రంగారావుకు రెండు లాభాలు. అటు తన పని నెరవేరుతుంది, ఇటు కోర్టులో తన ఫైలు పెరుగుతుంది.

అందుకే ఆ వూళ్ళో చాలా మంది రంగారావును ఆ పేరుపెట్టి పిలవరు. 'రౌడీ ప్లీడరు' అని కొందరు ముద్దుగా అంటే, మరి కొందరు కచ్చగా అనుకుంటారు.

అవతలి పార్టీ ప్లీడరు సిద్ధంగా లేనప్పుడు, సాక్షులు రానప్పుడు, సమయం చూచి కేసును విచారణకు పెట్టేలా చేసేవాడు రంగారావు.

కోర్టు గుమాస్తాలంతా రంగారావు బంధువులే. ప్రతి పండక్కి మామూలు లాగా, అంతో యింతో యిచ్చి వారి చేయి తడిచేసి, వారిని తన చేతిలో వుంచుకొన్నాడు.

ఇలా ఇంటా బయటా ఎదురులేకుండా సాగిపోతున్న రంగారావును మొట్టమొదటసారిగా ముఖాముఖీగా ఎదుర్కొన్నవాడు మురళి.

మూడేళ్ళ క్రితం మురళి బి. ఎ. ఫైనల్ యియర్ చదువుతుండేవాడు. సత్యవతి ఆ యేడే పి. యు. సి. పాసై బి. ఎ. లోకి వచ్చింది.

అసలు రంగారావు సత్యవతి చదువుకు యిస్ట్రెల్సితోనే స్వస్తిచెప్పాలనుకొన్నాడు. తన అభిప్రాయాన్ని కూతురుతో చెప్పేడు.

కొడుకుల్లాగానే కూతురూ, తన కోరిక చెప్తుందని ఆశించాడు. అలా చెప్తే అదిలించి మూల కూర్చోపెడ్డామని కూడా నిర్ణయించుకొన్నాడు.

కాని సత్యవతి తండ్రి అభిప్రాయాన్ని విని ఎదురుచెప్పలేదు. కంటనీరు కుక్కుకుంటూ, నిశ్శబ్దంగా అవతలికి వెళ్ళింది.

ఆమె వెంట రంగారావుకూడా లోపలికెళ్ళేడు. అప్పటికే సత్యవతి కళ్ళల్లో నీళ్ళ కట్టలు తెంచుకొన్నాయి.

వెళ్ళి కూతురు శిరస్సుమీద చెయ్యి వేశాడు. ఏదో వింత అనుభూతి!...తనదన్న మమకారం పెల్లుబికింది.

'పైకి చదువుకోవాలని వుందా తల్లీ?'



సత్యవతి ఆశగా తండ్రివైపు చూచింది.

'చదువుకోమ్మా. నీవు చదువుకోవా లంటే నేను కాదంటానా?' అన్నాడు కన్నీళ్లు తుడుస్తూ. ఆ తర్వాత త నన్న మాటలకు తానే ఆశ్చర్యపోయాడు రంగారావు!

తండ్రిప్రేమను సత్యవతి అనుభవిం చిందా వొక్కరోజే!

కాలేజీలో చేరేక ఆ వాతావరణం చాలా కొత్తగా కన్పించింది. ఏదో పులక రింత కుర్రాళ్లు తన వంక చూస్తుంటే!

స్కూల్లోకూడా కుర్రాళ్లు ఆమెవంక చూచేవారే. అయితే ఆ చూపుల్లో యీ 'చురక' లేదు, వేడి లేదు. యిక్కడి కుర్రాళ్ళు వేడివేడిగా తనవంకచూస్తుంటే వళ్ళంతా చురుక్కు చురుక్కుమంటూ ఏదో వింత అనుభూతి! అందరిలోకి ఆ యువకుడు — అబ్బ — ఏంచూపో అత నిది? ఎలా నవ్వుతాడో?

అయితే అన్ని ఆలోచనలూ, అను భూతులూ మనసులోనే. కార్యక్రమం మామూలే. కారులో రావటం, క్లాసులో కూర్చోవటం, కారులో యింటికెళ్ళటం.

అలవాటుచొప్పున ఆ రోజు కాలేజీ లోపల్నుంచి కారువద్దకు బయల్దేరింది.

'క్షమించండి సత్యాదేవిగారూ—ఒక్క నిముషం—'

కళ్లెత్తి అతనివైపు వోరగాచూచింది. అతనే... అతనే! నవ్వుతూ ఎదురుగా నిల్చునివున్నాడు — తనవంకే ఆప్యా యంగా చూస్తూ. చురక ఘట్టిగా తగిలింది.

'నాపేరు మురళి. బి. ఎ. ఫైనల్ యియర్ _'

'మురళి' అన్న పేరులో అంత మాధుర్యముందని సత్యవతికి అంతక్రితం తెలీదు. 'మురళి ... మురళి ... ఎంత బాగుంది పేరు_' మనసులోనే అనుకొంది.

మురళి అందమైనవాడే. పొడుగు_పొడుగుకు తగ్గ లావు. చామనిచాయ, చక్కని మీసం, మెత్తటి నల్లటి జుట్టు, పెద్ద కళ్లు. ఆకర్షించే శక్తి వుంది అతనిలో.

'అనవసరపు ఉపోద్ఘాతాలు, పనికిమాలిన 'ఫార్మాలిటీస్' అంటే నా కిష్టం లేదు. మీరనుమతిస్తే సూటిగా అసలు విషయానికొస్తాను _'

'చెప్పండి_' అన్నట్టు సత్యవతి కళ్లు టపటపలాడాయి.

''నేను నిన్ను ప్రేమిస్తున్నాను.''

ఆ మూడు మాటలు విని సత్యవతి మురిసిపోయింది. హృదయం ఆనందంతో వేగంగా కొట్టుకుంది.

అయితే అంతలోనే అతని ఏకవచన సంబోధన గుర్తుకొచ్చింది. క్షణంక్రితం పరిచయం? అప్పుడే తనని అతని సొత్తు చేసుకున్నట్లు ఏమిటా పిలుపు? ఎంత సాహసం?

'ఏకవచనంలో సంబోధించానని ఆలోచిస్తున్నట్లున్నారు. కావాలనే అలా అన్నాను. ప్రేమను వ్యక్తంచేయటానికి ఆదే మంచి మార్గమని అలా పిలిచాను. కష్టంవేస్తే క్షమించండి.

'ఇంతకీ మీకు పెళ్ళి చేసుకోవాలని వుందా? ఉంటేమాత్రం నేనో అప్లికేషన్ యిందు వెంట దాఖలుపర్చుకుంటున్నాను. కట్నాలు కానుకలూ అన్నీ మీ ప్రేమలోనే స్వీకరిస్తాను. చదువు, సంస్కారం, తెలివితేటలు, భగవంతుడిచ్చిన యీ శరీరం, శక్తితప్ప చెప్పుకోదగ్గ ఆస్తులంటూ నాకు పెద్దగా ఏమీలేవు. నా అప్లికేషన్ పరిశీలించి ఆజ్ఞలు జారీ చేయండి.'

అతను వెళ్ళిపోగానే ఏదో కొరత!... అలాగే అతని సన్నిధిలో వుంటే ఎంత బాగుండును?

ఇంటికెళ్ళి తన అందాన్ని నిలువుటద్దంలో పరీక్షగా చూచుకొంది సత్యవతి. చూచుకొని గర్వించింది. తన పక్కన అతన్ని నిలబెట్టుకొని చూచుకొని మురిసిపోయింది.

అతన్ని గురించి ఆలోచించేకొద్దీ, ఆమె మనసు పూల వుయ్యాలలా పరిమళిస్తూ వూగసాగింది. చేసుకొంటే అతన్నే పెళ్ళిచేసుకోవాలి. యీతడవ అతను అడిగితే అదే చెప్పాలనుకుంది.

కానీ తీరా వారంతర్వాత అతను ఎదురై 'నా అప్లికేషన్‌పై ఏం ఆర్డర్సు వేశారు?' అని అడిగినప్పుడు 'మా నాన్నగారికి దాఖలుచేశాను. వారిని అడగండి' అంది తనూ చిలిపిగానే.

అయితే చిలిపిగా ఆనాడన్న ఆ మాట, తర్వాత నిజంగానే అతను తనతండ్రి




నడిగినప్పుడు అంతగా విషమిస్తుందను కోలేదు.

'ఊ... అయితే నా కూతుర్ని ప్రేమిస్తున్నానంటావ్?' రంగారావు మీసాలు దువ్వుకొని చుట్ట వెలిగించి కళ్లు పెద్దవిచేసి చూస్తూ గంభీరంగా అన్నాడు.

'నా కూతుర్ని ప్రేమించటానికి నీకు గల అర్హత లేమిటి?'

'ప్రేమించగల మంచి హృదయం కలిగివుండటం మాత్రమే.'

'సిగ్గులేదటోయ్ ఆ జవాబిచ్చి నా కూతుర్ని అడగటానికి?'

మురళి చటుక్కున తలఎత్తి చూచాడు. అతని కళ్లలో నిప్పురవ్వపడింది.

'ప్రేమించగల హృదయం వుందిట. నీకేనా ఆ బోడి హృదయం వుంది!? అందమైన ఆడపిల్లను, అందునా డబ్బుకలవారింటి ఆడపడుచును, చూస్తే ప్రతి వెధవకి హృదయాలు మొలుచుకొస్తాయి.

'నువ్వేమైనా వో డాక్టరువా? ఇంజనీరువా? ప్లీడరువా? కనీసం గుమాస్తావన్నా కావే? ఆఫ్టరాల్ బి. ఎ. విద్యార్థివి. ఆ బి. ఎ. కాగానే పిల్చి కలెక్టరును చేస్తారనుకుంటున్నావా ఏమిటి? అయినా నా అంతస్థెక్కడ? నీ అంతస్థేమిటి? సిగ్గు లేక నా ఎదుటి కొచ్చి నా ముందు నిలబడి నా కూతుర్ని ప్రేమించానంటావా? మళ్లీ వో మారిలా చేస్తే మూతిపళ్లు రాలగొడ్తాను.'

'పళ్లు రాలగొట్టటం మీ కొక్కరికే కాదు చాతనయింది. నాకూ చాతనవును.' కుర్చీలో కూర్చొని కాళ్లు స్టూలుమీద పెట్టి తీవిగా అన్నాడు మురళి.

అతని పద్ధతి చూచి చటుక్కున కుర్చీలోనుంచి లేచాడు రంగారావు.

'మర్యాద అనేదాన్ని మనం యిస్తేనే మన కొకరిచ్చేది. డాక్టరు, ఇంజనీరు, ప్లీడర్లకే మీ అమ్మాయి నిస్తానంటే, ఆల్‌రైట్, నా కభ్యంతరం లేదు. మీ అమ్మాయి నా కవసరం అనుకొంటే నేనే వాటిలో ఏదో ఒకటయి అప్లికేషన్ 'రెన్యూ' చేస్తాను. కానీ 'రౌడీ' తనాన్ని కోర్టులో చూపిస్తే సరిపోతుంది కాని, ప్రతివాళ్ళ దగ్గర పనికొస్తుందనుకోకండి. మొదటిసారి కనుక యింతటితో సరిపుస్తున్నా—' అంతదూరం వెళ్ళిన వాడు కాస్తాఆగి వెనక్కి చూస్తూ అన్నాడు: 'యివాళ మీచేత తిరస్కరింపబడ్డాను. మరోరోజు మీరేపిల్చి మీ పిల్లనిస్తా మంటారు. అంతవరకు శెలవ్—' చక చకా వెళ్ళి పోయాడు.

రంగారావు స్థాణువే అయ్యాడు. అంతావిన్న సత్యవతికి అతనిపైన ప్రేమ ఎక్కువయింది. ఆ తర్వాత సత్యవతి చదువు ఆగిపోయింది.

'నేను నిన్ను యింకా ప్రేమిస్తున్నాను. నన్ను నిజంగా నువ్వు ప్రేమిస్తుంటే మూడేళ్లు నాకోసం ఆగలేవా సత్యా?'

ఉత్తరాన్ని హృదయానికి హత్తుకొని, పెట్టెలో దాచిపెట్టూ అనుకొంది సత్యవతి— 'మూడేళ్లు ఆగితే ఆతర్వాత ఏంచేస్తాడో, అసలీ మూడేళ్లు ఏంచేస్తాడో?'

అతనేంచేస్తేనేంకాక కానీ, యీ మూడేళ్ళలో సత్యవతి జీవితంలో మరో అధ్యాయం ప్రారంభమయింది.

మనసులో పేరుకొనిపోతున్న కోరి కల బరువుభారం పెరిగిపోయింది. మురళితో రానున్న తన జీవితాన్ని గురించిన కలలు ఎక్కువయ్యాయి. తీరని కోరికల్ని, కంటున్న కలలని కాగితం మీద పెట్టింది. నవలా రూపంలో అందంగా, ఆకర్షణీయంగా వ్రాసి పత్రి కల్లో ప్రచురించింది.

ప్రతి స్త్రీకి అందమైన భర్తనుపొందా లని, ఆ భర్తతో 'ప్లిమత్' కారులో సాయంత్రం బీచివొడ్డున షికారుచేసి, రాత్రికి పెద్దహోటల్లో రూఫ్‌గార్డెన్‌లో భోంచేసి, ఇంగ్లీషు సినిమాకు పోవా లని; కాశ్మీర్‌లో ప్రకృతి దృశ్యాల మధ్య భర్తమీదవొరిగి అందంగా నడవా లనీ; తనవాళ్ళంతా తనని కంటిపాప లాగా చూడాలని; తనకాల్లో ముల్లుగుచ్చు కొంటే యింటిల్లిపాదీ కాళ్ళరిగేలాగా అటూయిటూ పరుగెత్తాలనీ; యిలాంటి కోరికలు వుండడంలో అసహజమేం లేదు. అయితే యీ కోరికలు మనసులో అడుగుపొరల్లో వుంటాయి. నిజ జీవి తానుభవమువల్ల, అడుగుపొరల్లోని ఆ కోరికలు అక్కడే వుండిపోతాయి.

ఒంటరిజీవితం, బందిఖానబతుకు, సత్యవతిలోని యీ కోరికలకు వూపిరి పోసి వెలికితెచ్చాయి. నవలల్లో ఆమె ఆలోచనలూ అలాగే కొనసాగాయి.



ఇప్పుడామె నవలలు చదివేక చాలా మంది స్త్రీలలో, ముఖ్యంగా యువతుల్లో యీ కోరికలు విజృంభించాయి. అయితే అవి తీరేదెలా? ఆమె వ్రాసిన నవలల్నే మళ్లీ మళ్లీ చదివి మానసికానందాన్ని పొందసాగారు.

సత్యవతి ప్రసిద్ధ రచయిత్రి అయింది. పత్రికలు, ప్రజలు ఆమె నవలలకోసం ఎగబడ్డారు.

మూడేళ్ళలో పదినవలలు వ్రాసింది. పదివేలకుపైగా సంపాదించింది.

రంగారావు కూతురి యీ వ్యాసంగాన్ని కాదనలేదు. కాగా ప్రోత్సహించాడు కూడా. కారణాలు రెండు: 'ఫలాని అమ్మాయి తండ్రి' అని తనకూ పేరువస్తోంది; డబ్బూ వస్తోంది.

అయితే ఆమె నిజజీవితంలో మార్పు లేదు. రచయిత్రి సత్యవతికొచ్చే కట్టల కట్టల అభిమానుల ఉత్తరాలను చదివేవాడు రంగారావే. చూచిపోదామనివచ్చిన వాళ్ళకు లభ్యమయ్యేది రంగారావు దర్శనమాత్రమే.

ఆ మూడేళ్ళు ప్రతినిముషం మురళిని గూర్చి ఆలోచించింది సత్యవతి.

అయితే రంగారావుమాత్రం కూతురి పెళ్ళివిషయం వొక్కక్షణంకూడా ఆలోచించలేదు.

* * *

'నేనతన్ని ప్రేమించాను నాన్నగారూ. పెళ్ళి చేసుకొంటాను_'

కూతురుమాటల్తో రంగారావు కళ్ళు నిప్పుకణికలయ్యాయి_ అతన్ని ప్రేమిస్తు

న్నానని కూతురు అన్నందుకు కాదు-తన ఎదుట నిల్చి ధైర్యంగా కూతురు ఆ విషయాన్ని చెప్పినందుకు.

'ఎవర్ని ?' అని అడుగుతాడనుకొంది సత్యవతి. కాని రంగారావు అడగలేదు.

సత్యవతి అతనితో మాట్లాడటం- అలా మాట్లాడుతున్నప్పుడు కూతురి మొహంలో కన్పించే కోటిదీపాల వెలుగు - ఆయన చాలాసార్లు చూచాడు- చూడనట్లు వూరుకున్నాడు.

కారణం ? కూతురు పెళ్లీడు కొచ్చిందని, పెళ్ళిచేయక తప్పదని రంగారావుకు తెల్సు. మరి, అతను - నల్లగౌను తొడిగిన నాలుగునెలలకే, తలనెరసిన ప్లీడర్ల చేత 'భేష్' అనిపించు కొన్నవాడు అతను తన అల్లుడుకావటం తనకిగొప్ప- తన తెలివితేటలకు గీటురాయి.

రంగారావుకి అతన్ని చూచిన్నాడే అభిమానం కలిగింది.

ఆనాడు రంగారావుకి బాగాగుర్తు-

సీనియర్ ప్లీడర్ సీతారామయ్యగారి నెలా దెబ్బకొట్టడమా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు 'బార్' రూమ్‌లో.

'నమస్కారం రంగారావుగారూ. గుర్తున్నానా నేను ?'

నిజానికి తనెవరో గుర్తులేదు రంగారావుకు అయినా ఆ విషయాన్ని ఒప్పుకొనే తత్వం కాదాయనది.

'ఎంతమాట ? నువ్వు గుర్తు లేక పోవడ మేమిటోయ్ ? బాగున్నావా ?' అన్నాడు.

'గుర్తుంటే మన పరిచయం ఎక్కడో చెప్పండి చూద్దాం -'

రంగారావు యీ పరిస్థితిని వూహించ లేదు. వెలక్కాయ నోట్లో పడట్లయింది.

'మీకు గుర్తులేదు. నామీదఅభిమానం కొద్ది అలా నటిస్తున్నారు. అవునా ?'

అయినా యిత నెక్కడి మనిషి ? యింత నిర్మొహమాటంగా మాట్లాడుతున్నాడు ? !

'వాస్తవం చెప్పాలంటే నాకూ జ్ఞాపకం లేదుసార్. బహుశా మానాన్నగారివద్ద కొచ్చినప్పుడు చూచానేమో. మానాన్నగారు మీకు తెల్సుననుకొంటా-'

తెల్సునంటే ఏమో ? తెలీదంటే ఏమో? అందుకే ఏమీ మాట్లాడలేదు.

'సరే అసలువిషయాని కొస్తా. నేను 'లా' పాసయ్యాను. ఈ వూళ్ళో ప్రాక్టీస్ చేయమన్నారు నాన్నగారు. మొదటిసారిగా ఈవాళే కోర్టుకు రావటం. కేసు వాదించేముందు మీ ఆశీస్సు తీసుకోమన్నారు నాన్న అందుకే వచ్చా-'

రంగారావు ఉబ్బిపోయాడు. అతని మాటల్లోని ఆకర్షణకు బానిసయ్యాడు. తనకు జూనియర్‌గా యిలాంటి కుర్రవాడుంటే ?...అదే అడిగాడు.

అతను చాలా బాధపడ్తున్నట్టుగా మొహంపెట్టేడు. ఒక్క క్షణం ఆగి చాలా విచారంగా అన్నాడు- "నిజంగా నేను

చాలా దురదృష్టవంతుణ్ణిసార్. లేకపోతే యింతటి సదవకాశాన్ని వుపయోగించుకో లేని స్థితిలో వుంటానా? మూడురోజులే అయిందిసార్ — సీతారామయ్యగారివద్ద జూనియర్‌గా చేరి. మీరిలా నామీద దయ చూపిస్తారని తెలిస్తే...''

సీతారామయ్య జూనియర్ అని విని గానే రంగారావు ఆలోచన యివాళ తన కేసుమీదికి పోయింది.

తను యివాళ వాదించాల్సిన కేసుకు యితన్ని పంపిస్తే బాగుండును. కొత్త వాడు. ముప్పతిప్పలుపెట్టి తనప్రజ్ఞ చూపవచ్చు — అనుకొన్నాడు.

కోర్టుగుమాస్తాలవద్దకెళ్లి అవసరమైన 'బోల్టు' లను బిగించుకొని వచ్చాడు.

అదృష్టం. సీతారామయ్య జూని యర్‌గా అతనేవచ్చాడు. అనుకొన్నట్టు గానే వాయిదా అడిగాడు.

రంగారావు అభ్యంతరం తెలిపాడు — సీనియర్ రిక్వెస్ట్‌లేందే వాయిదా వేయ టానికి వీల్లేదని.

కేసు వింటామన్నారు కోర్టువారు.

అయిపోయింది, కేసు గెల్చాననుకు న్నాడు రంగారావు. అబ్బాయి తేలగుడ్లు వేస్తాడని ఆశించాడు.

అతను వాదన సాగించాడు.

అరగంట అయింది. కోర్టు నిశ్శ బ్దంగా వింటోంది. ఎవరీ కుర్రవాడు? ఏమి పరిశీలనాశక్తి? ఏం వాగ్ధాటి?

రంగారావే తేలగుడ్లు వేయాల్సి వచ్చింది.

కేసు అతనిపక్షమయింది.

'క్షమించండి. మొదటికేస్సే మీకు వ్యతిరేకంగా వాదించాల్సివచ్చింది. పిల్ల వాడని మీరు దయతల్చి వదిలేయబట్టి సరిపోయింది కాని — లేకపోతే యివాళ చాలా భయపడ్డానుసార్!' అంతవరకు కేసు పోయినందుకు విచారం. యిప్పుడో? కేసుపోయినా, అది తను కావల్సి వదిలి వేయటంవల్ల పోయిందన్న తృప్తి. తన గొప్పతనాన్ని అతను గుర్తించినందుకు ఆనందం!

'ఏమైనా కోర్టులో మనం శత్రువులం. బయటకొచ్చాక మిత్రులం — బంధువులం. చిత్రంకదూ సార్ యీ ప్రొఫెషన్?'

రంగారావు అతని ఆకర్షణకు లొంగి పోయాడు. మాటరాక నవ్వాడు.

మొదటి నాలుగునెలల్లోనే అతను బాగా ఎదిగిపోయాడు. ఎవరినోటవిన్నా అతనిపేరే, పొగడ్తే.

అదేం ఖర్మోకాని, అతను గెల్చిన చాలాకేసులు రంగారావుకువ్యతిరేకంగానే.

రంగారావుకు అతన్ని చూచేకొద్దీ అతనిచేతిలో వోడేకొద్దీ, అతన్ని తన జూనియర్ చేసుకోవాలన్న కోరిక పెరగసాగింది. అందువల్ల రెండు లాభాలు. తన ప్రత్యర్థి తనవాడై పోతాడు. తనఫైలు పెరుగుతుంది.

కాని ఎలా?

అతనితో స్నేహంచేశాడు. ఇంటికి పిల్చాడు. విందులిచ్చాడు. కూతుర్ని పరిచయం చేశాడు.

రాకపోకలు పెరిగాయి.

జూనియర్ చేసుకొందామని రంగారావు గాలంవేస్తే, అల్లుడు కావటానికి అతను ఎత్తువేశాడు.

'ఏమిటి నాన్నగారూ ఆలోచిస్తున్నారు?'

రంగారావు కూతురువైపు చూచాడు. కాస్తసర్దుకొని కూర్చోని తలవూపుతూ అన్నాడు–'అయితే అతన్ని ప్రేమించావంటావు? మరి అతను నిన్ను ప్రేమించాలిగా? ప్రేమిస్తున్నానని నీతో చెప్పాడా?'

చెప్పేడన్నట్లు తల ఆడించింది.

రంగారావుకు కోపంవచ్చింది. ఆ విషయం చిన్నపిల్లదగ్గరి కెళ్ళి చెప్పే బదులు తనతో చెప్తేనేం? కాదంటాడా తను?

'నా దగ్గరి కొచ్చి నా కూతుర్నివ్వమని అడిగేదాకా యీ ప్రేమల్ని, పెళ్ళిళ్ళను నేను అంగీకరించను–' గట్టిగా అన్నాడు.

'అతను మీవద్దకొచ్చి అడగట్ట–'

'అడగడూ?'

'ఆడపిల్ల తండ్రి – మీ నాన్నగారే నన్ను అడగాలని చెప్పాడు.'

రంగారావు ఆలోచించాడు. తను అడిగితే ఒప్పుకొంటా డన్నమాట!

'ఊఁ...'

ఇంత విని ఆఖరికి 'ఊఁ'తో వూరుకొన్నాడంటే అవతలవాడు చెప్పింది అంగీకరించినట్లేనని అర్థం.

రంగారావు వెళ్ళేసరికి అత నేదో పుస్తకం చదువుతున్నాడు. ఆయన్ని మర్యాదచేశాడు.

'మీరు – కష్టపడి మీ రింతదూరం రావాలా? కాకితోకబురు పంపిస్తే...'

రంగారావు పొంగిపోయా డతని మాటలకు.

'నువ్వు వొచ్చేపనికాదు లేవోయ్. ఆడపిల్ల తండ్రిని – నేను రావల్సినపనే. అమ్మాయి అంతా చెప్పింది లేవోయ్–'

అతను ముసిముసి నవ్వులు నవ్వాడు.

'అమ్మాయి నిన్నే ప్రేమిస్తున్నదిట. నిన్నే పెళ్ళి చేసుకొంటానని – అది వ్రాసిన నవలల్లో కథానాయికలాగా తెగేసి చెప్పింది. ఎలా కాదనను చెప్పు? నీకూ అభ్యంతరం లేకపోతే...'

'నా కేం అభ్యంతరం లేదు కానీండి, మీరే బాగా ఆలోచించడని నా సలహా. నే నేం డాక్టరును కాను, ఇంజనీరును కాను, నిన్నగాక మొన్న బోర్డుకట్టిన ప్లీడర్ని–'

రంగారావుకీ మాటలు ఎక్కడో విన్నట్లనిపించింది. పరీక్షగా అతనివైపు చూచాడు.




'ప్లీడరుబోర్డు కట్టగానే కేసులొస్తాయన్న గ్యారంటీ ఏమిటి? ... ప్రేమించే మంచిహృదయం తప్ప. నాలో ఏం చూచి మీ అమ్మాయిని నా కిస్తామంటున్నారు?'

రంగారావుకి అతనితో పరిచయం ఎక్కడయిందీ యిప్పుడు జ్ఞాపకం వచ్చింది.

'అయినా మీ రడుగుతున్నారు కనుక– ఆల్‌రైట్ – మీ అమ్మాయిని పెళ్ళి చేసుకోటానికి వొప్పుకొంటున్నాను–' ఆ అనటంలో ఠీవివుంది, అమాయకత్వం వుంది, ప్రేమవుంది.

అయితే ఆనాడు అన్నమాటను అతను అక్షరాలా నెరవేర్చుకొన్నా డన్నమాట! తనని ఓడించా డన్నమాట.

అయినా అతను తనని యివాళ ఓడించట మేమిటి? నల్లగొను వేసుకొన్న మొదటిరోజే మాటల్తో ఓడగొట్టేడు. ఆ తర్వాత కేసులో ఓడించాడు. అలా ఎన్నిసార్లు తనని – తన వ్యూహాల్ని తారుమారుచేసి ఓడగొట్టలేదు కనుక? – అయినా తనకి కోపంరాలేదు, పైగా ప్రేమే పెరిగింది.

రంగారావు నవ్వుకున్నాడు ఆనందంగా.

'జయించావోయ్ అల్లుడూ...నువ్వే జయించావు. ఒప్పుకొన్నా–' భుజం మీద గట్టిగాచరుస్తూ ప్రేమగా అన్నాడు. 'కాని నీకు వూరికే అమ్మాయిని యివ్వటంలేదు. కన్యాశుల్కంగా నువ్వా సీతా

రామయ్యను వదిలి నాదగ్గర జూనియ ర్‌గా చేరాలి_'

అతను నవ్వేడు _ 'అంటే మీ రింకా ప్లీడరువృత్తి సాగిద్దా మనుకొంటున్నా రన్నమాట! నేనుండగా మీ కెందుకు సార్ యింకా ఆ శ్రమ? ఆ పనులన్నీ నేను చూచుకొంటాగా? మీరు హాయిగా ఆ వృత్తిమానేసి_'

'అయితే నన్ను అప్పుడే వానప్రస్తం స్వీకరించ మంటావా ఏమిటి?'

'కాకపోతే రాజకీయాలు వృత్తిగా స్వీకరించండి. మీలాంటివాళ్లు ఆ వృత్తిలో 'షైన్' కావచ్చు. మీ పద్ధతులు అక్కడ బాగా పనికొస్తాయి. న్యాయవావృత్తిలోద ఆ పద్ధతులు పనికిరావు సార్. అందు వల్ల యీ వృత్తి మీకూ లాభదాయకం కాదు _ ఆ వృత్తికీ శ్రేయసక్కరంకాదు.'

ఆలోచిస్తే అల్లుడు చెప్తున్నమాట లోనూ 'రీజన్' కన్పించింది రంగారావుకు. 'పొలిటీషియన్' కావాలన్నది తన చిర కాల వాంఛ. అల్లుడిపుణ్యమా అని అది తీరుతోం దిప్పుడు.

ఎన్నో ఏళ్ళుగా ఆ యింటిముందు వేలాడుతున్న 'రంగారావు, బి.ఎ.బి.ఎల్, అడ్వొకేట్' అన్న పాతబోర్డు స్థానంలో, 'కె. మురళీమోహన్. బి. ఎ. బి. ఎల్. న్యాయవాది' అన్నబోర్డు వెలిసింది.

ఆ బోర్డుల మార్పిడీ జరిగిన రోజు రాత్రి _

సత్యవతి అతని గదిలోకి వెళ్ళింది. అతను 'లా' పుస్తకంకు బదులుగా ఆమె వ్రాసిన పాతనవల నొకదాన్ని చదువు తున్నాడు.

ఆమె ఆ పుస్తకం మూసేసి తనని పలకరిస్తాడని ఎదురుచూచింది. ఊహుఁ. ఎంతకూ దాన్ని వదలందే.

తనేవెళ్ళి ఆ పుస్తకాన్ని మెల్లగా లాగి అవతలపడేసి నవ్వింది సత్యవతి.

'నువ్వప్పుడే వచ్చావా? కాస్సేపు నవలేదైనా వ్రాసుకొంటావనుకొన్నాను_'

అన్నాడే కాని అతనికీ తెల్సు, ఆమె యిక అలాంటి నవలలు వ్రాయదని _ వ్రాయలేదని. కలలు కనేకాలం, కోరిక లను పెంచుకొనే కాలం గతించిపోయింది. వాస్తవ జీవితం రుచిచూస్తూ, కోరికలను అందినంతమేర తీర్చుకొనే కాలం వచ్చింది.

'ఉహు__' అందామె_'ఇంకా ఎందుకు నేను నవలలు వ్రాయటం? మీ రున్నా రుగా నాకు!'

అత నామెను అప్యాయతతో దగ్గరికి తీసుకొన్నాడు.

---



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచి: తరువాయి)

"అదేమిటి ? నెయ్యి వేసుకోకుండా తినేస్తున్నారే ? అప్పుడంకూడా తీసుకోలేదు అంటూ నేను యాపిల్ ముక్కలు చప్పున ప్లేట్ లో సర్ది నాన్నగారి పక్కనపెట్టి నేతిగిన్నె తెచ్చి నెయ్యి వేయసాగాను.

ఆయన చాలుచాలు అంటున్నారు.

ఇంతలో గుమ్మంలో అలికిడి అయింది. నేను తిరిగిచూసాను. భోజనాల గదిలోకి రాబోతున్న అమ్మ హఠాత్తుగా గుమ్మంలోనే ఆగిపోయింది. ఒకే ఒకనిముషం. అమ్మ నిలువునా క్రోధాగ్ని జ్వాలలతో దహించుకుపోతున్నట్లుగా మారింది.

కనుబొమలు చిత్రంగా ఎగరేస్తూ, "భేష్." అంది.

నాన్న నేను అప్రయత్నంగా ముఖాలు చూసుకున్నాము.

నేను గిన్నె టేబిల్ మీదపెట్టి అమ్మ ప్లేటుకూడా పెట్టాను.

ఆవిడ లోపలకు రాలేదు. ఆగిపోయిన చోటునుంచి ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేదు. అక్కడే తలుపుని ఆనుకుని నిలబడింది.

ఆవిడ కళ్ళు రోషాగ్నిజ్వాలలతో భగభగలాడుతున్నట్టుగా నా వైపు చూసినాయి.

"ఎంతటిదానివే మీనా. స్వయంగా దగ్గరుండి వడ్డనచేసి మరీ తినిపిస్తున్నావు. నేను కూడా భోజనం మానేసిన మనిషినే. ఆ భాగ్యం నాకు లేకపోవటానికి నేనేం పాపం చేసాను!"

"అమ్మా !"

"నన్ను కనీసం మాటవరసకైనా భోజనానికి రమ్మనమని పిల్చావా నువ్వు? నేనేంచేసానని నామీద నీ కింత కక్ష."

"అమ్మా !" నిస్సహాయంగా అన్నాను.

"నా మనసు ఎప్పుడూ నీ చుట్టూ తిరుగుతూవుంటుందే? నీ సుఖంకోసం నీ భవిష్యత్‌కోసం అహర్నిశలూ హైరానపడి ఛస్తున్నానే నేను! కనీసం నీ నోటి నుంచి ఒక చల్లటి మాటకుకూడా నోచుకోలేదు నేను. నేనేం పాపం చేసాను !"

నేను నాన్నగారివైపు చూసాను.

ఆయన నావైపు చూడటంలేదు.

అన్నంలోకి చూస్తూ మెతుకులు కెలుకుతున్నారు.

అమ్మ హఠాత్తుగా తలుపుకేసి తల బాదుకుంటూ అంది. "నా కెవరూ లేరు. నే నెవరికీ అవసరంలేదు. నేను చచ్చినా బ్రతికినా ఒకటే."

"అమ్మా !" చప్పున పరుగెత్తుకుంటూ దగ్గరగా వెళ్ళి వారించబోయాను. అమ్మ నా చేతుల్ని విసురుగా తోసేసింది.

"ఆయనకి తెలుసు. నా ప్రాణాలన్నీ నీ మీదే పెట్టుకుని బ్రతుకుతున్నానని బాగా తెలుసు. ఎటువైపునుంచీ నన్నేమీ చెయ్యలేక యీ విధంగా నిన్ను దూరంచేసి నా మీద కసిగ తీర్చుకుంటున్నారు. మీనా. మీనా! నువ్వెంత మూర్ఖురాలివే. నా కడుపు కోత నీ కెప్పటికి తెలుస్తుందే?"

"అమ్మా! ఏమిటమ్మా యిది_" అమ్మని బలవంతంగా నావైపు తిప్పుకుని పొదివి పట్టుకున్నాను.

అమ్మ హఠాత్తుగా నేను వూహించని విధంగా నా గుండెల్లో ముఖం దాచుకుని చిన్నపిల్లలా వెక్కి వెక్కి ఏడవసాగింది.

నా కెలాగో అన్పించింది.

నాన్నగారు భోజనంముందునుంచి లేచి చెయికడుక్కొని వెళ్ళిపోయారు. అమ్మ ఏడుస్తూనే అంది.

"మీనా ! నాలాటి దురదృష్టం పగవాళ్ళకికూడా వద్దు. భగవంతుడు ఆడదానికి ఏమిచ్చినా యివ్వకపోయినా మనసుగ్రహించే మొగుడునివ్వాలి. లేకపోతే కష్టం. మాటల్లో చెప్పలేనంత నరకయాతన."

అమ్మమాటలు నాకర్థంగాలేదు.

అమ్మ పెళ్ళయి దాదాపు పాతిక సంవత్సరాలు అయింది.

ఇన్ని సంవత్సరాల సాన్నిహిత్యంతో నాన్నగారిలోవున్న మరోవైపుని అమ్మ చూడలేకపోయిందంటే చాలా విచిత్రంగా, విషాదంగా అన్పిస్తోంది.

నాకిప్పుడు అర్థం అవుతోంది.

ఇద్దరిమధ్యా ఎలా ఏర్పడిందో అభిప్రాయభేదాలు అనే అడ్డుగోడ ఏర్పడింది. ఇద్దరిలో ఏ ఒక్కరూ దాన్ని ఛేదించాలని చూడకుండా, ఎవరికివారే అవతలివారు దూకి తమవైపు రావాలని అనుకుంటున్నారు. ఇరువురికీ ఎవరు లొంగిపోతే వాళ్ళు అభిమానం లేనివాళ్ళుగా రెండోవాళ్ళు జమకడతారేమోననే భయంకూడా చాలావుంది. అందుకే యిద్దరూ పట్టుదలని గట్టిగా పట్టుకుని వేళ్ళాడుతున్నారు.

నాన్న ఆలోచిస్తే లోపం అమ్మలోనే వున్నట్టుగా తోస్తుంది.

నాన్నంత సహృదయులు కరుణగలవారు నూటికి ఒక్కరుకూడా వుండరేమో. ఆయన ఒకరకంగా అమ్మనిబాగా అర్థంచేసుకున్నారు కాబట్టే, లోకం అన్యాయంగా, హేళనగా ఆయనకు, 'భార్యావిధేయుడు' 'అమాయకుడు' అని ఆపాదించిన బిరుదుని స్వీకరించి వూరుకున్నారు.

నాన్నగారు నిజంగా కోరుకుంటే వాటిని వదిలించుకోవటం అంత కష్టమేమీకాదు. కానీ దానికోసం అమ్మని హింసించాలి.

తను అధికురాలిననే అహంకారం అణువణువునాకల అమ్మతో ఆయన ఇన్ని సంవత్సరాలు గడిపారంటే అది ఆయన సహనానికి చిహ్నమే.

అమ్మ కళ్ళకివున్న అహంకారపుపొరే నాన్నలో మరోవ్యక్తిని చూడనివ్వకుండా అడ్డుపడుతోంది.

ఈ యిద్దరిమధ్యా బలమైన అడ్డుగోడ వుందని, వీరనుకునే ఆ గోడకి ఎంతచిన్న విషయం పునాదిరాయిగా నిలబడిందో నాకిప్పుడిప్పుడే అర్థంకాసాగింది.

న్యాయంగా చూస్తే నారాయణ విషయంలో అమ్మ యింత హంగామా చేయటం విపరీతంగానే వుంది.

నాలుగురోజులు చూసి వాడిలో ఏదో తప్పు వెతికి నాన్నగారికి చూపించి అప్పుడే పంపేస్తే పోయేది.

ఒక్క మా అమ్మేకాదు. యిలా బైటవిషయాల్లో చాలాసమర్థులుగా వ్యవహరించే వ్యక్తులు చాలామంది యింటి విషయాల్లో యిలాగే తెలివితక్కువగా ప్రవర్తిస్తూ వుంటారు.

అమ్మ ఏడుపు వుధృతం తగ్గింది.

నేను అనునయంగా అన్నాను.

"ఇంతక్రితం నేను నీ గదిలోకి వచ్చింది నిన్ను భోజనానికి రమ్మనమని అడగటం కోసమేనమ్మా. నువ్వు చాలా చిరాకుగా వున్నావని ఆట్టే తర్కించక యివతలకు వచ్చేసాను".

"నీ యిచ్చకాలు నాదగ్గర చూపించకు. నాకేంవద్దు. తలనొప్పితో పగిలిపోతోంది. ఒక కప్పు కాఫీ చేసుకుందామని వచ్చాను. శారిడాన్ వేసుకోవాలి."

"అలాగేనమ్మా. నువ్వెళ్లి పడుకో. నేను ఐదునిమిషాల్లో తయారుచేసి తీసుకువస్తాను."

"అంతకష్టం నీ కెందుకులే."

అమ్మ విసిరిన వ్యంగ్యాన్ని మింగివూరుకున్నాను.

"నాకేం కష్టం లేదమ్మా. నీకూ, నాన్నగారికి నేను ఏ కాస్త చేయగలిగినా నాకది కొండంత సంతోషంగా వుంటుంది. తాయారమ్మవుంటే నాకు కావాలన్నా యీ అవకాశం దక్కదు."

అమ్మ మరేం మాట్లాడకుండా ముఖం తిప్పుకుని అక్కడినుంచి వెళ్లిపోయింది.

నేను అన్నం అవీ తీసేసి మూతలు పెట్టేసాను.

నాన్నగారు వదిలేసిన ప్లేటుతీస్తుంటే అప్రయత్నంగా నా కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

పాపిష్టిదాన్ని. ఆయన్ని అన్నానికి రమ్మనమని బలవంతం చేయకుండా వున్నాపోయేది. వీళ్లిద్దరూ యిలా చీటికిమాటికి రాద్ధాంతంచేసుకుని అన్నం మానేసిన రోజులు ఎన్నోవున్నాయి. ఇదివరకయితే నాకు విసుగువేసేది. కానీ ఈరోజు ఎందుకో చెప్పలేనంత బాధగావుంది. ఈ ప్రపంచంలో ఎంతోమంది పట్టుమని పద్దెడు మెతుకులు దొరికితేచాలని అల్లాడిపోతున్నారు. అన్నివిధాలా వున్నవీళ్లకి ఆనందంగా అనుభవించకుండా యిదెక్కడి దారిద్ర్యం! మనుష్యుల్లో నూటికి 80 మంది యిలాగే బాధలు సృష్టించుకుని జీవితంలో తృప్తిలేదని అల్లాడిపోతారేమో.

గాస్‌స్టవ్ వెలిగించి అమ్మకి స్ట్రాంగ్‌కాఫీ కలిపి, కప్పులోపోసి, మరో కప్పు పాలు బాగా వేడిచేసి పక్కన పెట్టాను.

నేను కాఫీ తీసుకుని వెళ్ళేసరికి అమ్మ మంచంమీద కూర్చుని క్లబ్ కాగితాలేవో చూసుకుంటోంది. ఆవిడకి చాలా బాధ కలిగినప్పుడు అలా మనసు మరో విషయంమీదికి మరల్చుకుని మెల్లగా బాధని మర్చిపోవటానికి ప్రయత్నించటం నే నిదివరకుకూడా చాలాసార్లు చూసాను.

డ్రాయర్ సొరుగుతీసి శారిడాన్ తీసి అమ్మకిచ్చాను.

అది వేసుకుని కాఫీ తాగింది.

కాఫీ తాగుతుంటే డ్రాయర్ అంచుకు ఆనుకుని నిలబడిన నేను దీపపు వెలుగులో పరీక్షగా అమ్మముఖం వైపు చూసాను.

ఎప్పుడూ ఎంతో చురుకుగా, కళగావుండే ఆ ముఖం యిప్పుడు చాలా పాలిపోయి నట్లుగా, ఎలాగో వుంది. వాటి కిరుప్రక్కలా ముడతలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

మొన్న ఎయిర్‌పోర్ట్‌లో కూలింగ్ గ్లాసెస్‌పెట్టుకుని, పెద్దపెద్ద పువ్వులున్న చీరకట్టుకుని, సారథి పక్కన పది సంవత్సరాలు వయసు తగ్గినట్టుగా హుషారుగా కనిపించిన వ్యక్తి యీ మనిషేనా అన్పించింది.

కాఫీ తాగి కప్పు నా చేతికిచ్చిన అమ్మ వెనక్కు వాలి దిండుమీద తల ఆనించి కళ్లు మూసుకుంటూ, "ఆ కాగితాలు సర్ది టేబిల్‌మీద పెట్టి లైటుతీసి వెళ్ళిపో," అంది. అమ్మ చెప్పినట్టే చేసాను. కాగితాలు సర్దిపెట్టటమే గాకుండా, తల క్రింద దిళ్ళు సరిచేసాను. దోమతెర దింపాను. కిటికీ తెరలు పక్కకులాగి కట్టాను. లైటు తీసేసి, తలుపులు దగ్గరగావేసి బైటికి వచ్చాను.

వంటయింట్లో చల్లారిపోతున్న పాలు గుర్తుకు వచ్చాయి. చకచకా దిగి వెళ్లాను.

5 నిముషాల అనంతరం నాన్నగారి కోసం ఆఫీసు రూమ్‌లో చూసాను.




## విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాప హాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం : జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయచ్చు.

ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది :

1. 

బయట-చర్మం మీద

2. 

లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.
2. లోపల-ఊపిరి ద్వారా : విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి. ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

**ప్రత్యేక గమనిక**

బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద. గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




516C A

## విక్స్ వేపొరబ్ - జలుబుబాధలకి ఆధునిక ఔషధం

అక్కడలేరు. పడకగది వైపు వెళ్ళాను. ఎప్పుడూలేంది ఈ రోజు తలుపులు లోపల వేసుకున్నారు.

తలుపుమీద తట్టాను.

''ఎవరు ?''

''నేను.''

''మీనా ?''

''అవునండీ.''

ఆయన లేచివచ్చి తలుపు తీశారు.

నా చేతుల్లో వున్న ట్రే చూస్తూ, ''ఏమిటమ్మా'' అన్నారు.

''ఈ యాపిల్ ముక్కలుతిని పాలుతాగేయండి. నేను ఇంకేమీ మాట్లాడను,'' అన్నాను.

''నువ్వు భోజనం చేశావా ?''

లేదన్నట్టు తలూపాను.

''ఎందుకని ?''

''ఆకలిగా లేదండీ.''

ఆయన దారి తొలిగి నిలబడి నేను లోపలకు వచ్చేందుకు తోవయిచ్చారు.

నేను ట్రే తీసుకువచ్చి మంచం ప్రక్కనవున్న స్టూలుమీద పెడుతుంటే ఆయన గాఢంగా నిట్టూర్పు విడవటం విన్నాను.

యాపిల్‌ముక్కలు సగంపైగా తీసి నా కిచ్చేశారు.

నేను తినేవరకూ వూరుకోలేదు.

పాలు రెండుగుక్కలు ప్లేట్‌లో పోసుకుని మిగతావి నా కిచ్చేసి తాగమని బల వంతం చేశారు. నే నవి తాగుతుండగా హఠాత్తుగా అన్నా రాయన.

''మీనా. నా కోరిక ఒకటుంది. అంగీకరించాలి నువ్వు.''

''చెప్పండి.''

''సాధ్యమైనంత త్వరగా నువ్వుపెళ్లిచేసుకుని యీ యింటినుంచి వెళ్లిపోవాలి.''

నేను చకితురాలయినట్టు తలెత్తి చూశాను.

ఆయన కళ్ళలో వేదన, విషాదం గూడుకట్టుకుని వున్నాయి.

''ఔను మీనా. నువ్వు వీలయినంత త్వరగా పెళ్లి చేసుకోవాలి.''

''కానీ, కానీ_ అమ్మ నన్ను వేరేయింటికి పంపే వుద్దేశ్యంలో లేదే.''

''నువ్వు ఏర్పరుచుకో.''

"నాకు కాబోయే భర్తే యిల్లరికం రావటానికి అనుమతిస్తే?"

"అలాటివ్యక్తిని నువ్వు కల్లోకూడా భర్తగా ఒప్పుకోకు."

"నా యిష్టాయిష్టాలకి విలువ వుందంటారా?"

"వుండేలా చూసుకోవాలి నువ్వు."

కొద్దిసేపయిం తర్వాత నేను నాన్నగారి గదిలోంచి యివతలకి వచ్చేశాను. నా మనసంతా దిగులుగా, చేదుగా ఎలాగోవుంది. నాన్నగారు నా కిచ్చిన సలహా ఏమిటో, ఆయన కోరుకుంటున్న దేమిటో స్పష్టంగా తెలిసిపోతోంది నాకు. నాదంటూ ఒకయిల్లు ఏర్పడాలి నాకు. నా నీడలో వాళ్ళిద్దరికీ ఆశ్రయం వుండాలి కానీ వాళ్ళ దగ్గర నే నుండకూడదు. నాదంటూ ఒకయిల్లు స్వతంత్రంగా వుంటే నే నెవరి అధికారాలకి తలవంచ నవసరం లేదని నాన్న అభిప్రాయం. నేను స్వతంత్రంగా, ఆనందంగా బ్రతకాలని ఆయన మనస్ఫూర్తిగా వాంఛిస్తున్నారు.

గదిలోకి వచ్చి మంచంమీద పడుకున్న నాకు చాలాసేపటివరకూ నిద్రపట్టలేదు. కిటికీలోంచి కన్పిస్తున్న ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి. నా కెందుకో చాలా అలసటగా అన్పించింది.

ఈ యింట్లో దేనికీ కొదవలేదు, అన్నీవున్నాయి; ఒక్కమనశ్శాంతితప్ప అన్పించసాగింది.

*　　*　　*　　*

# 21

సారథి వుండటంవల్ల యింట్లో అనుకున్నంతగా గాలిదుమారం రేగలేదు. అమ్మ బలవంతంగా తన కోపాన్ని లోలోపల దిగమింగాల్సి వచ్చింది. ఎందుకంటే, సారథి డైరెక్టర్ అయే అవకాశం కలుగుతున్న ఆ కంపెనీ ఓపెన్ చేయటానికి, దానికి కావాల్సిన పనులు చక్కపెట్టుకోవడం కోసం వారిని,వీరిని కలిసే ప్రయత్నంలో అమ్మ తప్పనిసరిగా నాన్నగారితో మాట్లాడాల్సి వచ్చేది. నాన్నగారుకూడా అడిగిన దానికి సూటిగా, క్లుప్తంగా, నిరాసక్తిగా జవాబుయిస్తూవుండేవారు. సారథి ఎదురుగా వున్నప్పుడు ఇద్దరూ ఎంతో ఆప్యాయంగా, ఒకరిమాటంటే మరొకరికి ఎంతో గౌర వాభిమానాలు వున్నట్టుగా మాట్లాడుకునేవారు. కానీ ఎవరైనా కాస్త శ్రద్ధగా వారి ముఖాలని చూసినట్టయితే ఆ అభిమానం అనేది ప్రదర్శనఅని, ఆ మాటల అడుగున ఆత్మీయత లోపించినట్టు యిట్టే తెలిసిపోతుంది. సారథి ఎదురుగా వున్నప్పుడు ఎంతో అభిమానంగా ప్రవర్తించే ఆ యిద్దరూ అతను అటు వెళ్ళగానే ఎడమొహం పెడముఖంగా అయిపోయేవారు. దాదాపు 10, 12 రోజులున్నా సారథి ఏ ఒక్క నాడుకూడా, అమ్మ, నాన్నలమధ్య అభిప్రాయ భేదంలాటిది వున్నట్టే గుర్తించలేదు. ఒక్కసారికూడా , "ఏం మీనా ? మీ అమ్మా, నాన్నలమధ్య ఏమైంది ?" అంటూ ఒక్క చిన్నమాట నన్ను అడగలేదు. అతనలా అడిగివుంటే నాకెంతో సంతోషం వేసేది. ఆ అడగకపోవటంవల్ల నా మనసులో అతనంటే ఏర్పడిన భావం అతను కల్లోగూడా వూహించలేడు.

అమ్మ తరచుగా మాటిమాటికీ, "భగవంతుడు సరిగాచూస్తే, ఒకటి రెండు నెలల్లో సారథి యిక్కడికి వచ్చేస్తాడు. అప్పుడిక ఏ యిబ్బందులూ వుండవు" అనటం మొదలుపెట్టింది – మహా అతనేదో పెన్నిధి అయినట్టు! ఇంతక్రితం యిన్ని సంవత్సరాలూ అతను లేనప్పుడు మాకు సుఖంగా గడవనట్టూనూ! నాకు ఒళ్ళు మండేది. యీ మాట ఒకటి రెండుసార్లు పైకి అనేయాలనిపించికూడా నిగ్ర హించుకున్నాను.

మా యింట్లో వాతావరణం మామూలుగా అయిపోయింది.

అమ్మవచ్చిన నాలుగురోజులకే తాయారమ్మ వచ్చేసింది.

# సక్రమంగా బ్రషుతో తోముటవలన ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టు పళ్లచిగుళ్ల బాధలను దంత క్షయమును నిలుపును

చిగుళ్ల బాధలను దంతక్షయమును నిలుపుటలో ఫోర్‌హాన్స్ టూత్ పేస్టు సాధించిన అద్భుతమైన ఫలితాలను. చిన్నా పెద్దా అనేభేదంలేకుండా అయాచితంగా చేసిన ప్రశంస లెలావున్నాయో చదవండి. ఈ ప్రశంసా పత్రాలను జెఫ్రి మానర్స్ అండ్ కంపెనీ వారి యే కార్యాలయములోనైనా చూడవచ్చును.

'నేను పళ్ళజబ్బులతో బాధపడుతుండే వాడిని అప్పుడు ఫోర్‌హాన్స్ టూత్ పేస్టు వాడి చూచేను. .ఇప్పుడు అటువంటి జబ్బులేమి లేవు. షుమారు 20 నుండి 25 మంది వరకు ఇప్పుడు ఫోర్‌హాన్స్ ఉపయోగిస్తున్నారు. మా ఇంట్లో అయితే ఫోర్‌హాన్స్ తప్ప వేరే మాట వినబడదు.''

ఉదయశంకర్ తివారీ, పాట్నా

"శాస్త్రీయంగా నిర్మింపబడిన మీ ఫోర్‌హాన్స్ టూత్ పేస్టు నేను గత పది సంవత్సరాల నుంచి ఉపయోగిస్తున్నాను; నా చిగుళ్ళ బాధలన్ని టని పోగొట్టింది. ఇప్పుడు మా ఇంట్లోని వారంతా క్రమంగా ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతోనే బ్రష్ చేస్తారు."

ఎస్.ఎమ్ లాల్, ఢిల్లీ

సరియైన పంటి జాగ్రత్తకోసం ప్రతిరాత్రి, ప్రొద్దుటా ఫోర్‌హాన్స్ టూత్ పేస్టును, ఫోర్‌హాన్స్ డబుల్-యాక్షన్ టూత్ బ్రష్‌నూ వాడండి....మరియు మీ దంత వైద్యుని వద్దకు నియమానుసారము వెళ్లండి.




ఉచితము! 'పళ్ళు ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ' అనే రంగుల చిన్న పుస్తకం, ఇంగ్లీషు తెలుగు భాషల్లో లభిస్తున్న యీ చిన్న పుస్తకము కావలసినయెడల యీ కూపన్ ను 10 పైసల తపాలా బిళ్లతోపాటు (తపాలా ఖర్చుల నిమిత్తం) మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో. పోస్టు బ్యాగ్ నం 10031 బొంబాయి-1కి పంపండి.

పేరు ______________ వయస్సు ______

చిరునామా ______________

భాష ______________

ఒళ్ళుచేసి గుమ్మటంలావున్న తాయారమ్మని చూడగానే, నాకు ఆవిడ కూతురికి సుస్తీ చేసిన విషయం నిజమేనా అన్న అనుమానం వచ్చింది. నాన్నగారుకూడా తనకూ అలాటి అనుమానమే కలుగుతోందని అన్నారు. మా అమ్మ ఎప్పుడూ ప్రయాణం పడనివ్వదని, ఆవిడ వూరు వెళ్తుందని తెలిసి, అలా టెలిగ్రాం తెప్పించుకుని నాలుగురోజులు కూతురిదగ్గర హాయిగా, సుఖంగా గడిపివచ్చినట్టుంది. బహుశా అందుకే ఆ రోజు నన్నంత మొండిగా రానివ్వలేదేమో !

నా నిమ్మలూరు ప్రయాణం గుర్తుకువస్తే నేను నమ్మలేనట్టుగా, ఆశ్చర్యంగా అన్పిస్తోంది. ఆ వెళ్ళివచ్చింది నేనేనా ! ఇంత కలిమిలో పుట్టి, యింత అపరూపంగా పెరిగిన నేను, బీదరికం నిండిన ఆ యింట్లో అంత ఆనందంగా, హాయిగా ఎలా గడిపివచ్చాను ! అదంతా గుర్తుచేసుకుంటూంటే ఎలాగో వుంది. ఈ మనుష్యులు ఎంత వెర్రివాళ్ళు ! సంపదకి సుఖానికి లంకెపెడ్తారు. ఈ రెండింటికి అసలు సంబంధం లేదని నా నిమ్మలూరు ప్రయాణం నాకోపాఠం నేర్పింది.

నా ప్రయాణానికి చిహ్నంగా బీరువాలో జరీఅంచు తెల్లచీర, నాన్నగారి లాబుక్స్ వెనక ఒక ఫొటో రీలు మిగిలినాయి. ఈ రెండూలేకపోయినట్టయితే నా ఆ, అనుభవంఅంతా, నేను కలా అని భ్రమపడే ప్రమాదం ఏర్పడివుండేది. అందుకే కాబోలు, కృష్ణ, యిక్కడినుంచి నువ్వేమీ జ్ఞాపకాలు తీసుకు వెళ్ళటానికి వీల్లేదని పదే పదే హెచ్చరిస్తూ వచ్చాడు. బహుశా నేనిలా భావిస్తానని అతను అప్పుడే గ్రహించాడేమో ! నాకు కృష్ణగాని, రాజేశ్వరిగాని గుర్తుకువస్తే ఎలాగో అన్పిస్తోంది.

జీవితంపట్ల వాళ్ళ చొరవ, బాధలు పడటంలో వాళ్ళు చూపించే ధైర్యం, సమస్యలు పరిష్కరించుకోవటంలో చూపుతున్న చాకచక్యం, సమర్థత, యివిచూస్తే వాళ్ళు అంతకంటే మంచి జీవితానికి అర్హులని అనిపించసాగింది.

నేను నిమ్మలూరునుంచి వచ్చిన తర్వాత వాళ్ళకి ఒక్క వుత్తరంకూడా వ్రాయలేదు. ఈ బాధ నా అంతర్యంలో నేను వంటరిగా వున్నప్పుడల్లా కలుక్కుమని గుచ్చుకుంటూనేవుంది. నేను వుత్తరం వ్రాస్తే రాజేశ్వరి తప్పకుండా జవాబు వ్రాస్తుంది. నా కేదయినా వుత్తరంలాంటిది వస్తే అమ్మ కంట పడకుండా తప్పటం అనేది అసంభవం. దానితర్వాత ఫలితం నేను తేలికగానే వూహించుకోగలను.

అసలే నారాయణ విషయంలో కారాలు, మిరియాలు నూరుతున్న అమ్మ, యిది సాకుగా తీసుకుని నాన్నగారిని ఎన్నిమాటలయినా అనేయగలదు. ఆ భయమే నన్ను ఒకటి రెండుసార్లు వుత్తరం వ్రాయబోతుంటే బెదరగొట్టి ఆ ప్రయత్నంనుంచి విరమించేలా చేసింది.

రాజేశ్వరికి పుత్తరం వ్రాయలేను. వ్రాయకుండా వుండలేను: నా పరిస్థితి త్రిశంకు స్వర్గంలా వుంది.

అదీగాకుండా అక్కడ నేను తెలుసుకోవాలని తహతహలాడుతున్న విషయాలు కూడా కొన్నివున్నాయి.

రాజేశ్వరి పెళ్ళిసంగతి ఏమైందో!

నేను అక్కడ అంత చనువుగా కబుర్లుచెప్పి యిక్కడకు వచ్చిన తర్వాత ఒక్కకార్డుముక్కకూడా వ్రాయనందుకు కృష్ణ ఏమనుకున్నాడో!

కృష్ణ ఏమనుకున్నా ఫర్వాలేదు. ఎలా అనుకున్నా నేను లక్ష్యపెట్టను.

కానీ రాజు! రాజు గుర్తుకు వచ్చినప్పు డల్లా నాకు దొంగతనం చేసినంత సిగ్గుగావుంది. తప్పకుండా వుత్తరాలు వ్రాస్తానని, మర్చిపోనని, ఎన్నెన్నో చెప్పి వచ్చాను. ఒక్కమాట నిలబెట్టుకోలేకపోయాను. వాళ్ళ నిష్కల్మషమైన అభిమానానికి జ్ఞాపకచిహ్నంగా మిగిలిన జరీఅంచు తెల్లచీర నన్నుచూసి వెక్కిరిస్తున్నట్టుగా వుంది. నా యీ బాధంతా నాన్నగారితో చెబితే, "నేను కృష్ణకి నువ్వు క్షేమంగా

చేరినట్టు ఉత్తరం వ్రాశాను. సారథి వచ్చాడని, నువ్వు తీరిక లేకుండా వున్నావని, రాజుతో చెప్పమనికూడా వ్రాశాను నువ్వు వ్రాయలేదని వాళ్ళేం అనుకోరులే" అన్నారు.

నా ముఖం ఎరుపురంగుకి తిరిగింది.

నేను సారథితో బిజీగా ఉండి వ్రాయలేకపోయనా! ఇది నిజమేనా!

నేను గదిలోంచి వెళ్ళబోతూ ఆగి అడిగాను. "నాన్నగారూ! మీరు కృష్ణకి, అత్తయ్యకి నన్ను బాగా చూసినందుకు థ్యాంక్స్ చెబుతూ వ్రాశారా?"

ఆయన నవ్వారు.

"అలాటివి వాళ్ళకి తెలియవు. వాళ్ళ మామయ్య కూతురివిగా నిన్ను బాగా చూడటం వాళ్ళధర్మం అనుకుంటారు."

"కానీ కృష్ణ వేరు నాన్నగారు."

"అవును. వేరు. చాలా వేరు." ఆలోచనగా అన్నారాయన. ఎందుకో ఆయన ముఖం విషాదంగా మారింది. తాయారమ్మ కాఫీ తీసుకుని లోపలకు రావటంతో మా సంభాషణ ఆగిపోయింది.

ఆ రోజు అమ్మా, నాన్న, సారథి ముగ్గురూ పనిమీద ఎవరినో కలుసుకోవటానికి వెళ్ళారు. వాళ్లు యిక్కడ పెట్టబోయే కంపెనీ గురించి ఆయనతో చాలా సేపు ఏదో చర్చించాలట నాన్నగారు నన్ను వద్దులే అన్నారు. ఏ కళనుందో అమ్మకూడా అంత బలవంతం చేయలేదు. సారధి సరే సరి. నేను వచ్చినా, రాకపోయినా అతనికి ఒకటేనని నా కెప్పుడో తెలిసిపోయింది సూర్యుడిలావున్న అమ్మ వెలుగు ముందు, నా వ్యక్తిత్వం దివిటీలా వెలా తెలా పోవటం బాగా అలవాటయిపోయిన నాకు ప్రత్యేకత లేదనే బాధ కలగటం ఎప్పుడూ లేదు.

అమ్మా వాళ్ళతో నేను వెళ్ళనవసరం లేదనే వూహ నాకు ప్రాణం పోసినట్టయింది. నా మనసు స్వేచ్ఛగా వూపిరి పీల్చింది. కానీ చల్లటి సాయంత్రం! వంటరిగా యింట్లో కూర్చోవటం కూడా విసుగుగా అన్పించింది.

అమ్మావాళ్ళు అటు వెళ్ళగానే, నేను చెప్పులేసుకుని వంటయింట్లోకి తొంగి చూసి, "తాయారమ్మగారూ! నే నిప్పుడే అలా వాకింగ్‌కి వెళ్ళి వస్తాను" అన్నాను.

"ఒక్కరూనా!" ఆవిడ ఆశ్చర్యంగా అడిగింది.

"ఎక్కువ దూరం వెళ్ళను లెండి." నేను ఆవిడ సమాధానం కోసం ఆగకుండా బైటకి వచ్చేసాను.

గేటు బైటకి వచ్చిన నేను ఒకక్షణం తటపటాయించి వెనక్కు తిరిగి

యింట్లోకి వెళ్ళి, నాన్నగారిగదిలో పుస్తకాల వెనక గుప్తంగా దాచిన రీలు తీసుకుని మళ్లీ బైటకి వచ్చాను.

మా వీధి వెనకవైపునవున్న మెయిన్‌రోడ్డులో కుడివైపుగా చివరికి వెళితే అక్కడ ఒక ఫొటోస్టూడియో వుంది. అక్కడికి వెళ్ళి అది కడగమని యివ్వటానికి నిశ్చయించుకున్నాను.

ఆ సాయంత్రం వేళ, వీధిలో అలా ఒంటరిగా, కాలినడకని వెళుతూవుంటే నాకెంతో సంతోషంగా, హాయిగా అన్పించసాగింది. నా శరీరంలో నూతన రక్తం ప్రవహిస్తున్నంత వుత్సాహంగా అన్పించింది. నా మనసు రెక్కలగుఱ్ఱంలా గాలిలో తేలిపోసాగింది.

మళ్లీ అదే భావం!

మళ్లీ మళ్లీ అదే ప్రశ్న!

నే నెంత ప్రయత్నించినా అమ్మ సమక్షంలో ఎందుకిలా వుండలేకపోతున్నాన

దీనికి కారణం ఏమిటి?

అమ్మ నన్ను ద్వేషించదు. మాటలతోగాని చేష్టలతోగాని ఎప్పుడూ నన్నుగాయపరిచినట్టుకూడా గుర్తులేదు. ఎంతో చనువుయిస్తుంది. అయినా సరే! నాకు స్వేచ్ఛలా అన్పించదు. అమ్మముందు నా అసలుస్వరూపం నత్తగుల్లలో పురుగులా ముడుచుకుపోతుంది. నేను ఒక్కదాన్ని యింతేనా? లేక అందరు పిల్లలూ తలిదండ్రుల ముందు ఇలాగే భావిస్తారా! నాకు తెలిసినంతవరకూ నా స్నేహితుల్లోగాని, పరిచయస్థుల్లోగాని ఎవరూ యిలా లేరు. నా ఒక్కదానికి యిలా అవటానికి కారణం ఏమిటి?

బహుశా అమ్మకి నేను ఒక్కదాన్నే సంతానం కావటంవల్ల కావచ్చు.

నా గురించి ఆవిడకి వున్నతమైన ఆశయాలు వుండటంవల్లకూడా కావచ్చు. అమ్మ ఆశల శిఖరాలకి నేను ఎగబ్రాకలేనేమో ననే నా సందేహం, భయంకూడా కారణం కావచ్చు!

నేను మామూలు ఆడపిల్లని! అమ్మ ఈ విషయం ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది. ఆంధ్రదేశంలో వున్న కొన్నిలక్షలమంది ఆడపిల్లల్లో నేనూ ఒకదాన్ని తప్ప, నాలో యింకే ప్రత్యేకతా లేదని నాకు తెలుసు. కానీ, తనకూతురైన నాకు ఒకప్రత్యేకత అపాదించాలని, నన్నొక వినూత్నమైన వ్యక్తిని చేయాలని అమ్మ పడే తాపత్రయాలన్నీ వరసగా గుర్తుచేసుకుంటే నా గుండెల్ని ఎవరో మంచు ముద్దతో నొక్కినట్టు అన్పిస్తుంది. వెంటనే దిగులు, నీరసం ఆవరించుకుంటాయి. నన్ను నన్నుగాకాక, యింకెవరిగానో వూహించుకునే అమ్మని చూస్తే నాకుభయం!

# యువ

దీపావళి సంచిక

ప్రముఖ రచయితల
రచనలు, వర్ణచిత్రములు,
కార్టూనులతో

ఇంకా ఇతర ఆకర్షణలతో

గ్లేజు కాగితం పైన,
1/4 డెమ్మీ సైజులో

అక్టోబరు చివరివారంలో
విడుదల అవుతుంది.

మీ కాపీ యువ ఏజంటు దగ్గర
రిజర్వు చేసుకోండి.

**యువ కార్యాలయం**

హైదరాబాదు-4.

# ఐటెక్స్

సౌందర్య సాధనములు

ఐటెక్స్ కాటుక
ఐటెక్స్ బిందీ తిలకం
ఐటెక్స్ కుంకుం పేస్టు






**ARAVIND LABORATORIES**

**P. B. 1415., MADRAS-17**

ఆవిడముందు నా స్వేచ్ఛ పంజరంలో పిట్టలా అయిపోతుంది. నిజం చెప్పాలంటే అమ్మ ఆపేక్ష నాకు పులిబోనులా కన్పిస్తుంది.

నేను పరధ్యానసగా యిలా ఆలోచిస్తూనడుస్తూనే, ఫొటోస్టూడియో దగ్గరకివచ్చాను. రీలు వాళ్ళకి యిచ్చేసి ఎన్నికాపీలు కావాలోచెప్పి అడ్వాన్స్ చెల్లించి ఫొటో స్టూడియోలోంచి యివతలకు వచ్చి మళ్లీ యింటివైపు నడకసాగించాను.

వచ్చేటప్పుడు ఏదో ఆలోచనలోపడి గబగబానడిచి వచ్చేశాను. తిరిగివెళ్లేటప్పుడు నిదానంగా, మనుష్యుల్ని చూసుకుంటూ, సాధ్యమైనంత ఆలస్యంగా యింటికి వెళ్లాలని నిశ్చయించుకుని తీరికగా నడవసాగాను.

నా ఎదురుగా వస్తున్న మనుష్యుల్లో, సన్నగా బక్కపలచగా, పుండి, పొట్టిగా, మూసినగొడుగుని చంకలో పెట్టుకుని వస్తున్న ఒక వయసుమళ్లిన ముసలాయన నన్ను చూడగానే నవ్వాడు.

నేను ఆయన్ని చూడగానే అప్రయత్నంగా ఆగిపోయాను. ఆయన పరిచయస్థు

డిలా దగ్గరగా వచ్చి ఆగాడు. నేను ప్రశ్నార్థకంగాచూస్తూ, రాని నవ్వుని తెచ్చిపెట్టుకుంటూ నవ్వాను. ఈయనని చూసాను ! కాని ఎక్కడ? నాకువెంటనే గుర్తురాలేదు.

"నన్ను గుర్తుపట్టలేదా? నేను! - మొన్న బెజవాడ రైలు ప్రయాణంలో - "

ఆ ! అవును. మామి భర్త ! మొదలియార్ గారు ! నాకు వెంటనే గుర్తుకువచ్చింది. అప్పుడు ఆయనకి గుండులేదు. బహుశా మెడ్రాస్ వెళ్ళినప్పుడు తిరుపతి వెళ్ళి వుండవచ్చు. నేను సంతోషంగా, వినయంగా నమస్కరించాను.

"ఏమ్మా ! యిలా నడిచి వస్తున్నావేం?" ఎంత మర్యాదగా అడిగారాయన.

"ఈ ఫొటో స్టూడియోలో రీలు యివ్వటానికి వచ్చానండీ." రెట్టింపు వినయంగా సమాధానం యిచ్చాను.

"మా యిల్లు యిక్కడే. పద వెళ్దాం. మామి నిన్ను గురించి చాలా సార్లు అనుకుంది".

"యిప్పుడా ?" సందేహించాను.

"ఏం ? ఎంతోసేపు పట్టదు. రావటం, వెళ్లటం అంతా పది నిముషాలు. అదుగో ఆ సందులోంచి వెళితే చాలా దగ్గర. రా ! రా ! నిన్నిలా హఠాత్తుగా తీసుకుని వెళితే, మీ మామి సంతోషం చూసితీరాల్సిందే."

ఆయన ఆహ్వానాన్ని తిరస్కరించలేకపోయాను. ఎక్కువ దూరం లేదంటున్నాడు. ఇప్పుడు నేను యింటికి వెళ్లి చేసేదికూడా లేదు. అమ్మావాళ్లు రాత్రి 8 గంటలకు గాని యింటికి రారు. ఆయన వెంట నడిచాను. ఆయన ఆఫీసు యిక్కడికి దగ్గర దగ్గర మైలుదూరం వుంటుంది. వుదయం బస్సులో వెళ్లి సాయంత్రం రోజూ యిలా నడుచుకుంటూ వస్తాడుట. డాక్టర్ ఆయనకి నడక చాలా అవసరం అని చెప్పాడుట. ఇల్లు ఫొటో స్టూడియోకి నాలుగైదు ఫర్లాంగులు వుంది. ఎదురుగా వున్న సందులోంచి వెళ్లడంవల్ల దగ్గరైంది. అదే కారులో రావాలంటే మెయిన్‌రోడ్డుమీద నుంచి చుట్టిరావాలి. చాలా దూరం. వీళ్ల యిల్లు మా యింటికి యింత దగ్గర అని తెలిస్తే యీ సరికి నేను తప్పకుండా ఒకసారయినా వెళ్లి వుండేదాన్ని.

నన్ను చూడగానే మామి చెప్పలేనంత ఆనందపడిన దానిలా, ఆశ్చర్యపోయిన దానిలా చూసింది. నమస్కారం చేయబోతున్న నన్ను చప్పున రెండు చేతులూ జాపి దగ్గరకు హత్తుకుంది. ( సశేషం )

---

**Printed and Published by A. Sudhakar Rao for Yuva Publications, Hyd-4. and Printed at Yuva Press, Public Garden Road - Hyderabad-1. Phone 36336**
**Controlling Editor: Sri "CHAKRAPANI"**



అవతారమూర్తి

YUVA October '69 One Rupee Regd. No. H 131

# ప్రతియింట తప్పక వుండదగినవి!

## జిందా తిలిస్మాత్

దగ్గు,జలుబు,తలనొప్పి
వళ్ళునొప్పులు,డిసెంట్రీకలరాకు





## ఫరూకి పళ్ళపొడి

శుభ్రతకు,ఆరోగ్యకరమైనదంతములకు

తయారు చేయువారు:-

**కార్ఖాన జిందాతిలిస్మాత్**



హైదరాబాద్, A.P.(INDIA)